# నన్ను గురించి కథ వ్రాయవూ?

బుచ్చిబాబు కథలు

ఆరవ సంపుటి

## బుచ్చిబాబు

పల్లవి పబ్లికేషన్స్
ఏలూరు రోడ్ ● విజయవాడ-520002

# నన్ను గురించి కథ వ్రాయవూ?

బుచ్చిబాబు కథలు-ఆరవ సంపుటి

ప్రచురణ : పల్లవి పబ్లికేషన్స్
కారల్ మార్క్స్ రోడ్, విజయవాడ-2.

మొదటి ముద్రణ : 1994, సెప్టెంబర్

ముద్రణ : వెంకట సత్య ప్రింటర్స్
విజయవాడ-3

వెల : రు. 30-00

# కళాతపస్వి

"తన వ్యక్తిత్వాన్ని దిగమింగి అహంని జయించటంలోనే కళాకారుడి పురోగమనం ఉందన్న సూత్రాన్ని నేను స్వీకరిస్తాను"- అన్నాడు బుచ్చిబాబు తన "అంతరంగ కథనాన్ని" ముగిస్తూ. ఆ మాటని అక్షరాలా జీవించిన కళాకారుడు బుచ్చిబాబు.

బుచ్చిబాబుకి ఆధునిక తెలుగు సాహిత్యంలో వొక విశిష్ట మైన స్థానం ఉంటుంది.

బుచ్చిబాబు చాలా సాహితీ ప్రక్రియల్లో కృషి చేసినా, ఆయన ప్రథమంగా కథకుడు తెలుగు కథానికను మళ్ళామళ్ళా చదివించే వొక ఖండ కావ్యంలా రూపకల్పన చేసిన కథకుడు బుచ్చిబాబు ఆయన కథల్లో గొప్ప కవితావేశం, కళాపటిమ సౌందర్యదృష్టి, మనోవిశ్లేషణ గోచరిస్తాయి. ఆయన కథలన్నింటి లోను వస్తువు-మానవుడి అంతరంగం. చాలామంది కథకులు మనిషిని బాహ్యంగా మాత్రమే చూపిస్తారు-బుచ్చిబాబు తన కథల్లో మనిషి అంతరంగాన్ని వివిధ రూపాల్లో చిత్రిస్తాడు. ఆధునిక నాగరకతలో పూర్తిగా లౌకిక విలువలకి లొంగిపోతున్న మానవుడిలో ఎక్కడో అణిగిమణిగి ఉన్న కళాతృష్ణ, అలౌకిక విలువలు వొకానొక సన్నివేశంలో ఉప్పొంగి బయటపడటం ఆయన కథల్లో చూస్తాము. ఆయన వ్రాసిన 'మేడమెట్లు' 'ఎల్లోరాలో యేకాంత సేవ' 'నిరంతరత్రయం' 'అరకులోయలో కూలిన శిఖరం' 'నన్ను గూర్చి కథ వ్రాయవూ' 'ఖి' 'తడిమంటకి

పొడిపిలుపు' మొదలైన కథలు తెలుగు పాఠకుల్ని యుగయుగాల వఱకు ఉఱ్ఱూతలూగించగల గొప్ప ఖండకావ్యాలు.

ఆయన వ్రాసిన యేకైక నవల "చివరకు మిగిలేది" తెలుగు నవలా సాహిత్యంలో చరిత్రను సృష్టించిన నవల. అది నవల కాల్పనికోద్యమంనుండి బయటపడి నిజమైన ఆధునికతను సాధించటం- 'చివరకు మిగిలేది'తో ప్రారంభమైంది. ఈ నవలలో బుచ్చిబాబు సృష్టించిన పాత్రలు-దయానిధి, కోమలి, అమృతం-తెలుగువాళ్ళ కలల్ని, కన్నీళ్ళని, గాథల్ని, బాధల్ని శాశ్వతంగా పంచుకుంటారు. కలకాలం తరిగిపోని సౌందర్యంతో విలసిల్లే వొక కళాఖండం 'చివరకు మిగిలేది'.

రచనల్లోనే కాదు - నిత్యజీవితంలోను - నిజమైన కళోపాసకుడిగా, సంపూర్ణ మానవుడుగా, స్నేహవత్సలుడుగా జీవించిన గొప్ప కళాతపస్వి బుచ్చిబాబు. నడివయస్సులోనే ఆయన మనకి దూరమైనా సాహితీ లోకంలో బుచ్చిబాబు అమరుడు.

(సృజన-మాసపత్రికలో ప్రచురించిన వ్యాసం ఆధారంగా

# కృతజ్ఞతలు

కథల సేకరణలో మాకు ఎంతో సహకరించిన మిత్రులు శ్రీ జె. వెంకటేశ్వరరావు గారికి, ఇంకా సహకరించిన సాహితీ మిత్రులందరికీ

—పబ్లిషర్స్

# కథాక్రమం

# మూడు కోతులు

ఏదో అవసరమున్నప్పుడు తప్ప మనకి యీ రోజుల్లో స్నేహితుల జ్ఞప్తికి రారనుకుంటా. ఆమధ్య అనుకోకుండా బెంగుళూరు ప్రయాణం తగిలింది. స్నేహితుడు మోహన్‌బాబుకి స్టేషన్‌కొచ్చి కలుసుకోవల్సిందని టెలిగ్రామిచ్చి బైలుదేరాను.

సుఖాన్ని పంచుకొన్న స్నేహితులపైకంటె, బాధని పంచుకొన్న స్నేహితులపట్ల జాలితో కూడుకున్న ఒక ప్రత్యేకమైన అభిమానం వుంటుందనుకుంటాను.

మహాత్ముడు అస్తమించిన రోజులవి. ఆ వార్త విన్న తర్వాత వారంరోజులు నేనూ, మోహన్‌బాబూ సరిగ్గా భోజనం చెయ్యలేము. రెండు రోజులు ఉపవాసముండి, మహాత్ముని జీవితఘట్టాలని స్మరించుకుంటూ వారి జీవితచరిత్ర చదువుకుంటూ, వారి ఫొటోలు చూసుకుంటూ గడిపి బాధను పంచుకున్నాం. మమ్మల్ని గురించి కాకుండా, ప్రపంచం గురించి బాధపడటం కొత్త అనుభవం. ఆదర్శాల ఐక్యతలో తాత్వికమైన అనుభూతివున్నా, ఆ ఆదర్శాలని జీవితంలో సాధించలేవేమో అన్న భయం కూడా వుంది. ఈ భయమే మా స్నేహానికి కారణమని యిప్పుడు తోస్తోంది.

మూడుకోతుల ప్రతిమ ఆ రోజుల్లోనే ప్రచారమైంది. ఒక కోతి చెవులు, రెండోది కళ్ళు, మూడోది నోరూ మూసుకుని వుండే యీ కోతుల ప్రతిమను మహాత్ముడు తనదగ్గర వుంచుకొనేవాడట. చెడు చూడొద్దు; చెడ్డమాట వినొద్దు; చెడు చెప్పకు– యీ మూడు నైతిక సూత్రాలకు ఆ ప్రతిమ సాంకేతిక చిహ్నం. ఈ కోతులగాథ పుట్టుపూర్వోత్తరాలు నాకు తెలియవు. చీనాదేశపు పిట్టకథలలో అవతరించిందని కొందరంటారు. వాల్మీకి రామాయణంలో ఆంజనేయులు, లౌకికజగత్తులో ప్రయోజ

కత్వానికీ, ఐహిక బలానికీ, శారీరక శక్తికే చిహ్నంగా పరిగణిస్తారు కొందరు. బౌద్ధ కథా వాఙ్మయంలో కోతి కొత్త అవతారం దాల్చింది. చీనా దేశపు తత్వజ్ఞుడు "ఊ చెంగ్-ఎన్" కోతినిగూర్చి వ్రాసిన గ్రంథంలో ఓ చిత్రమైన కథ వుంది. ఆ కథలో కోతి స్వర్గానికెళుతుంది. అక్కడ కోతల్లరి సాగిస్తుంది. దీనితో వేగలేక అక్కడివాళ్ళు బుద్ధుని రప్పిస్తారు. బుద్ధుడు ఆ కోతితో వో పందెం వేస్తాడు- తన అరచేతినిదాటి అవతలకి దూకగలిగితే, కోతికి స్వర్గంలో సింహాసనం లభిస్తుందని; అల్లా చెయ్య లేకపోతే తాను భూలోకానికి వెళ్ళి కొన్నియుగాలు తపస్సు చెయ్యాల్సి వుంటుందని. అందుకు ఆ కోతి అంగీకరించి దూకడానికి ఉపక్రమిస్తుంది. తన తెలివంతా వుపయోగించి దూకుతుంది. చాలా సేపు దూకుతూ పోతుంది. కొంతదూరం వెళ్ళాక ఆకాశంలోకి పొడుచుకుని ఐదు స్తంభాలు కనబడ తాయి. తాను దూకివొచ్చినందుకు నిదర్శనంగా, వొక స్తంభంపై వెంట్రుకతో "స్వర్గంతో సమానుడైన మహాతపస్వి యిటు వచ్చాడు" అని వ్రాసి తిరిగి బుద్ధునిదగ్గరకొచ్చి, తాను పందెంగెలిచాను కావున, ఆ సింహాసనం యిప్పించమని కోరుతుంది. బుద్ధుడు తన వేలు పైకెత్తి దానిమీద వ్రాసివున్న అక్షరాలను చూపించి, కోతి తన అరచేతిని దాటి వెళ్ళలేకపోయిందని బుజువుచేసి దాన్ని స్వర్గాన్నుండి తప్పిస్తాడు. ఈ కథలో తెలివికి, ప్రజ్ఞకి చిహ్నంగా అవతరిస్తుంది కోతి. విజ్ఞానం చాలదు, జ్ఞానంకూడా ఉండాలని బోధ.

మూడుకోతుల ప్రతిమకి నైతికరంగంలో ప్రాముఖ్యం కల్పించాడు గాంధీజీ. ఆ రోజుల్లో మూడుకోతుల చెక్కుడు బొమ్మ ఒకదాన్ని సంపాదించాను. మోహన్‌దాసు పైచదువుకి వెళుతుంటే, జ్ఞాపకంగా ఆ బొమ్మని అతనికిచ్చి వేశాను.

బెంగుళూరు మరోగంటలో వస్తుందనగా రైలు ఒక స్టేషన్‌లో నిలిచింది. ఫలానా 'చిత్రం చూశారా?' అంటూ, చేతులను కళ్లకి అడ్డంగాపెట్టుకున్న కోతిబొమ్మ ఎడ్వర్‌టైజ్‌మెంట్ ఒకదాన్ని అక్కడ చూశాను. అది చూసినప్పట్నుంచి, యీ మూడుకోతుల ప్రతిమగూర్చి కొన్ని

శంకలు వస్తాయి. 'చెడ్డమాట వినొద్దు' అని చెవులు మూసుకోటం విషయం చూడండి. వాస్తవ విశ్లేషణ ద్వారగాని ఆ మాట చెడ్డదో మంచిదో తెలిసొచ్చేది? అట్లాగే చెడుగ చూడకుండా కళ్ళు మూసుకోవడం, చూడటం మొదలుపెట్టిన తర్వాతేగదా, అది చెడో మంచో తెలియడం? అసలు చెడ్డవిషయాలవల్లే మనిషి కుతూహలం రేకెత్తేది. ఈ ఉదాహరణ చూడండి: నేనొక సభలో వున్నాను. అక్కడ ఒక దుండగీడు తుపాకి పైకితీసి ఒక వ్యక్తికేసి గురిపెట్టడం చూశాను. గురి బాగా చూస్తున్నాడు. సమయంకోసం వేచివున్నాడు. మరోక్షణంలో ఆవతలవ్యక్తి— ఒక ప్రముఖ పురుషుడు అనుకుందాం- హత్యకాబడతాడు. నేను చూస్తున్నది చెడుగే—హత్యాకాండ. అటు చూడకుండా కండ్లు మూసుకోవడమా? లేక నా ప్రక్కనవున్న పోలీసు ఉద్యోగి జేబులోంచి పిస్తోలు తీసి, ఆ తుపాకి వ్యక్తిమీద పేల్చి, ఆ ప్రముఖపురుషుడి ప్రాణాలు కాపాడటమా? అట్లా కాపాడితే 'అయ్యో పాపం- ఒక గొప్పవ్యక్తి ప్రాణం కాపాడాడు— ఇతన్ని నాయకుడిగాచేసి, ఒక శిలాప్రతిమని అతనిగ్రామం మధ్యగా నెలకొల్పుదాం' అని అంటారా ప్రజ? హంతకుడిని చంపినా, నే నొక హంతకుడుగా పరిగణింపబడి, శిక్షకి పాత్రుడ నవుతాను. న్యాయం, చట్టం- వీట్లకి వ్యక్తుల విచక్షణలేదు. జడ్జిగారు మంచివాడైతే, 'ఈ హత్య చెయ్యడంలో యితని ఉద్దేశం ప్రశంసనీయమైంది— ఒక ప్రజాసేవకుడి ప్రాణం కాపాడాడు- కాన, ద్వీపాంతరవాసం విధిస్తున్నాను' అనొచ్చు నేమో. కొన్ని సందర్భాలలో ఏది మంచో, ఏది చెడో ఎవ్వరూ నిర్ణయించలేరు. మొత్తంమీద గమ్యస్థానం మంచిదైనా, చేరుకునే మార్గం చెడ్డదైతే కళ్ళు గట్టిగా మూసుకోడమే మంచిదని, యీ కోతి తత్వం. కళ్ళు మూసుకునేటందుకు రెప్పలున్నాయికదా- మళ్ళా యీ చేతులతో గట్టిగా మూసుకోడం దేనికో! వేళ్ళసుధ్య సందులోంచి కాస్తకాస్త చూడ వచ్చుననా! ఏమో నాకు తెలీదు. కొన్నికొన్ని విషయాల గూర్చి తీవ్రంగా శోధించక, అల్లా విడిచిపెట్టడమే శ్రేయస్కరం.

అల్లాగే చెడుచెప్పకుండా నోరునొక్కుకోవడం, చెడుగుని చూడకుండా, వినకుండా వున్నవారికి, అసలు చెప్పేటందు కేముంటుంది?

మహత్తర సత్యానికీ, సౌందర్యానికీ ఎల్లానూ నోరులేదు. దైవాన్ని తపస్సుద్వారా సందర్శించిన యోగిపుంగవుడికి భాషతో నిమిత్తంలేదు. ఆలోచనని మరుగుపరిచేందుకే భాష అంటున్నారు పెద్దలు. జీవితాన్ని చూడకుండా, వినకుండా, స్పృశించకుండా వున్నవారికి ఆలోచన లేముంటాయి? ఇలా వెళ్ళినకొద్దీ రోజులు పెరుగుతూంటాయి. అందుచేత అట్టే ఆలోచించక, మరోవిషయంపైకి దృష్టి మరల్చాను ఇంతలో బెంగుళూరుస్టేషను రానే వచ్చింది.

ప్లాట్‌ఫారంమీద మోహన్‌బాబు సిద్ధంగా వున్నాడు. ఏమిటో మనల్ని కలుసుకోడంకోసం ఎవరైనా స్టేషన్‌కి వచ్చారంటే మనపైనా ఆ వచ్చిన వ్యక్తిపైనా అపేక్ష, గౌరవం పెరుగుతాయి. పక్కవాటా వాళ్ళకి ఉత్తరాలు ఇచ్చి వెడుతూవున్న పోస్టుమాన్ 'మీకేమీ లేవండి' అన్నప్పుడు దిగాలుపడి పోతాం. ఈ చిన్న విషయాలే మన వ్యక్తిత్వం, ఉనికిని రుజువు చేస్తాయనుకుంటాను. మోహన్‌బాబు దిగగానే నన్ను కౌగలించుకొని మందహాసం చేసినా అతనెందుకో దిగులుగా వున్నట్లు కనిపించాడు. మహాత్ముడు అస్తమించిన రోజుల్లో మాటా, పలుకూ లేకుండా ఒకరివంక ఒకరు దిగులుగా చూస్తూ కూర్చున్న దృశ్యం స్మరణకొచ్చి కాబోలు....!

ఒక మొహంయొక్క వర్చస్సు పంచుకొన్న ఒక అనుభవంతో ముడిపడి మనస్సులో నిలిచిపోయిన తరువాత కొత్త జీవితానుభవాలు దాన్ని కాలచక్రంలో పడేసి రకరకాలుగా సాగేసినా మన మనస్సులోవున్న ఆ ప్రతిమ వైఖరి మటుకు మారదు. చదువూ, సంస్కృతీ పెంచుకొని మోహన్‌బాబు ముందుకు ప్రయాణం చేస్తున్నా నుదుటిమీది జుట్టుమాత్రం వెనక్కి జరుగుతూవుంది. పళ్ళమీద శ్రమతో కదిలిన నవ్వు, కళ్ళల్లో మూలలకి నక్కినట్లనిపించింది. మనిషి చిక్కాడు. హడావిడిగా గడ్డం చేసుకొన్న వైఖరి.

"ఏం అలావున్నావు, వంట్లో బాగాలేదా? రా వెడదాం" అని సామాన్లు పోర్టరు నెత్తినపెట్టి వెనకాతే నడుస్తున్నాం గేట్లో యివ్వడానికి టిక్కెట్లు పైకి

"సామాన్లు వెయిటింగురూమ్‌లో పెడదాం. రా, చెప్తాను" అన్నాడు మోహన్‌బాబు.

"ఏం....కథ ?"

"నేను యింటికివెళ్తున్నాను. నా రైలు మరో గంటా గంటన్నరలో వస్తుంది. అంతవరకూ యిక్కడే కబుర్లు చెప్పుకుందాం" అన్నాడు.

"ఇంటికెందుకూ, ఇవాళే వెళ్ళాలా ?"

"ఏదో సంబంధం వచ్చిందిట, చూడ్డానికి రమ్మన్నారు."

పైకి నవ్వేశాను. వెయిటింగ్‌రూములో వ్యక్తులు మాకేసి చూశారు.

"పెండ్లి సంబంధానికి వెడుతూ అంత దిగులెందుకూ ? అయినా- ఊహించగలనులే- చాలామందికి పెళ్ళంటే భయం-అంటే ఒకామెను చేసుకోగానే మిగతా కన్యలనుండి విడిపోవాలే అనే దిగులుకామా !" మోహన్‌బాబూ నవ్వడం సాగించాడు. అపచారంచెయ్యని దోషిలాగ.

"అల్లా కాఫీ తాగివొద్దాం రా, నీతో చాలా చెప్పాలి."

బయల్దేరాం.

"నేను దిగులుగా వున్నానని నీ కెట్లా తెలుసూ ?"

"ఏదో అల్లాగనిపించింది."

"అదంతా పెద్ద కథ" అని చెప్పడం సాగించాడు. కథకి తుదీ మొదలూ వుండాలన్నారు పెద్దలు. దానికో స్వరూపం వుండాలి. అప్రస్తుతమైన నిత్యజీవితమనే చెత్త కాగితాల బుట్టలోంచి ప్రస్తుతానికి పనికొచ్చే కాగితం ముక్కలని ఏరి అతికించి కూర్చి నైతిక విలువలుకట్టే న్యాయస్థానంలో దాఖలు చేసుకోవాలి. ఈ పనికి తగినంత అనుభవం, శిక్షణ, వున్నా లేకపోయినా సమయానికి న్యాయస్థానంలో దాఖలు చెయ్యడం తప్పదుగనక నా ధోరణిలో ఆ కథ చెప్తాను.

పరీక్షకోసం బెంగుళూరులో వొక నెల వుండాల్సివొచ్చి, హాస్టల్‌లో చోటుదొరక్క, హొన్నప్పగారింట్లో వో వాటాలో మకాం వుంటున్నాడు మోహన్‌బాబు. ముందు రెండు గదులు, వొక వరండా, దానిముందు నాలుగైదు పూలమొక్కలు, కిటికీలోంచి భిటాదుకొమ్మదాకా కనబడ్తే

రెండు కొబ్బరిచెట్లు, కాంపౌండుగోడ—అదీ అతనివాటా. బల్లమీద అలారమ్ గడియారం, రబ్బరు కోతుంబొమ్మ, గోడమీద గాంధీగారి పటం, స్నేహితులతో కలిసి తీయించుకున్న ఫొటో అమర్చుకున్నాడు. భోజనం హోటలునుండి కారియర్‌లో వాళ్ళ పనిపిల్ల 'నానీ' తీసుకొస్తుందిట. గది వూడ్చడం, పక్క వెయ్యడం తీయడం, కాఫీ తెచ్చిపెట్టడం, ఉత్తరాలు పోస్టుచెయ్యడం- యిల్లాంటి చిల్లరపనులు చేస్తుంది 'నానీ'. వాళ్ళమ్మ అలిమేలు, హొన్నప్పగారింట్లో పనిచేస్తుంది.

హొన్నప్పగారు వ్యాపారస్థుడు. బస్తీ సంస్కృతి అంతగా అబ్బని పూర్వాచారపరాయణుడు. ఆయన భార్య అన్నపూర్ణమ్మగారు-మరీ ఛాందసురాలు. కొడుకు మాధవరావు (ముద్దుగా ఇంట్లో 'మావూ' అని వ్యవహరిస్తారట) పట్నంలో చదువుకుంటున్నాడు. సెలవలకివొచ్చి, వారం పదిరోజులు కులాసాగా గడపి వెడుతూవుంటాడు. ఇంతకంటె మోహన్ బాబుకి వారిని గురించి ఏమీ తెలియదు. ఇవేనా నానీద్వారా తెలుసుకున్నవే. 'నానీ' కన్నడప్రాంతంలో వుండిపోయినా తెలుగు బాగానే మాట్లాడుతుంది.

స్నానంగదికి సన్నటి సందులోంచి వెళ్ళాలి- ఆ సందు పొడుగునా గోడవుంది. అట్లా వెడుతుంటే అప్పుడప్పుడు హొన్నప్పగారింట్లో సంచలనం, మాటలు, సగంసగం వినబడుతూంటాయి. కాని మోహన్‌బాబు వాటినెప్పుడూ నిదానించి వినలేదు. అయినా ఆ వృద్ధదంపతులకు చెప్పుకునే మాట్లేముంటాయి ?

మోహన్‌బాబు వారిపట్ల కాస్తంత కుతూహలం కనబరచినా, దానికి కారణం కొంతవరకూ 'నానీ'యే. నానీ ఇరవైయ్యేళ్ళ వయసుపిల్ల. దుబ్బుగా వొంకులు తిరిగిన ఆ జుట్టులో మొహం గుండ్రంగా కనిపించినా, పరీక్షగాచూస్తే కోలమొహం. మోహన్‌బాబుకి కోలమొహం ఇష్టం. గుండ్రటి 'చంద్రబింబంలాంటి' మొహం అంటే రోత. కోలమొహంలో ఒక నాజూకు 'గ్రేస్' వుందంటాడు. ఆ నాజూకు 'నానీ' శరీరం అంతటా వుందిట. పోషణ, షోకు లేక చింపిరిగా వుండటం మూలాన, ఆ నాజూకు మరింత స్ఫుటంగా ఆకర్షిస్తుందిట. సన్నటినడుం, పొడుగాటికాళ్ళు, తీర్చిన

వక్షం, రెండుచేతులనూ గొక్క... నొక్కి ...లనిపించే నునుపైన చేతులు—గాజులరేవు అందుకే మరీ ఆకర్షణీయంగా వుంటాయిట. మెళ్ళో ఏమీలేవు. చెవులకేమీలేవు-లవంగాలతప్ప. ఆ సన్నటి నడుంపై, బరువుగా పెద్దవిగా కనిపించే స్తనాలు మరింత ఆకర్షణీయంగా వుంటాయిట వొదులు రవికలోంచి ఎంత బిగించి కట్టినా. గది ఊడుస్తున్నప్పుడు, మధ్య లోతైన పాయచుట్టూ వాటి కదలిక సుందరతరం, నునుపు వాటినిచూసి తాత్కాలికంగా సంతోషపడే అవకాశాలెన్నో వున్నాయిట. ఆధునిక శిల్పాలలో అట్లాంటి నగ్నస్త్రీ సౌందర్యాన్ని చూశాడు—బెంగుళూరు ఆర్ట్ ఎగ్జిబిషన్‌లో. ఆ మధ్య వొంగి వూడుస్తున్నప్పుడు, నానీ వక్షం అల్లాగే అనిపించింది.

ఆ రోజున గది వూడుస్తూ గారికి తలుపుదగ్గరగా చూసినప్పుడు కొంగు తలుపుసందులో ఇరుక్కుని లేపేటప్పుడు, పమిటంతా వూడినప్పుడు, అతను చూడ్డంతో వారిలో వొక అన్యోన్యభావం ప్రబలినట్లనిపించింది. సిగ్గుపడి, చీపురు అక్కడ వొదిలేసి పరుగెత్తుకుపోయింది నానీ. అతను చూసింతర్వాత, పక్కకు తిరిగి బల్లమీద మూడుకోతుల బొమ్మను వెనక్కి తిప్పి నిలబెట్టాడు.

శెలవులకు మాధవరావు పట్నంనుంచి రావడంతో మోహన్‌బాబు ప్రశాంతజీవనంలో సంచలనం బైలుదేరింది. మాధవరావుతో ఇతనెప్పుడూ మాట్లాడలేదు. కలుసుకున్నప్పుడు వొకర్నొకరుచూసి వొకరు నవ్వుకోడం, మందహాసం ప్రకటించడంవరకే వారి పరిచయం.

ఆ రోజు ఇంటిదగ్గరనుంచి మనిఆర్డరొచ్చింది. గదీ అద్దె నానీ ద్వారా పంపుదామని పర్సులోంచి లెక్కతీశాడు. మరో రెండు రూపాయల నోటు చేతిలోకొచ్చింది. 'నానీ'ని పిల్చాడు. వచ్చింది. తలుపు జేరవేశాడు. కిటికీలోంచి అటూ ఇటూ చూశాడు. నోట్లు చూపాడు. నానీ కళ్ళు పెద్దవి చేసింది భయంతో తలవూపింది. చెయ్యి పైకి పెట్టమన్నాడు. చేతులో చీపురు గిరవాటెట్టి గది అవతల తలుపు తెరిచి ఒక్క పరుగున వెళ్ళింది నానీ.

అతనికి నవ్వొచ్చింది. ఎందుకల్లా భయపడుతుంది? ఇంకా పిల్లకి పెళ్ళికాలేదు. అలిమేలు ద్వారా అదికూడా తెలుసుకున్నాడు. పెళ్ళికాకపోతే? ఏవో సంశయం, పెనుగులాట, వున్నప్పుడే ఆడది సిగ్గు ప్రకటిస్తుంది. ఇష్టంలేట్లు అయిష్టం ప్రకటించి, అవతలవాడికి అందకుండా దూరమై, వేటాడబడటం స్త్రీనైజం. అందుకు సృష్టి సమకూర్చిన ఆయుధం సిగ్గు. 'నాని' చేష్ట అతన్ని శౌర్యానికి పురిగొల్పింది. ఇదివరలో ఆమె అలిమేలు ద్వారా పంపేవాడు అలిమేలు ద్వారా పంపడం ఎందుకో? అకనే స్వయంగా పొన్నప్పగారికి ఇవ్వొచ్చుగా. ఈ కొత్త పనికి మధ్యవర్తి ఒకరా? డబ్బుతో కూడుకొన్న వ్యవహారంలో కుటిలత్వం తప్పదు. ఈసారి నానీద్వారా పంపుతేనేం? కొబ్బరిచెట్టు కింద బట్టలు ఆరవేసు తోంది. తాడుమీదికి చేతులెత్తినప్పుడు, కండలపై నీడలు స్ఫుటంగా పడు తున్నాయి. శరీరం అంతా ఒక్కసారి పైకి ఎగబ్రాకి నమస్కారం పెడుతూ దేన్నో ఆహ్వానిస్తున్న శిలాప్రతిమలా— అతనికేసి కోపంగా చూసింది. నల్లగుడ్డు కొసలకి జరిగినప్పుడు, పెదవులు బిగించినప్పుడు 'నానీ' శీలంగల వ్యక్తిగా, తన శీలం అర్పినందుకు విచారించి నట్లు, కొత్త విషాదరేఖలు కూడా ఆమెలో ప్రత్యేకమైన ఆకర్షణ అని, అతనొక్కడికే తెలిసిన రహస్యం. ఆ రహస్యంలో ఆనందం వుంది. అట్లాంటి దింకెవరికీ వుండదు. తనొక్కడే తెలుసుకున్న అనుభవం మరెవ్వరికీ తెలవకపోడంలో, తెలిసే అవకాశం కూడా లేదన్న జిజ్ఞాసలో అతని ఊహా వైశాల్యం పెరిగింది. రహస్యాన్ని సంజ్ఞ చేశాడు— పూడవడం పూర్తిచెయ్యమని. ఊహూ అన్నట్లుగా తలవూపింది. అతనికి కోపం వచ్చింది. మరో పనిమనిషిని కుదుర్చుకోలేడా? మరో కుర్రాణిని. కోపంతో కిటికీతలుపులు గభాలున మూశాడు. కోతులబొమ్మ తనవైపు తిప్పుకున్నాడు. గుమ్మం తలుపు తెరచి చీపురు పైట గిరవాటెట్టి, మళ్లా తలుపులు చప్పుడయ్యేటట్లు మూశాడు. మూశాడేకాని గడియపెట్టలేదు. అందుకు నవ్వొచ్చిం దతనికి.

స్నానానికి బయలుదేరాడు. మండువా సందు దాటించి, స్నానంగది ముందు ఒక పొడుగాటి తడక అడ్డంగా కట్టివుంచె. దానివెనక ఏవో

కంఠాలు వినిపిస్తున్నాయి. ఒకటి హొన్నప్పగారిది. క్షణం నిలిచాడు. మరో స్త్రీ కంఠం వినబడుతోంది. అది అన్నపూర్ణమ్మగారిది కాదు. గుసగుసలోకి సన్నగిల్లిన కంఠాలు అతని కుతూహలాన్ని రేపాయి. అది విన్న కంఠమే. అలిమేలుది. మరో అడుగు ముందుకేసి, మరోక్షణం ఆగాడు. నోట్లు లెక్కపెడుతున్న చప్పుడు వినబడుతోంది. 'రెండు' - రెండొందలు. ఎవరు ఎవరికిస్తున్నారో తెలీదు. గుసగుసలు నిలిచాయి. సన్నగా గాజుల చప్పుడు. హొన్నప్పగారి నవ్వు. లోపలినుంచి అన్నపూర్ణమ్మగారి పిలుపు- అంట్లు తోముతున్న శబ్దం. దూరంగా ఏదో పిట్ట. వేడినీళ్ళ కాగుకింద కట్టెలచప్పుడు, తనకెందుకు? స్నానంగదిలోకి వెళ్ళాడు. అతని మనస్సు బాగాలేదు. హొన్నప్పగారికీ, అలిమేలుకీ ఏవో ఉందన్న అభిప్రాయం దృఢపడుతోంది. ఒకప్పుడున్న స్నేహం ఇంకా కొనసాగుతోందో మరి! వయస్సు ముదిరిన పోకిరీచేష్టలని కాపాడేది వారి వయస్సే. ఆ ధైర్యంతో వారెన్నైనా చెయ్యొచ్చు. సంఘం పట్టించుకోదు- భార్యకి అన్యాయం జరగనంతసేపూ. అలిమేలుకి మొగుడులేడు. యుద్ధంరోజుల్లో చనిపోయ్యాడు. డబ్బుతో సమాజంలో వ్యక్తుల స్థానం నిర్ణయించి, విలువలు కట్టిపారేసి స్థిరంగా వుండగలం అనుకుంటాంగాని, అది పూర్తిగా నిజంగాదు. వయస్సునుబట్టి, నైతికరంగంలో విలువలు కట్టొచ్చు. హోదానుబట్టి కట్టొచ్చు. మనస్తత్వం బట్టి కూడా కట్టొచ్చు. శృంగారమయ జీవితానికి అలవాటుపడ్డ వ్యక్తి, చివరంటా అల్లాగే వుంటాడు. అదీ ఇంకా పెరుగుతూ వుంటుంది కూడా. అందుకనే దురంతాలు పెద్దలకే సాధ్యమౌతాయి.

కాని మోహన్‌బాబు పెద్దవాడుకాదు. నానీపట్ల తనకెందుకు అట్లాంటి ఆలోచనలు? తన సిద్ధాంతం తప్పు. వయసులో శృంగారం సహజమైంది; వార్ధక్యంలో కృత్రిమమైంది. చిన్నప్పుడు యవ్వనం కాపాడుతుంది. పెద్దయిందర్వాత. హోదా, డబ్బు కాపాడతాయి— అని సమర్థించుకుంటూ గదిలో కొచ్చేటప్పటికి, 'నానీ' గది వూడుస్తోంది. అతను రాగానే నిలిచి నవ్వింది. అతను కోపంగా చూశాడు.

"ఇదిగో- ఇంటద్దె- అయ్యగారికి- హాన్నప్పగారికి ఇచ్చినా" అని పర్సులో రూపాయల నోట్లు తీసిచ్చాడు. కుడిచేతిలో చీపురు ఎడం చేతిలోకి ఫిరాయించి, తొడమీద తుడుచుకొని, అరచెయ్యి ముందుకు చాచింది. చేతికి రెండంగుళాల పొడుగున, ప్లాస్టిక్ గాజులుండటం చూశాడు- ఎర్రవీ, పచ్చవీ, నల్లటివీ. వాటికేసి చూసి నవ్వుతూంది.

"తెలిసిందా ?"

తెలిసిందన్నట్లు తల పంకించింది. నోట్లు తీసుకుంది. ఊడవడం పూర్తిచేసి వెళ్ళింది. ఆమె చేతికి ఆ గాజులు బాగుండలేదు. అల్లా బోడిగా వుంటేనే బాగుంటుంది. గదిలో ఒంటిగా వుండటంవల్లనేగా, యీ ఆలోచనలు. బైటికి వెడితే, ఏదీ వుండదు.

రాత్రుళ్లు నిద్రపట్టదు. ఏవేవో ఆలోచనలు. రెండో ప్రపంచ సంగ్రామం- క్విట్ ఇండియా ఉద్యమం- హిట్లర్ దంపతుల ఆత్మహత్య, 'క్రిప్స్'మిషన్, నౌవకాలీ, మహాత్ముని నిర్యాణం, రిపబ్లిక్ దినోత్సవాలు. మూడు కోతులు- బల్లమీద రబ్బరుబొమ్మ- గది వూడుస్తూ 'నానీ'. ఊహ విశాలమైందంటారుగాని, శరీరం ఎంత సంకుచితమైందో, ఊహకూడా అంతే. మానవుడి మెదడుకొలతెంత ? ఆరంగుళాలపొడవు- వెడల్పు. ఊహకూడా అంతే. గిరిగిర తిరిగి మళ్ళా అక్కడికే చేరుకుంటుంది. రక్తం, నరాలు అవయవాలు మెదడుని, ఊహని కట్టిపడేస్తాయి. అనంత విశ్వాన్ని పాలిస్తున్న పరమాత్మ ఆత్మస్వరూపం దాల్చి ఈ కాస్త శరీరంలో దాగివున్నాడంటే నమ్మలేకుండా వున్నాడతను.

ఆ మొర్నాడు ఉదయం అలిమేలు అతని గదిలోకొచ్చి రెండు రూపాయలు తిరిగి ఇచ్చివేసింది— తను అద్దెతోపాటు, ఈ రెండూ అదనంగా యిచ్చాడుగనక. పోనీ మీ అమ్మాయిని తీసుకోమను అందామనుకున్నాడు గాని, తనే స్వయంగా ఇద్దామని నిర్ణయించుకుని ఆ రెండూ తీసుకున్నాడు. నానీపై కోపమూ, జాలికూడా కలిగింది. చాలా అమాయకురాలు- ఏమీ గ్రహించలేదు. నవ్వుతుంది- ఊహలేని భావస్వరూపం: డబ్బుతో నిమిత్తంలేని పవిత్రమూర్తి: [illegible]ని ఉత్తమమైన సుహాసిని.

చెడు చూడము: వినము: చెప్పము. మూడు కోతుల నీతిని జీర్ణించుకొన్న త్రిమూర్తి!

ఆ రాత్రి మోహన్‌బాబుకి నిద్రపట్టలేదు. కొరియా పరిస్థితిని గూర్చి ఆలోచించాడు. అంతర్జాతీయ కార్మిక సంస్థని గూర్చి ఆలోచించాడు. ఈజిప్టు వ్యవహారం గూర్చి తీవ్రంగా ఆలోచించాడు. వాటికి యదార్థాని కున్న వొత్తిడిలేదు- ఆ ఊహాచక్రానికి కేంద్రంలేదు. ఈజిప్టు, కొరియా జెనీవా- అవన్నీ భూగోళ శాస్త్రపటంలో మచ్చలు, పత్రికలలో అక్షరాలు, ఉపన్యాసవేదిక నుండి వెలువడే ధ్వనులు.

దోమ ధ్వని చేస్తోంది. అనేకం దోమలుంటే వాటిని ఎదుర్కో డానికి సిద్ధంగా వున్నాడు తాను— కాని ఒక్కటే వుంటే అతను అసహా యుడు. ఎటునుంచో వొస్తుంది. ఎక్కడ వాలకూడదో అక్కడ వాలు తుంది. రోదిస్తుంది నిష్క్రమిస్తుంది.

లేచాడు- వరండాలోకి నడిచాడు. చెట్టుకింద నిలబడ్డాడు. ఆకులు కదుల్తున్నాయి— కొబ్బరిచెట్లు గుసగుసలాడుతున్నాయి. మందారం ఎర్రకళ్లువా కప్పుకుంది. అవతల గదివైపు వెళ్ళాడు. కిటికీలోంచి నీడలు పడటంలేదు. దీపంలేదు. అంతా చీకటి- ఆకాశంలో నక్షత్రాల కర్థంకాని చీకటి. గది ముందు మెట్టుమీద కూర్చున్నాడు. రాత్రుళ్ళే ప్రాణం హాయిగా వుంటుంది: తన నిజస్వరూపం తనకి తెలుస్తూ వుండే సమయం అదొక్కటే. 'నువ్వెవరవో తెలుసుకో' అంటాయి వేదాలు. ఆ పని రాత్రే సాధ్యమవు తుంది. తనెవరు ? ఏమో !

గదిలోంచి కంఠాలు వినబడుతున్నాయి. అతను ఉలిక్కిపడి, గోడ దగ్గరగా జరిగాడు. పురుషుడి కంఠం- అతనికి తెలుసు, హోన్నప్పగా రబ్బాయి, మాధవరావుది ఆ కంఠం. ఆ రెండోది స్త్రీ కంఠం! మాటలు తెలియడంలేదు- ఏదో చప్పుడు, గాజుముక్కల గొట్టం తిప్పినప్పుడు అందులో గాజు ముక్కలు సన్నగాచేసే చప్పుడికిమల్లే ఎన్నడూలేంది, ఆ ఉదయం 'నానీ' చేతిని ప్లాస్టిక్ గాజులు చూశాడు. ప్లాస్టిక్ గాజులు చప్పుడు చేస్తాయా ? అతను సరిగ్గా చూడలేదు ప్లాస్టిక్ గాజులు కావేమో ! మళ్ళా చప్పుడు నిలిచిపోయింది. ఒకటి రెండు ఇంగ్లీషుమాటలుకూడా వినబడ్డాయి.

'నాసీ'తో ఇంగ్లీషా! లోపలికి చూస్తే, దీపంలేదు. లోపల చీకటి. తను అట్లాంటివి చూడొచ్చా? కళ్ళు మూసుకుని చూడొచ్చునేమో. ఏదో చప్పుడు- ఒక్కడుగువేసిన చప్పుడు. భయమేసింది. లోపలికొచ్చాడు. మంచంపై వాలాడు. నిద్రరాక నరాలు నీరసించి శరీరం తనే నిద్రపోతుంది. దాన్ని విడిచేసి ఊహాయాత్ర సాగించాడు. విశ్వం అనంతంకాదుట ఒక చోటునుండి తిన్నగా ప్రయాణంచేస్తే, ఎప్పుడోఅప్పుడు నిజస్థానానికి చేరుకోవడం తథ్యంట. విశ్వం, సమయానికి బంధింపబడి, రెండూ కాస్తంత వొంగి ఏకమయ్యాయిట- ప్రథమ ముద్దుకోసం పెనుగులాడు తున్న ప్రేమికుల అధరాలకిమల్లే. స్థలం ప్రియుడు, కాలం ప్రేయసి—

వారు విడివిడిగా వుంటే సంతానం వుండును. కలిసివుండటంవల్ల, ఫలితంలేదు. జీవితానికి, అర్థంలేదు, ప్రేమకివుందేమోగాని! అది భౌతిక, ఖగోళశాస్త్రాల నిర్వచనం. తను తిరిగి 'నాసీ' దగ్గరకే వొచ్చాడు. చీకట్లో మూడుకోతుల బొమ్మ కనబడటంలేదు. నైతికవిలువలను పాటించ నక్కర్లేదు. కళ్ళు మూసుకున్నాడు. తెల్లవారింది.

'నాసీ' ఊడవడాని కొచ్చింది. ఆమెకేసి పరీక్షగా చూచాడు. కళ్ళు తేటగా మెరుస్తున్నాయి. పళ్ళు తెల్లగా తళతళ్ళ మంటున్నాయి. అప్పుడే ఉదయించిన సూర్యబింబంలా వుంది- ఎడారి అంచునలేచిన సూర్య గోళంలా స్ఫుటంగా, తీక్షణంగా ఆమెలో ఏ మార్పూలేదు. అద్దంలో తన మొహం చూసుకున్నాడు. ఏమిటాగీట్లు! వొంటె సుంద రదనగా ఏర్పడిన ఎడారిజాడలకిమల్లె, వర్షానికి బురదైన నీరుగుంటకిమల్లె.

ఆమె వొంగివూడుస్తుంటే బల్లకింద ఏదో పడిపోయినట్లు మోకాళ్ల మీదపడి, వొంగి ఆమె చేతిగాజులు పరీక్షగా చూశాడు. కొంచంగా చప్పుడు చేస్తాయి. రంగుగాజుల గొట్టం తిప్పినట్లు పరోటి చూశాడు— మెడలో ఎర్రపూసలతాడు.

"కొన్నావా?"

అవునన్నట్లు తలవూపింది.

"ఎక్కడ?"

నవ్వుతుందేం?

"మాట్లాడవేం ?"

ఆ మాటకి వెళ్ళింది. వెనకభాగం- చీరలోంచి పిరుదల ఆకృతి కనబడుతోంది- తను ఎగ్జిబిషన్‌లో చూసిన శిలాప్రతిమకి మల్లే.

"ఎప్పుడేనా సినిమాకి వెడతావా ?"

తలవూపుకుంది.

"వెడతావా ?"

బైటకి వెడుతోంది. సంజ్ఞచేసి నిలిపాడు.

"ఇవిగో రెండు రూపాయలు-సినిమా కెడతావనిచ్చాను. మీ అమ్మకి చెప్పావా ? ఇంకెప్పుడూ అల్లా చెయ్యకు."

అమ్మో ! అన్నట్లు కళ్ళు పెద్దవిచేసింది. అతని కంఠం బొంగురు పోయింది. ఎండినట్లు మాట తడబడుతోంది. రూపాయిలు చేతులో పెట్టి, వేళ్ళు మడిచి నొక్కాడు.

"ఫరవాలేదులే. ఏదేనా కొనుక్కో..."

తీసుకుంది. "అమ్మయ్య" అనుకొన్నాడు.

ఎందుకిచ్చినట్లు ఆ డబ్బు తను? మొదటిరోజున అద్దెయిచ్చేటప్పుడు ఆ రెండురూపాయలూ ఆదనంగా చేతులోపడ్డాయి. ఇచ్చిచూశాడు- ఏమౌతుందోనని, రూపాయకోసం కొట్లాడుకోడం, ఖూనీలుజరగడం పత్రికలలో చదువుతాం. అలిమేలుకి డబ్బుకాపీర్నంలేదు. ఆ రెండురూపాయలూ తిరిగి యివ్వడంలో డబ్బుపట్ల ఆమె నిజాయితీ తెల్లమౌతోంది. ఎందుకిచ్చినట్లు? ఆమెని సంతోషపెట్టాలనితప్ప మరో ఉద్దేశం అతనికి కనబడలేదు.

ఆ సాయంత్రం కాలక్షేపం అవక సినిమాకి బైలుదేరాడు మోహన్‌బాబు. అతను హాల్లోకి వెళ్ళేటప్పటికి ఆట ప్రారంభమైంది. అది ఇంగ్లీషు చిత్రం. జనం మధ్యమధ్య పెద్దగా నవ్వుతున్నారు. ఎందుకో అతను అందులో లీనం అవలేకపోతున్నాడు. చూస్తున్నాడు, వింటున్నాడు- కాని అదేమీ అవగాహన అవడంలేదు. మనస్సు ఎటో విహరిస్తోంది. సగం మనస్సు సినిమాకథలో లగ్నంచేసి, మిగతామనస్సుని వేరేచోటుకి పంప గలగడం వింత అనుభవం—అట్లా జరుగుతోందని గ్రహించడం మరీ విచిత్ర మైన అనుభవం. జనంతోపాటు అతనూ మధ్యమధ్య నవ్వుతున్నాడు—

చీకట్లోకూడా సమూహాల ఉద్రేకానికి లొంగిపోవడం తమాషాగా ఉంటుంది. పదిమందితోనూ పంచుకునే ఆనందం వేరు-వ్యక్తిగా, ప్రత్యేకంగా ఆనందం పొందడం వేరు ఏకాంతంగా పొందిన ఆనందంలో ఔన్నత్యం, నిండు తనం, సామాజిక అనుభూతిలో లోపిస్తాయి కాబోలు అనుకుంటూ వుండగా ఇంటర్వెల్‌లో లైట్లు వెలిగాయి. జనం నిట్టూర్చి, సిగరెట్లకి, 'టీ'కి బైటకి కదిలారు. హాలంతా పరకాయించి చూశాడు. దూరంగా వెనకాల సీట్లో హొన్నప్పగారబ్బాయి మాధవరావు- కనిపించాడు. అవును, అతనే. అతను తనని చూడకుండా పక్కకి మొహం తిప్పివేశాడు మోహన్‌బాబు, అతను చూడకుండావున్న సమయంలో చూస్తూ, ఎందుకు ? ఏమో అతనికే తెలియదు. కొన్ని చేష్టలకి అర్థమేవుండదు. మళ్ళా చూశాడు. మాధవరావు ప్రక్కన ఒక స్త్రీ కూర్చుంది. మనిషి నలుపు— కాని నాజూకుగా, చదువుకున్నదానిలా కనిపిస్తోంది. చెక్కిళ్ళపైన ఏదో కాంతివుంది. ఆమె చెవుల దుద్దులు మెరుస్తున్నాయి. అవి వజ్రాలదుద్దులు.

ఎవరామె ?

తన పక్కసీట్లో ఆంగ్లోఇండియన్ స్త్రీ కూర్చుని వుంది. అల్లాగే కాకూడదూ. కాని మాధవరావు చనువుగా, దగ్గరగా కూర్చున్నట్లు స్ఫురించింది. స్ఫురించడమేమిటి ? వారిద్దరూ మాట్లాడుకుంటున్నారు. నవ్వుకుంటున్నారు.

సిగరెట్లు పారేసి జనం లోపలికి జొరబడ్డారు. హాలంతా ఒంటి దీపం వెలుగులో, పొగమసగలో, తుఫాను చెలరేగిన సముద్రంలో చిన్ని పడవలా అతని కళ్ళముందు వూగిపోతోంది. మళ్ళీ చీకటి, చేపలవాళ్ళ వలలా- చిత్రం కొనసాగింది- మధ్యమధ్య విరగబడి నవ్వడాలు ప్రారంభమైనాయి. మోహన్‌బాబుకి వొళ్ళుమండుతోంది. ఆ పైకి నవ్వడం ఎందుకు ? లోలోన ఆనందించకూడదూ ?

ప్రేయసితో ఏకాంతంగా ఏ కాలవగట్టునో, ఉద్యానవనంలోనో విహరించక, జనం మధ్యకి రావడంలో ఏం ఆనందం వుందో అతనికి అర్థంకాక ఆ నవ్వేజనంపై విసుక్కున్నాడు.

ఆ కోపం చిత్రంపైకి మళ్లింది. దేశంలో నేటి అరాజకత్వానికి కొంతవరకూ ఇంగ్లీషుచిత్రాలు కారణం. పాశ్చాత్యుల స్వేచ్ఛా ప్రవర్తన, శారీరక సుఖాల అన్వేషణ, ఆధ్యాత్మిక చింతన రాహిత్యమూ, నేటి యువతీయువకులను భౌతిక సౌందర్యాన్వేషకులుగా మార్చివేసినాయి. వారు ఇంట్లో, నిత్యజీవితంలో పొందలేని అనుభూతి, ఇంగ్లీషు చిత్రాలలో రహస్యంగా పొందుతున్నారు. యువతీయువకులు మాత్రమే ఏమిటి? వారు అది అన్వేషించడం సహజం, మంచిదికూడా. పెద్దలుకూడా, వయసు మళ్ళినకొద్దీ, యీ రకం అన్వేషణ తీవ్రరూపం దాలుస్తుంది. వృద్ధులు కూడా, ఈ చిత్రాలని విరగబడి చూస్తున్నారు. చాలామందికి సడలి, హరించుకుపోతున్న తమ వ్యక్తిత్వాలకి ఈ సినిమాలే శరణ్యం.

మన ప్రదర్శకులు యీ రహస్యం కనుక్కున్నారు. మన చిత్రాలలో, పాశ్చాత్య సంగీతరీతులు, నృత్యసంప్రదాయాలు, శృంగార చేష్టలు, వీటిని ప్రవేశపెట్టి, జనసామాన్యం జోహారుల నందుకుంటు న్నారు. కుబేరులవుతున్నారు. ఇదొక మతంగా ప్రబలుతోంది ఈ పాశ్చాత్య చిత్రాల దిగుమతిని ప్రభుత్వం నిషేధించి మతసామరస్యం ఎందుకు పెంపొందించదో? అది ప్రజాస్వామ్య సిద్ధాంతానికి విరుద్ధం. కళారంగంలో అసలు కూడదు. అరాజకత్వంలోంచిగాని కళ జనించదు, పెరగదు.

సినిమా అయింది. జనం లేచారు. వారు వొక్కసారిగా వొదిలేసిన శ్వాస హాలును చుట్టుముట్టుంది. బైటపడ్డాడు మోహన్‌బాబు, మాధవరావు, అతని ప్రక్కన కూర్చున్న దుద్దులమ్మాయి ముందు నడుస్తున్నారు. వారి వెనకాలే నడుస్తున్నాడు. టాక్సీ, రిక్షా, బిళ్లవాళ్ళ ఆహ్వానాలు కాదని, వారివెనకనే తనూ నడుస్తున్నాడు. నాలుగైదు ఫర్లాంగులు వెళ్ళారు. సందు లోకి తిరిగారు. తనూ తిరిగాడు. మాధవరావు నిలిచిపోయ్యాడు. ఆ అమ్మాయిమాత్రం నడిచి వెళ్ళింది. మరో అరఫర్లాంగు నడిచి ఒకింట్లోకి వెళ్లింది. ఆమె ఇల్లేకాబోలు. మాధవరావు వెనక్కి తిరక్కపూర్వమే, గబగబనడచి ఇంటికి చేరుకున్నాడు మోహన్‌బాబు. తలుపువేసి దీపంఆర్పి కిటికీలోంచి చూస్తూ కూర్చున్నాడు. మాధవరావొచ్చి, తన గదిలోకి వెళ్ళడం చూశాడు. ఆ అమ్మాయి ఎవరో ! రాత్రి తను మాధవరావు గదిలో మాటలు

విన్నాడు. అందులో రెండోకంఠం స్త్రీది. సినిమాకొచ్చిన అమ్మాయిదే అవాలి. నానీదిమాత్రం కాదు, అమ్మయ్య అనుకున్నాడు.

నిద్రపట్టేమందు తాగి పడుకున్నాడు మోహన్‌బాబు. రెండు మూడు రోజుల్లో మరో విషయం జరిగింది. హొన్నప్పగారు ఏదో పనిమీద మైసూరు వెళ్లారు. మధ్యాహ్నం రెండైంది. అన్నపూర్ణమ్మగారు నిద్ర పోతోంది. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. మోహన్‌బాబు పడుకుందామని మంచంమీద పక్క సర్దుతున్నాడు. బైట గేటుముందు ఏదో చప్పుడైంది. పోస్టువాడేమోనని చూశాడు. అలిమేలు. తిన్నగా పక్కగదిలో కెళ్ళింది— అది మాధవరావు గది. ఎందుకో? తలుపు తాళంచెవి సందులోంచి చూస్తున్నాడు- మోహన్‌బాబు. అతని గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. మధ్య తన కెందుకు బాధ. శరీరంపై తన కెట్లాంటి యాజమాన్యము లేకపోవడం చిత్రంగా వుంటుంది. మనుషుల అలజడి— రెండో వ్యక్తి గదిలోకి వెళ్ళాడు. అతను మాధవరావు. రెండుమూడు నిముషాలలో అలిమేలు ఇవతలకొచ్చేసింది. అమ్మయ్య అనుకొని నిట్టూర్చాడు మోహన్‌బాబు. అలిమేలు వెళ్ళింది. మాధవరావు గది గడియవేస్తిన చప్పుడైంది. మోహన్‌బాబు పడుకున్నాడు. కాలం జరగదు. ఏమీ జరగదు. విసుగుపుడుతుంది. జీవితంపట్ల నిష్కారణంగా విసుగు పుడుతుంది. ఔరంగజేబుని గురించి ఆలోచించాడు. అతని కొడుకు, వారి ప్రేమ కలాపాలు, సింహాసనం కోసం కొట్లాటలు, యుద్ధాలు. ముంతాజ్ బీగమ్ తాజ్‌మహల్‌లో శాశ్వతంగా పవ్వళించింది. జీవితంలో ఏమి చూసిందో మృత్యువులోనూ అదే - విసుగు.

ఓ గంట కాలక్షేపం చెయ్యడం చేతకాని యీ మనుషులు అమరత్వాన్ని, కోరతారెందుకో! వేదాంతులు, వారి సిద్ధాంతాలు - పరమాత్మలోంచి పుట్టుకొచ్చాడుట యీ మనిషి-మళ్ళా పరమాత్మలోకే వెళతాడుట- ఆ తలుపు తెరుచుకుని, యీ చీకట్లో క్షణం వుండి, మళ్ళా ఆ రెండో తలుపు తెరుచుకుని పరమాత్మలో ఐక్యమై అమరత్వం పొందుతాడుట! ఎంత వెర్రి-కాలక్షేపం కాని వేదాంతుల కల్పన యీ అమరత్వం.

తీవ్రమైనది. మనుషులకంటే ప్రణాళికలు, మేస్త్రీలు, పథకాలు వున్నాయి. పక్షులకో-బలవంతులకే ఇష్టం. ప్రేయసిని ఆ కొమ్మపైనే కొంచం దూరంగా వుండనిస్తుంది.

తలుపు తెరిచారు. కీసిడలో సరిగ్గా కనపడటంలేదు. అతను మాధవరావు- వెనక దుద్దులమ్మాయి- వేగంగా నడిచి ఇంటికొచ్చేశాడు మోహన్‌బాబు ఆ దంపతులు సినిమా కెడుతున్నారా ? షాపింగ్ కెడుతున్నారా ? అలిమేలుకు ఏం సంబంధం ?

ఇంటిముందు గేటుతీసి వరండాలోకి రాగానే అన్నపూర్ణమ్మగారు ఉయ్యాలబల్లమీద కూర్చోడం చూశాడు. కిటికీముందు 'నానీ' కారియర్‌తో కూర్చుంది. తన గది తలుపు తీశాడు. నానీ లోపలికొచ్చింది. కారియర్ మూలపెట్టింది.

"నీకు జ్వరం అంది మీ అమ్మ ?" అన్నాడు.

"అమ్మెవరు ?"

"అలిమేలు"

"కాదు, పిన్నమ్మ."

"ఓ !"

"ఊఁ" అన్నదామె. నవ్వుతుంది.

ప్రపంచంలో చెడుగు, భయం, భారం, బాధ ఆమెకి పట్టినట్లులేదు. ఆమె జగత్తులో మొగాడు- మొగాడివల్ల వొచ్చే దురంతాలు లేనట్లున్నాయి.

"జ్వరమా ?"

"పిన్నమ్మకా ?"

"ఛ, ఛ, నీకు."

"నాక్కాదు. అక్కయ్యకి."

"అక్క యెవరు ?"

"అక్క- మా అక్కయ్య."

"నాకేం తెలుసు ? తెలుసు దాగానే వొచ్చే."

"మేం తెలుగోరిమే."

"మరి రానట్టు మాట్లాడతావేం ?"

"మీలా రాదు. కొస్త వొస్తుంది బాగా" చెపుతోంది.

"ఆగు."

ఆగనన్నట్లు తలవూపింది. గబగబ నడిచి వెళ్ళింది. ఆ పిల్ల దగ్గర నుండి తెలుసుకోవల్సినవి చాలా వున్నాయి. మంచి సమయం చిక్కింది. తను ధైర్యంచేసి చెయ్యిపుచ్చుకుని ఎందుకు నిలపలేదు ? ఏదో అభిమానం—హోదా, అంతస్తు గురించి పట్టింపు-దాన్నుండి జనించే బిగింపు. ఎప్పుడో అప్పుడు చొరవచేసి ఆమెని నిలేసి, నాలుగు విషయాలు అడిగెయ్యాలి. ఏమిటా నాలుగు ? నవ్వొచ్చింది. మూడు కోతులు, నాలుగు విషయాలు !

ఆ రాత్రి అక్కడ వుండబుద్ధిపుట్టలేదు. భోజనం అయ్యాక మిత్రుడు చౌడప్పగారింటికెళ్ళి, కబుర్లు చెప్పుకుని పరున్నాడు.

ఉదయం గదికొచ్చేటప్పటికి ఎనిమిదైంది. హొన్నప్పగారు కనిపించారు. ఊరునుంచి వొచ్చినట్లున్నారు. గదంతా చిందరవందరగా వుంది. సర్దడం మొదలెట్టాడు. గోడదాటి గేటు ఇవతలకి ఐదారుకోతులొచ్చాయి. హొన్నప్పగారు వాటిని తరుముతున్నాడు. కొన్ని చెట్లెక్కి గంతులేస్తున్నాయి. నల్లమొహం కోతులు, పొడుగాటి తోకలు- నల్ల మొహంచుట్టూ, ఊదారంగు చర్మం—చిరువెంట్రుకలు ఆతని కేసి చూస్తోంది ఆ కోతిపిల్ల, మనిషికీ వాటికీ దగ్గర సంబంధం, బాంధవ్యం నెలకొల్పమని జాలిగా చూస్తోంది. అరటిపండు పడేశాడు. ఆనందంతో లాక్కుపోయి తింటున్నాయి తీసుకొన్న కోతే మిగతా వాటికి పంచాలి, వాటిల్లోనూ భూస్వామితత్వం యజమానితత్వం.

గది బాగుచెయ్యడానికి అలిమేలొచ్చింది.

"నానీ కెల్లావుంది ?"

"బాగానేవుంది-బద్దకం-వొళ్లు బద్దకం."

"నిన్న సాయంత్రం వొచ్చింది ?"

"నాకు పనుంది. దాన్ని రమ్మన్నా.

"జ్వరం ఎవరికి ?"

"జ్వరం ఏమిటి ? ఎవరికీ లేదు."

"అక్కయ్యకిట."

"ఓ అదా-అప్పుడో. పొద్దుటే డాక్టర్నికి చూపించా."

"ఏమన్నాడు ?"

సమాధానం చెప్పడు నవ్వి [illegible] త్రిప్పేసి వెళ్ళిపోయి.

పదిగంటలైంది. ఏడింటికి బండి వొచ్చింది. అందులో అన్నపూర్ణమ్మగారు ఎక్కింది. జానీ కూడా వొచ్చింది. రోడ్డు మీదనుంచే, తనూ బండిలో ఎక్కింది. హొన్నప్పగారు సాగనంపి గేటువేసి, లోపలి కెళ్ళాడు.

మోహన్‌బాబు స్నానానికి బైలుదేరాడు. మండువాలో తడక వెనక ఎవరో మాట్లాడుకోడం విన్నాడు.

"అబ్బాయి పట్నంవెళ్ళాక మరో రెండువారాలు" అది హొన్నప్పగారి కంఠం.

"ఈ నెల డాక్టర్లకవుతోంది."

అది అలిమేలు కంఠం. ఇంక మరి వినబడదు. గదిలోకెళ్ళి స్నానం చేసి ముందుగదిలో కొచ్చాడు. గది దక్షిణంవైపు తలుపు గడిపెట్టకుండా, దగ్గరగా జార్లవేసి వెళ్ళాడు. వొచ్చేటప్పటికి తెరిచివుంది. అటూయిటూ చూశాడు. ఏమీపోలేదు. తలుపులు మూశాడు. తల దువ్వుకుంటున్నాడు. అతనికంతా గంద్రగోళంగా వుంది. విషయం సగంసగం తెలియడంవల్ల కలిగే చీకాకు ఆవరించింది. ఏమేంటుకు వినడం? ఎందుకుచూడడం? వింటున్నదీ, చూస్తున్నదీ మంచి విషయాలుగాలేవు. కోతుల బొమ్మకేసి చూశాడు. అక్కడలేదు. బల్లకింద చూశాడు. మంచంకింద చూశాడు. ఎక్కడా లేదు. గదంతా చూశాడు. గది బైటకొచ్చాడు. ఏమైంది? ఎట్లా పోయింది? ఎవరుతీశారు? చెట్లపైన కోతులు గంతులేస్తున్నాయి. వాటికేసి చూశాడు. ఒకకోతి చేతిలోవుంది కోతులబొమ్మ అపుడు. బల్లమీద బొమ్మ పక్కనే మరో అరటిపండు వుంచాడు, ఆ పళ్ళెం, ఈ బొమ్మ, గది తలుపు

తీసిలాక్కుపోయింది కోతి. తినేది అనుకుంది కాబోలు తన సంతతిని లాక్కుపోకేంచేస్తుంది ?

బెదిరించాడు, రాళ్ళు విసిరాడు. కోపంగా చూస్తున్నాయి కోతులు. మూతివిరుపులు, కోపచూపులు— అసంతృప్తి ప్రకటిస్తున్నాయి. దూకుతున్నాయి, బైటకెళుతున్నాయి, లోపలికొస్తున్నాయి. మీదపడి పీకవుకదా! లోపలికొచ్చి, కిటికీతలుపు మూశాడు. మంచంమ్మీద పడుకున్నాడు. ఆంజనేయదండకం చదవాలంటే అనిపించింది. రాముడు, సీత, లంక, సుగ్రీవుణ్ణి గురించి ఆలోచించాడు. డార్విన్ సిద్ధాంతాన్ని వాల్మీకి ఏనాడో వ్రాసిపారేశాడు, చిత్రం !

మరో గంటలో అన్నపూర్ణమ్మగారు, 'నానీ' బండిలో తిరిగి వొచ్చారు. పెద్దామె లోపలకెళ్ళింది. బుట్టలో పళ్ళు, పొట్లాలు. లోపల పెట్టింది నానమ్మ. పొన్నప్పగారు బండివాడికి డబ్బులిచ్చి పంపించారు.

మోహన్‌బాబు భోజనంచేసి 'నానీ' కోసం చూశాడు. ఆమె ఇంటికి వెడుతూ గేటు దగ్గర కొచ్చింది. కిటికీకేసి చూసింది. రమ్మని సంజ్ఞచేశాడు. వొచ్చింది. కోతికేసి చూపించాడు.

బల్లమీద వుండేది— బొమ్మ. అదిగో అది నోట్లో కరుచుకుంది. ఎట్లాగా- ఏమన్నా చెయ్యగలవా ?"

ఇంట్లోకి వెళ్ళింది నానీ. తినేది ఏదో చేతులో పట్టుకుంది. చెట్టు కిందకెళ్ళి కోతికి చూపించింది. కోతిపిల్ల కిందీ కొమ్మమీదికి దూకింది. వెనకాల పెద్దకోతి చూస్తోంది. చిన్నది ఆమె చేతులో పదార్థం తీసుకుంది. దానిమీదపడిన పెద్దకోతి నోట్లో బొమ్మ కిందపడింది. నానీ తీసుకుంది. నవ్వుకుంటూ లోపలకొచ్చింది. బల్లమీద పెట్టింది.

"బాగానే మచ్చికచేసుకొంటావే" అన్నాడు. తలుపు దగ్గరగా మూసి గుమ్మంమధ్యగా నిలబడుతూ.

"కోతంటే ఏం భయం ?"

"నీకు మనుషులంటేనే భయంకాదూ" అన్నాడు నవ్వుతూ. ఆ వాక్యానికి అర్థం ఏమిటో అతనికే తెలియదు. తలవూపింది నవ్వింది. వెళ్ళడానికి తలుపు దగ్గర కొచ్చింది.

"వెళ్ళాలి."

చెయ్యి పట్టుకున్నాడు విదిలించింది.

"అమ్మో" కళ్ళు పెద్దవిచేసింది. కంటిపాప కిటికీకేసి చూస్తూ, కొసలకి కదిలింది. పెదవులు బిగించింది. అతనికి ఆ దృశ్యం చూడడం ఇష్టం.

"గాజు లెక్కడివి ?"

"అక్క పట్నంనుంచి తెచ్చింది."

"నీ అక్క పట్నంలో పనిచేస్తోందా ?"

"చదువుకుంటోంది."

ఆశ్చర్యపడ్డాడు. "మరి నువ్వు చదువుకోవేం ?"

"నా కెవరు చెప్పిస్తారు ?"

"మీ అమ్మ."

"అమ్మకాదు, పిన్నమ్మగా. కూతురుగనక రాజమ్మకి చదువు."

"అక్కపేరు రాజమ్మా ? అంటే అలిమేలు కూతురా ?"

తలవూపింది. జెడ వెనక్కి తోసింది.

"అంత డబ్బెక్కడిది ?"

"పిన్నయ్య గణించిపొయ్యాడు."

"ఏం పని ?"

"యుద్ధంలో ఇనుము."

"మరి అలిమేలుకి ఇళ్ళల్లోపనేం కర్మ ?"

"చిన్నప్పటినుంచీ చేస్తావుంది"

"మరి నీకు చదువు చెప్పించదా ?" తల వూపింది.

"మా అమ్మ, అయ్యలేరు. పిన్నమ్మ చూస్తుంది."

మరి, మరి.... పెళ్ళి ?"

కళ్ళు పెద్దవిచేసింది.

"నీకొక్కడు. రాజమ్మకి."

నవ్వుతూంది. "వెళ్ళాలి."

అతను కదలలేదు. దక్షిణం తలుపు తెరుచుకుని పరుగెత్తి వెళ్ళింది. ఆమె పిరుదులు, వక్షానికి లయ కల్పుతున్నాయి. కదిలే శిల్పం. కాలక్షేపం అవక జీవితంమీద విముఖత పుట్టిన వారందరూ, తలకాయలు కొట్టుకొని చనిపోయేటందుకు అనువైన శరీరం ఆమెది.

మరో రెండురోజు లయ్యాకగాని మళ్ళా నానీతో మాట్లాడే అవకాశం చిక్కలేదు మోహన్‌బాబుకి.

కారియర్ తెచ్చేటప్పటికి సాయంత్రం ఏడుదాటింది. 'నానీ' కారియర్ కిందపెట్టగానే ఎలక్ట్రిక్‌దీపం ఆర్పివేశాడు మోహన్‌బాబు. ఆమె తలుపు తెరవబోయింది. ఇవతలకిలాగి తలుపుమూశాడు. ఆమె వక్షం, అతని భుజానికి తగిలింది. ఆమె ఒక్క గంతేసి దీపంస్విచ్ నొక్కింది.

"చీకటంటే భయమా ?"

"వెళ్ళిపోతా."

"కాసేపు మాట్లాడాలి."

"దీపం ఆర్పడం ఎందుకు ?"

ఏమో అతనికేమీ తెలీదు. రహస్య విషయ పరిశోధనకిమాత్రం వెలుగు తగదు కాబోలు.

"చిన్నెవరూ చూడకండా" అన్నాడు.

"పిన్నమ్మ చంపేస్తుంది."

"ఎందుకు ?"

"ఆలస్యంగా యింటికెడితే, యింకేమన్నా వుందీ."

"నేను పనిమీద వుంచానని చెప్పు."

"భయం."

"నేనంటేనా ?"

నవ్వుతోంది.

"రాజమ్మ విషయం చెప్పు. ఏం చదువుకుంటోంది ?"

"నాకు తెలియదు. పట్నంలో చదువుతోంది. మావయ్యగారితో కలిసి"

"మావయ్యెవరు ?"

"సూర్యగాడు. అన్నపూర్ణమ్మగారబ్బాయి."

అతనికి బోధపడుతోంది. అలివేలు భర్త యుద్ధం రోజుల్లో ఇనప వ్యాపారంలో బోలెడంత గడించాడు. తర్వాత చనిపొయ్యాడు. ఆ డబ్బుతో అలివేలు కూతురికి పట్నంలో చదువు చెప్పిస్తోంది. కూతురు, అన్నపూర్ణమ్మగారబ్బాయి మాధవరావు (సూర్యగాడు) కలిసి చదువుకుంటున్నారు. వారికి స్నేహం యేర్పడింది. ఆమె చదుకోడంతో పనిమనిషి కూతురన్న చౌకతనం పోయింది. సమానురాలైంది.

"కలిసి చదువుకోడం మట్టుకేనా ?" అనడిగాడు.

ఆమెకి అర్థమైనట్లు లేదు. సమాధానం రాదు.

"మొన్న సినిమాలో చూశాను, వారిద్దర్నీ" అన్నాడు. ఏమీ మాట్లాడదు.

"ఓ పవ్వులు. మీద చెయ్యేశాడు. ఇంటిదగ్గర దిగపెట్టాడు."

ఏమీ మాట్లాడదు.

"బాగా ఇష్టం అన్నమాట"

"రాజమ్మకి మావుగారంటే ఇష్టం."

"పెళ్ళి చేసుకుంటుందా ?"

"ఏమో."

"మరి నీ పెళ్ళి ?"

సిగ్గుతో తలవంచుకుని నవ్వుతోందని, బుగ్గల తీరువల్ల గ్రహించాడు.

"చేసుకుంటావా ?"

ఎలాగో చూసింది. అతన్ని తలుపు దగ్గరనుంచి తోసింది. చెయ్యి భుజంమీద పడింది.

"ఏం వన్లు ?"

"ఇష్టం లేదా ?"

లేదన్నట్లు తల జోరుగా కదిపింది.

"మీ కాళ్ళకి మొక్కుతా, నన్ను పోనీయండి" అని చేతులు జోడించింది.

"హొన్నప్పగారికి, అలిమేలుకి-స్నేహమా ?"

"ఏమో"

"అదొక్కటే చెప్పు. వెళ్ళిపోస్తా."

"ఏం చెప్పను ?"

"ఎంతకాలంనుంచి పనిచేస్తోంది ?"

"చాలాకాలంనుంచి. రాజమ్మ చిన్నపిల్ల- హొన్నప్పగారి వ్యాపారానికి పెట్టుబడిగా పెట్టింది చిన్నమ్మ. ఇంట్లో కర్చులొస్తే అప్పిస్తా వుంటుంది."

"అమ్మగారికి తెలుసా ?"

"తెలీదు."

"ఏం కథ ?"

నవ్వుతుంది. అలుపుతీరాక మోహన్‌బాబు. జేబులోంచి ఐదు రూపాయలనోటు తీసిచ్చాడు.

"ఎందుకు ?"

"సినిమాకెళ్ళు, గాజులు కొనుక్కో.."

"నాకొద్దు.'

వెళ్ళిపోయింది నానమ్మ.

డబ్బిస్తే పుచ్చుకోనంతటి నిజాయితీగల పనివాళ్ళకాలం వచ్చింది. పనిమనిషి కూతురుకి పట్నంలో చదువు చెప్పిస్తుంది. యజమానికి పెట్టుబడి పెడుతుంది. అప్పులిస్తుంది. అబ్బాయి కాలేజీ జీతం కట్టాల్సివస్తే, హొన్నప్పగారు ఆమె నడగాల్సి వచ్చింది. సమాజంలో ఆర్థికంగా సంక్రమించిన అంతస్థులు పోయినాయి. యీ యుద్ధంలో - తెగలు, వ్యత్యాసాలు పోయి అంతా ఏకమౌతున్నారు. ఇంక పెళ్ళిళ్ళతో పడిపోతూన్న గోడలు నేలమట్టం అవుతాయి.

కాని మాధవరావు, రాజమ్మని పెండ్లి చేసుకుంటాడా ? వాళ్ళింట్లో పనిమనిషి కూతుర్ని ఎంత చదువుకున్నదైనా చేసుకోడు. కులాసాగా,

సరదాగా, స్నేహంగా వుంటాడు. వివాహం వుద్దేశం వుండకూడదు. ఓ వేళ వున్నా తల్లిదండ్రులు అందు కంగీకరిస్తారా? అతనలా చెడి పోవడం మంచిదికాదు. దాన్ని ఆపుచెయ్యడం తన కర్తవ్యం. హొన్నప్ప గారితో చెప్పడం శ్రేయస్కరం.

సెలవలవగానే మాధవరావు పట్నం వెళ్ళిపోయ్యాడు. నాన్నిచ్చిన డబ్బు, అలిమేలుదని అతనికి తెలుసా? తెలిస్తే రాజమ్మతో స్నేహంగా ఉండగలడా? నానీ తనిచ్చిన ఐదు రూపాయలనే తృణీకరించిందే! కాని అమధ్య ఇచ్చిన రెండు రూపాయలూ తీసుకుందేం నానీ? అంతా అయో మయంగా వుంది. రాజమ్మ కూడా వూరికి వెళ్ళే వుంటుంది.

ఆ రోజు శనివారం, మధ్యాహ్నం మూడైంది. హొన్నప్పగారు ఏవో పద్దు పుస్తకాలు చూసుకుంటున్నాడు. గదిలోకి వెళ్ళాడు మోహన్ బాబు.

"రండి కూర్చోండి" అని కుర్చీ చూపించాడు హొన్నప్పగారు.

"చదువూ అదీ బాగా సాగుతోందా?"

"ఆహా" అన్నాడు, 'అదీ' అంటే మరింకేమిటా అని ఆలోచిస్తూ.

"సంతోషం"

"మీ వ్యాపారం బాగా వుందా?"

"ఏం వుండడం లెండి" ఇప్పుడేదీ అనుకొన్నట్లుగా సాగడం లేదు."

"మీతో వో విషయం చెప్పాలి. ఓ విధంగా, నాకెట్లాంటి హక్కూ లేదనుకోండి."

"చెప్పండి."

"మీవాడు ఒక తక్కువ కులందానితో స్నేహం చేస్తున్నాడు. నే చూశాను."

ఆశ్చర్యం ప్రకటించాడు హొన్నప్పగారు.

"ఎవరితో?"

"మీకు తెలిసే వుంటుంది."

"ఏచ్చే! నాకు తెలీదు. చెప్పండి."

"మీ ఇంట్లో పనిచేసే, అలిమేలు కూతురుతో."

"నానీతోనా ?"

"కాదు."

"మరి ?"

"మీకు తెలుసు."

"రాజమ్మతోనా ?"

బిగ్గరగా నవ్వాడు. "వాళ్ళు క్లాస్‌మేట్స్‌గా."

"కథ చాలా దూరం వెడుతోంది."

"అంటే ?"

పక్కగదిలోంచి అన్నపూర్ణమ్మగారొచ్చింది.

"మామావూ మాట చెబుతున్నారా ?" అన్నదామె. అన్నపూర్ణమ్మ గారు పెద్దామె. జుట్టంతా నెరిసింది. చెవలకి ఎర్రరాళ్ళ దుద్దులున్నాయి. మాధవరావు తల్లి పోలికే."

"అలిమేలు కూతురుతో మావాడా ? అన్నదామె.

"మరేంలేదు లెండి, ఇప్పట్లో స్నేహమే కావొచ్చు, అంటే మొదట్లో. తరవాత ఏ కడుపో కాలో........"

మోహన్‌బాబు వాక్యం పూర్తికాకుండానే అన్నపూర్ణమ్మగారు 'అ' అని పెద్దగా అరిచి, పక్కనున్న మంచంపైన వాలిపోయింది.

"ఏమిటండీ మీరంటూ వుంట ?" అని గర్జించాడు హోన్నప్ప గారు.

"ముందు ఆవిడ విషయం చూడండి."

ఆమెకి మంచినీళ్ళిచ్చారు. ఆమె చేతులు, కాళ్ళు గజగజ వొణికి పోతున్నాయి.

"నేనేమీ అనలేదు. రేపు ఏ కడుపో కాలో వస్తే వివాహం చేసుకునే అవసరం రాకుండా పోతుందంటారా ? ఆ మధ్య డాక్టరింటికి కూడా వెళ్ళారుట."

అన్నపూర్ణమ్మగారు మరో కేక పెట్టింది. మెడ, తల వూగిపోతున్నాయి.

"బాబ్బాబు. డాక్టర్ని పిలుస్తారా ?"

మోహన్‌బాబు, డాక్టర్ కోసం వెళ్లాడు. డాక్టర్‌ని తీసుకొచ్చేటప్పటికి అరగంటైంది. ఈలోగా అలిమేలు కూడా వచ్చింది. అమ్మగారికి సపర్యలు చేస్తోంది.

అన్నపూర్ణమ్మగారు మాట్లాడటంలేదు. పక్షవాతం అని తేల్చాడు డాక్టరు.

ఆ రాత్రంతా అందరూ ఆమె మంచంచుట్టూ చేరి, కావలసింది చూస్తూ, ఒంటికి తైలం మర్దనచేస్తూ, ఉపచరిస్తూ గడిపారు. ఆమె యీ స్థితికి తను కారణం అనుకోక తప్పింది కాదు మోహన్‌బాబుకి. అలిమేలు, నానీ, అతనికేసి కోపంగా చూస్తున్నట్లనిపించింది. ఇదంతా తనెందుకు తెచ్చిపెట్టుకున్నట్లు! మంచిచేద్దామని.

ఆ మొర్నాడు, మాధవరావుని అర్జంటుగా రమ్మని టెలిగ్రాం యిచ్చినట్లు తెలుసుకున్నాడు మోహన్‌బాబు.

డాక్టరు ప్రమాదంలేదని ధైర్యం చెప్పాడు. అది మొదటిసారి వచ్చినప్పటి తీవ్ర లక్షణాలట. తేరుకుంటదట. మరోసారి రాకుండా భద్రంగా ఉండాలిట. డాక్టర్ వెళ్ళేటప్పటికి, మధ్యాహ్నం పన్నెండు దాటింది. మోహన్‌బాబు హోటల్‌లో భోజనంచేసి వచ్చాడు.

అతనికి నిద్రొస్తోంది. కారియర్ కడిగితెచ్చింది అలిమేలు.

"మీరెందుకు అవన్నీ చెయ్యడం ?"

ఆమె ధైర్యానికి చకితుడయ్యాడు మోహన్‌బాబు. నిద్ర ఒక్కసారిగా పోయింది. మంచంమీద కూర్చున్నాడు.

'మీకు నానీజోలెందుకు ? మాధవరావుగారంటె- మా రాజమ్మని పెండ్లి చేసుకుంటాడు. మీరు చేసుకుంటారా నానీని ?'

ఆ ఉద్రేకంలో ఆమెని దగ్గరగా, పూర్తిగా చూడగలిగాడు. నలభై దాటుతుందేమో ఆమె వయస్సు. శరీరం ముడతలు పడుతోంది. కళ్ళకింద నలుపు తెలీకుండా, కాటుక కాపాడుతోంది. మంచి దుస్తులు వేసుకుంటే బాగానే వుంటుంది. దుస్తులు, పోషణ సంస్కారం-యివే మనుషుల్ని వేరు

చేసేవి. కళలో యివన్నీపోతాయి. అంచేతే కళని అంతర్జాతీయ భాషగా గౌరవిస్తున్నారు.

"నేను నానీని ఏం చేశాను ?"

"మరి డబ్బివ్వడం దేనికి ?"

"సంతోషపెట్టడానికి ?"

"దీపం ఆకర్షణం ?

ఛీ, ఛీ- యింత పచ్చిగా అడుగుతుందేమిటి ? మరో వుద్దేశం లేకుండా సంతోషపెట్టడం అనేది ఆమె అర్థం చేసుకోవాలంటే అర్థశతాబ్ది సంస్కారం రావాలి అనుకున్నాడు.

"అంత ఇష్టంగా వుంటే పెండ్లి చేసుకోండి. రేపు మాధవరావు గారొస్తుండారు. రాగానే, అన్నీ మాట్లాడుకుందాం."

"ఇంకా నయం, మాధవరావు మీ అమ్మాయిని చేసుకుంటాడనా ?"

"ఏం, ప్రమాణం చేశాడు. డాక్టర్‌కి చూపించా రాజమ్మని. మూడో మాసంట...."

తలుపు చప్పుడయ్యేటట్లు వేసి వెళ్ళింది అలిమేలు.

మోహన్‌బాబుకి ఆలోచించేశక్తి పోయింది. ఏదో ఆకృతి, కేంద్రంలేని భయం పట్టుకుంది. పోస్టుమేన్ ఇచ్చిన ఉత్తరం సరిగ్గా చూడనేలేదు. చూసినా, అందులో ఏముందో తెలీలేదు. గబగబ పెట్టెలోకి సామాన్లు సర్దాడు. బల్లమీద వున్నవాటిని, ట్రంకులో పడేశాడు. మంచం వూడదీసి నవారుతో కట్టాడు. పాతబట్టలన్నీ హోల్డాల్‌లో పడేశాడు. రోడ్డు మీదికెళ్ళి జట్కా పిల్చుకొచ్చాడు. సామాన్లు అందులో కెక్కించాడు. ఇంటి తలుపులు వేసివున్నాయి. హొన్నప్పగారు పరున్నారు. అలిమేలు ఇంటికెళ్ళింది. ఎవ్వరూ చూడటంలేదు, అమ్మయ్య అనుకున్నాడు.

మళ్ళా గదంతా ఒక్కసారి పరకాయించి చూశాడు. అలారం గడియారం ట్రంకులో పెట్టాడు. బల్లకింద పడివుంది మూడు కోతుల బొమ్మ. తను చెడుగు చూశాడు విన్నాడు; చెప్పాడు. దాన్నితీసి దూరంగా కిటికీలోంచి గిరవాటెట్టాడు. స్నానంగదిలో సోప్‌కేస్, టూత్‌బ్రష్‌మాత్రం మర్చిపోయి బండెక్కి స్టేషన్‌కొచ్చాడు.

అదీ మోహన్‌బాబు చెప్పినకథ. ప్లాట్‌ఫారంపై జనం సందడిగా తిరుగుతున్నారు పోర్టర్లు సామాన్లతో పరుగులెడుతున్నారు రైలు రానే వచ్చింది. ప్లాటుఫారం ఘాటుకి తట్టుకోలేక తుమ్ముతున్నట్లు శబ్దించేస్తూ. పోర్టరు, సామాన్లు మోహన్‌బాబు వో పెట్టిలో కెక్కారు.

"అదీ విషయం. నేను లేకపోయినందుకు మరోలా అనుకోను." అన్నాడు మోహన్‌బాబు.

"నువ్వేమంటావ్?" అన్నాడు మళ్ళా. ఏం వ్యాఖ్యానం చెయ్యాలో నాకు తెల్సిందికాదు.

"ఏమీ అనను. వ్యాఖ్యానంకూడా నువ్వే చేసేశావు" అన్నాను.

"అంటే ?"

"కోతులబొమ్మ అవతల పారేశావుగా" అన్నాను. ఇద్దరం బిగ్గరగా నవ్వుకున్నాం. గార్డు విజిల్ వేశాడు. మిగిలిన జనం పెట్టెలలోకి ఎగపడుతున్నారు-ప్లాట్‌ఫారం తుమ్మితే వూడిపడ్డట్లు ఒక్కుదోకుతో ఎంజిన్ కదిలింది పట్టాలు మూలిగాయి. తలుపులదగ్గర జనం నిలబడి చేతులు వూపుతున్నారు. జ్వరంతో మూలుగుతున్న రైలుమీద శాలువా కప్పినట్లు.

ఓ అమ్మాయి గబగబ వగర్చుకుంటూ పరుగెత్తుకొచ్చి, మోహన్‌బాబు కూర్చున్న కిటికీలోకి, ఏదో గిరవాటెట్టింది. రైలు వెడుతోంది. అతను దాన్ని పైకి చూపించాడు. అది కోతులబొమ్మ.

"మరిచిపోయ్యారు." అన్నదామె. దూరమైపొయ్యారు రైల్లో వ్యక్తులు. మోహన్‌బాబు ఆమెకేసి చూస్తున్నాడు. ఆమె వెనక్కి తిరిగింది. నాకేసిచూసి నవ్వింది. నడుచుకుంటూ వెళ్ళిపోయింది. ఆమె 'నానీ' అని గ్రహించాను. మోహన్‌బాబుకి ఆమె కావాలి. ఆమెతో వివాహంకాదు. మూడుకోతుల నీతి యింకా దాన్ని ఆమోదించే స్థితికి రాలేదు కాబోలు అనుకొని, సామాన్లు పోర్టర్ నెత్తినపెట్టి బైటకి నడిచాను.

రచనకాలం : 1959 మే 17, జూలై 22-26

ప్రచురణ : తెలుగు స్వతంత్ర 15-8-1959

‘౯’

పూర్తిపేరు హాషిమాబీ. పసుండి హైదరాబాదు వెళ్ళాను. స్నేహితుడు రుటుంబరావు ఇంట్లో దిగాను ఆమెను అక్కడ చూశాను. పదకొండు, పన్నెండు సంవత్సరాల వయస్సుంటుంది. కుటుంబరావు ఆల్లా ఊళ్ళో కెళ్ళాడు. ఒక్కడినీ ముందుగదిలో కూర్చుని పత్రిక చూస్తున్నాను. బుట్టలోంచి పూలగుత్తితీసి నాముందు బల్లమీద పెట్టింది 'హాషిమాబీ' ఆమెకేసి చూశాను. నవ్వింది. వాలకం, పైఖరిచూసి ముస్లిం కన్య అనుకున్నాను. కోలమొహం, చామనఛాయ కొలతబద్దతో కొలిచి అమిర్చినట్లుగా తీర్చిన పళ్ళవరస, లేత పెదవుల వెనక చీకటి అడవిలో మంటలా, స్ఫుటంగా మెరుస్తుంది. అతికించి పెట్టినట్లు క్రమమైన కనుబొమ్మలు, మధ్యపాపిట ఇరుప్రక్కలా గూళ్ళు తెలియని నల్ల పిట్టలులా, సగం సగం వొచ్చిన రెక్కలమీద ఎగిరెపడుతున్నట్లు ముంగురులు, చిన్నిగడ్డం. దానిమధ్యనున్న ఆకారం పచ్చబొట్టు. చినిగిపోయిన ఎర్రగౌను-తెల్లలాగు: మెడచుట్టూ పెనవేసుకుని బాధతో విడిచి విరహంతో వొదలలేక ఘణాలు పట్టుకుని దేవుళ్ళాడుతున్న రెండు జడలు-పల్చటిగౌను, దాని కంతలలోంచి, ఎదిగి ఆకృతి తెచ్చుకుంటూన్న అపురూపమైన శరీర అవయవాల కదలిక కనబడుతూంది. నదివొడ్డున గడ్డకట్టిన మట్టిముద్ద-నీటితాకిడికి వొక స్వరూపం తెచ్చుకుంటుంది. ఆ మట్టిముద్ద మధ్యలో యుగాలక్రితం ఇరుక్కుపోయిన మణిలా ఆమె శరీరంలో జీవితతృష్ణ మూలమూలల మెరుస్తోంది. పరిశుభ్రతకి అలవాటు పడని శరీరం-దుస్తులకు, జిడ్డుపు దుమ్ము, మట్టి చటుక్కున ఆకర్షించేది ఆ పిల్ల చూపులు, దంతపుపెట్టె తెరవగానే లోన బంగారపు తమలపాకులా కనురెప్పలగుండా దూసుకొచ్చి పెడల్పుగా కనబడి, పక్కకి వొదిగి నిలబడ్డట్లు మొనలుతేరి, ప్రకాశించి కలవరపెట్టే చూపులు 'బీ' వి.

ఆ పళ్ళ ఆకర్షణ మామూలు ఆకర్షణకాదు అది అంటంగా రింఛా

కనబడదు. కొన్ని జలచరాల మెరుపులైన సుందరదేహాలు—ఆ మాటికో భీభత్సంగా కనబడి గగుర్పాటు కలగజేసే వొక వికృతమైన ఆకర్షణ వుంటుంది. అల్లాంటి ఆకర్షణ ఆమె కళ్ళల్లో వుంది. గుండ్రటికళ్ళు అంత బాగుండవు. ఆమెకళ్ళు గుండ్రంగా లేకపోయినా, నల్లపాప గుండ్రంగా కదలటంవల్ల, చూపులు అలా గుండ్రంగా వున్నట్లు కనబడతాయేమో అనుకుంటా. నిశ్చలమైన చూపురాదది. కంటిలో పాప గుండ్రంగా, గిరగిర తిరుగుతూ వుంటుంది. మనకేసి చూడదు. మనమట్టా చూస్తుంది. అల్లా చూస్తూ నవ్వుతూ నిలబడింది. లోపలనుంచి పనికుర్రాడు. మరెన్ని వచ్చి బల్లమీద పూలగుత్తిని తీసుకువెళ్ళాడు. వీ గది అవతలకి నడిచి, తలుపు వెనక నిలబడి, మొహంమాత్రం కనబడేటట్లు వొంగి నాకేసి చూస్తూ నవ్వుతూ నిలబడింది. లోపలికి రమ్మన్నాను.

రా నన్నట్లు తలవూపి నవ్వింది.

"నీ పేరేమిటి ?"

"బీ"

"ఇట్లారా....?"

వొచ్చింది. కళ్ళు నా చుట్టూ చూస్తున్నాయి.

"ఇదిగో....మరి నువ్వు పూలెట్టుగోవా ?"

"ఉహూ" అన్నట్లు తల ఊపింది. జడలు భుజాలమీద కదులుతున్నాయి.

"ఏం పని చేస్తావు ?"

నవ్వింది. మాట్లాడదు. నా పక్కనే బల్లమీద ఫాన్‌కేసి చూస్తోంది.

"తెలుగు మాట్లాడతావా ?"

మాట్లాడతాను అన్నట్లు తల ముందుకు వూపింది.

మూగపిల్లేమో అనుకున్నాను. ఫాన్‌కేసి వొకటి రెండడుగులేసింది. ఫాన్‌ముందు చెయ్యిజాచింది.

"ఇంద— ఏమన్నా కొనుక్కో" అని జేబులోంచి వొక అణా తీసిచ్చాను.

పుచ్చుకోనన్నట్లు తలవూపింది.

"ఫరవాలేదులే."

తీసుకుంది. ఫాన్ కేసి చూసి నవ్వుతోంది.

ఫాన్ రెక్కలతో పాటు ఆమె కళ్ళు గిరగిర తిరుగుతున్నాయి.

"గాలి వేస్తోందా?"

ఊ అన్నట్లు తలపంకించింది.

"ఇప్పుడు?" అని ఫాన్ నిలిపివేశాను.

నవ్వింది బీ. ఫాన్ తిరగడం దీనికి వొక వింత. బీదపిల్ల అట్లాంటిది ఎప్పుడూ చూసివుండదు.

"మళ్ళా తిప్పండి" అన్నది బీ.

అమ్మయ్య మాటచెప్పి మూగదికాదు. ఫాన్ తిప్పాను. ఆమె కళ్ళు ఆ ఫాన్ రెక్కలతో పాటు గిరగిర తిరుగుతున్నాయి. కాసేపు తిరగనిచ్చి, ఆమె స్విచ్‌ని కదిపి ఫాన్ నిలిపివేసింది. అదంతా ఆమెకి వినోదంగా వుంది. ఫాన్ అలా కదిపితే పాడైపోతుందని, వొద్దు అందామనిపించింది. స్వంత ఫానవుతే అట్లా అప్రయత్నంగా అనివుందునేమో.

మళ్ళా స్విచ్‌ని కదిపి ఫాన్ తిప్పింది బీ. నాకు నవ్వొచ్చింది. కుటుంబరావు ఇంట్లో రేడియో పెట్టి, గోడమీద ఎత్తుగా బల్లమీద పెట్టాడు. కిందగావుంటే పిల్లలు దాన్ని కదిపి పాడుచేస్తారని భయంట.

ఈ ఫాన్‌కి జైలుకడ్డీలు లేవు. ఒకరకం చక్రంవుంది. కాని దాని అల్లిక దగ్గరగాలేదు. చెయ్యిపట్టే సందులుగల చక్రం అది. నాకోసం ఆ ఫాన్ తీయించి పెట్టినందుకు నవ్వొచ్చింది. పిల్లలు స్కూలుకెళ్ళారు. 'అమ్మో' అని కేక వినబడింది. పక్కకి తిరిగి చూశాను. ఉంగరంవేలుని నోట్లో పెట్టుకుంది బీ. ఏం జరిగిందో తెలిసింది. ఆ ఫాన్ తిరుగుతుంటే అందులో వేలుపెట్టింది. వేలుకి దెబ్బతగిలింది. చెయ్యి తీసేసి, వేలు నోట్లో పెట్టుకుంది.

"దెబ్బ తగిలిందా?"

వేలు పైకెత్తి చూపించింది. రక్తంలేదు. మంటపెట్టే దెబ్బ తగిలి వుండొచ్చు. లోపలినుంచి పనికుర్రాడొచ్చి ఆమెను కసిరాడు. ఫ్యాను ముట్టుకుంటే చేతులు విరగ్గొడతానన్నాడు. అవతలకి పొమ్మన్నాడు. బీ నాకేసి జాలిగా చూసింది. నేనేం చెయ్యను?

"అందులో వేళ్ళు పెడితే దెబ్బ తగులుతుంది. అలా చెయ్యకేం" అన్నాను.

సరేనన్నట్లు తలవూపి, నవ్వింది. పనికుర్రాడు ఆమెను దూరంగా నెట్టి, తలుపువేశాడు. ఆ వీధిలో మాంసంకొట్టు సాయబు పిల్లట బీ. వాళ్ళమ్మ మిషను కుడుతుంది. ఆ వీధిలో వున్న యిళ్ళల్లోకి వెడుతూ, యజమానులు చెప్పిన చిల్లర పన్లు చేసిపెడుతూ వుంటుంది. పూలు, పాలు, పేపర్లు, రిక్షాలు- యిట్లాంటివి తెచ్చిపెట్టడం, ఎవరికి తోచింది వారు ఇస్తోంటారుట. పిల్లలతో ఆడుకొంటూ వుంటుందిట. గదుల్లోకొచ్చి ఫాన్‌లో చేతులు పెడుతూ వుంటుందిట.

పిల్లలందరికీ ఫాన్‌లో వేళ్ళుపెట్టడం మామూలే. పిల్లలకి కదలికంటే చాలా ఇష్టం. ఫాన్ విప్పి, మళ్ళా కదిలేటట్లు చెయ్యడంలో వారి శక్తి ప్రకటితమవుతుంది. ఆ ప్రకటనలో వారి కానందం వుంది. నేను మరొకటి గమనించాను.

మగపిల్లలకి కదిలే ఆటవస్తువులంటే యిష్టం; ఆడపిల్లలకి కదలని బొమ్మలంటే ఎక్కువ యిష్టం. ఈ సూత్రాన్ని గుర్తించుకునే నేటి ఆట వస్తువులు తయారవుతున్నాయనుకొంటా. అందుకనే గిరగిర తిరుగుతున్న ఫాన్‌లో చెయ్యిపెట్టి నిలిపివేసిందేమో బీ అనిపిస్తుంది.

ఆ మర్నాడు మరొక చిత్రమైన దృశ్యం చూశాను. కిటికీలోంచి రోడ్డుమీద నడిచే జనంకేసి చూస్తూ కూర్చున్నాను. చెట్టుపక్కన చిన్న మాంసం దుకాణంముందు, ఎవరిదో బైసికిలొకటి స్టాండ్‌మీద నిలబెట్టబడి వుంది. హాషిమాబీ అటుకేసి వెడుతూ ఆ సైకిల్‌ముందు చూస్తూ నిలబడి వుంది. పెడల్ తిప్పి, వెనకచక్రం కదిపింది. పెడల్ వేగంగా తిప్పింది. చక్రం మరింత వేగంగా తిరుగుతోంది. బీ తన వేలిని ఆ చక్రం కడ్డీల

మధ్యపోనిచ్చి, నిలవబోయింది. దెబ్బ తగిలినట్లుంది. చటుక్కున చెయ్యి తీసి నేసి వేలుని నోట్లో పెట్టుకుంది.

తనకేసి ఎవరేనా చూశారేమో అన్నట్లు నలుదిక్కులా చూసింది. నే కూర్చున్న కిటికీవేపుకూడా చూసింది, నవ్వింది. పరుగెత్తుకపోయింది.

నాకూ నవ్వొచ్చింది. ఆ అమ్మాయికీ నాకూ ఏలాంటి సంబంధమూ లేదు; వుండదు. అయినా ఎందుకో మా యిద్దరిమధ్యా ఒక చిత్రమైన సన్నిహితత్వం ఏర్పడినట్లయింది. తరిచిచూస్తే అది కనబడదు; కారణాలు వెదికితే దొరకవు. సముద్రంలోంచి ఆవిరిలేచి మేఘంగామారి క్షణంలో భూమ్యాకాశాలని ఏకంచేసి, కడలి మాయమవడంలో వున్న స్థూలత్వమే ఈ ఆప్యాయతలోని అనుభవానికీ వుందనిపిస్తుంది.

ఫాన్‌లో వేళ్ళుపెట్టి నీ పాలని పిన్నలకేకాక, పెద్దలకి కూడా అనిపిస్తుంది. నా కట్లా ఎన్నోసార్లు అనిపించేది. దీనికి కారణం ఏమిటో మానసిక శాస్త్రజ్ఞులు చెప్పాలి.

తెలియనివాటిని శోధించి తెలుసుకోవాలన్న అభిలాష మానవనైజం! స్విచ్‌లో చెయ్యిపెట్టి, విద్యుత్‌ద్వారా షాక్‌తింటే ఎట్లావుంటుందో! అలాగే ఫాన్‌లో చెయ్యిపెట్టి ఆపితే ఏం జరుగుతుందో! దెబ్బ తగులుతుంది. ఆ దెబ్బలో బాధ వూహించుకుని మనపట్ల మనకి సానుభూతి కలగడం, ఆ సానుభూతితో ముడిపడే ఆదరణ, శాంతి-యీ రకం చేష్టలకి ప్రేరణ అని తోస్తుంది. నాలుగంతస్తుల మేడమీదనుండి కిందికి చూసినప్పుడు, ఒక్క క్షణం, ఆ గోడమీదనుండి కిందికి దూకాలనిపిస్తుంది. ఊపిరిబిగపెట్టి అంత పనీ జరిగినట్లు వూహించి గోడనుంచి ఒకడుగు వెనక్కి వెయ్యడం జరుగుతుంది. మనల్ని మనం మానసికంగా బాధించుకోడం కిందకొస్తుంది ఈ తృష్ణ. కాని చాలామందిలో, నాలోలాగే, యీ తృష్ణ ఊహలోనే వుండిపోతుందేమో! ఈ విషయంలో కార్యరూపం దాలుస్తోంది యీ బుద్ధి. నాకు చెయ్యాలనిపించికూడా చెయ్యలేకపోయిన పనినికాస్తా, ఆమె సాహసంతో చేసేసింది. అందుకనే ఆమెపట్ల ఆరకం ఆకర్షణ, అన్యోన్యం ఏర్పడిందేమో అని స్ఫురిస్తుంది. 'నువ్వు చెయ్యవుగామా! చూడు, నేను చెయ్య

పెట్టి అప్పచేస్తా' అన్నట్లు, ఆ పనిచేసి, చేసినట్లు నవ్వుద్వారా ప్రకటించి వెళ్ళిపోయింది బీ. ఇంకటి స్వల్పవిషయంలో మా ఇద్దరిమధ్య ఒక స్నేహ భావం ఏర్పడినట్లనిపించింది. ఆమె జీవితం ఆమెది- నాది నాది. మా మార్గాలు వేరు. ఏదో బాధ, బాధని తీసెయ్యాలన్న బాధ, తీసెయ్య లేనందుకు నాకు బాధ. నా బాధనిచూసి ఆమెబాధ- అంతా ఆ గిరగిరతిరిగే బీ కళ్ళల్లో తిరిగిపొయ్యే కళ్ళని నిలిపినట్లుగా నవ్వినప్పుడు నిశ్చలంగా మెరిసే ఆమె పళ్ళమధ్య తళుకు — శాశ్వతంగా కదిలిపోయిన మధుర క్షణం ఆ అనుభవం.

కుటుంబరావింట్లో గడిపిన ఆ రెండుమూడురోజులూ, లోలోన యిట్లాంటి ఆలోచనలు సాగించినట్లు గుర్తు. పనికాగానే వెళ్ళిపొయ్యాను. 'బీ' విషయం మరిచిపొయ్యాను కూడా.

నాలుగేళ్ళ తర్వాత మళ్ళా హైదరాబాదు రావడం జరిగింది. కుటుంబరావింట్లో శుభకార్యం. నాకు వేరే పనికూడా వుంది బీ కనపడ్డం లేదేం? అని అడిగాను. ఏడాదిక్రితం మహబూబ్ అనే ఒక ముస్లిమ్ కుర్రవాడిని వివాహం చేసుకుందిట. అత్తవారింటికి వెళ్ళిందిట.

"రేపొస్తుందంటండి" అన్నాడు పనికుర్రాడు మరెన్న. వెనక బీని కసిరి గదిలోంచి పంపించి తలుపేసింది పీడే. పీడూ ఎదిగాడు. కంఠం బరువైంది. క్రాప్ పెద్దగా పెంచి వెనక్కి దువ్వాడు. నుదుటిమీద పడే వెంద్రుకలని వెనక్కి తోసివెయ్యడం వాటిని ముందుకులాగి, మళ్ళా వెనక్కి తోసెయ్యడం— అది వాడికి సరదా. గోడవెనక్కి నక్కి సిగరెట్టు పీలుస్తున్నాడు. అదీ నే గ్రహించినట్లు తెలుసుకుని, కాస్తంత సిగ్గుపడి నవ్వుతాడు. వాడినిచూస్తే బీ జ్ఞాపకం వొచ్చింది.

"బీ మొగుడి కేంపనిరా ?" అని అడిగాను.

"మోటారుసైకిలు మీద డర్ బిర్, డర్ బిర్ మజాయించడము" అని నవ్వుతున్నాడు.

నవ్వు దేనికిరా ?"

"ఆదేమో ఎనకాల కూర్చుంటుందండి. ఓ-దర్‌బర్, దర్‌బర్ మంటూ వూరంతా కజాయింపండి" అని నవ్వుతూ గోడవెనకనక్కి-సిగరెట్టుదమ్ముతీస్తున్నాడు పనికుర్రాడుమరెన్న 'మజాయింపుట', 'కజాయింపుట'— ఏవో క్రొత్త ప్రయోగాలు నా మీద పడేస్తున్నాడు యీ బాలభాషాకోవిదుడు మరి!

నాకు నిజంగా దీన్ని, భర్తని చూడాలనుంది. దీకి పెండ్లయిందనగానే, చిన్నప్పుడు నే చూసిన ముస్లింల పెండ్లిండ్లతంతు దృశ్యాలు జ్ఞప్తికొచ్చాయి-మేలిముసుగులు, గుర్రాలమీద ఊరేగింపులు, మల్లెపూల దండలు, షహనాయి వాద్యం, ఘాటైన పరిమళాలు— గ్యాస్‌లైట్ వెలుగులో ముసుగుమధ్యలో మెరిసిన లేతనవ్వులు, నోరువిప్పితే అందులో వజ్రాలని దొంగిలించుకుపోతారన్న భయంతో బిగించిన పెదవులు.

దీ భర్తకి భారతభూసేనంలో పనిట- కుటుంబరావు చెప్పాడు. కొంతకాలానికి ఆమె భర్తకి పెద్ద పదవి దొరుకుతుంది. భర్త సైన్యాన్ని అటూయిటూ నడుపుతుంటే, ఆమె వాటిని సంజ్ఞలుచేసి నిలిపివేస్తుందా? ఆ దంపతులు గుర్రాలమీద స్వారిచేస్తారా? వెనకటి యుద్ధాలలో, గుర్రాలు, ఏనుగులు. ఇప్పుడు టాంకులు, మోటార్లు. దీ భర్తకు వొక మోటార్ సైకిల్ వుందిట. దానిమీద అతివేగంగా ప్రయాణం చేస్తూ వుంటాడట— భార్యని వెనకాల సీటుమీద కూర్చోపెట్టుకుని.

కాని మొన్నాడు, అత్తవారి వూరునుంచి దీ రాలేదు— మరెన్న చెప్పాడు.

"ఎందుకనో?"

"అసలు వొకచోట వుండేగదండీ. ఆ మోటారుసైకిలుమీద, దాన్ని ఎనక కూకోపెట్టుకుని, చర్‌పర్, చర్‌పర్, గర్‌బర్, గర్‌బర్ మంటూ లగాయించడంతోటే సరిపోతుందండి" అన్నాడు మరెన్న. మరి కొన్ని క్రొత్త ప్రయోగాలు నా నెత్తిన రుద్దుతూ, ఆ మొర్నాడు నేను బైలుదేరి వొచ్చేశాను.

నేను ఇంటికొచ్చిన నెలరోజులకి కుటుంబరావు వ్రాసిన ఉత్తరంలో దీ భర్త మోటార్‌సైకిలుమీద వెడుతూ ప్రమాదవశాత్తు సైకిలుమీదనుండి

ఎగిరిపడి, గాయాలవల్ల హాస్పటల్‌లో మరణించాడన్నవార్త చూసి దిగులు పడ్డాను. వెనక సీటుమీద 'వి' కూడా వుండిట. ఆమె కూడా పడిందిట. ఒకటి రెండు చిన్నగాయాలు తగిలాయిట, కాని పెద్ద ప్రమాదం జరగ లేదుట.

ఏం జరిగిందో ఊహించవచ్చు. యువకులకి వేగంగా ప్రయాణం చెయ్యడం అంటే చాలా సరదా కదలిక, పురోగమనం, వేగం — వీటిని కాంక్షిస్తుంది యవ్వనం. భర్త మోటారుసైకిలుమీద వెళ్ళినప్పుడల్లా తనూ వస్తానని, వెనక సీటుమీద కూర్చుని, ప్రయాణం చేస్తూ వుండేది. అతి వేగంగా వెడుతుంది మోటారుసైకిలు. పడికి పడిపోకుండా అతని భుజాలు గట్టిగా పట్టుకుని కూర్చుని వుంటుంది తాను. శృంగారపు తృష్ణని తాళ్ళగా పేని అతని మెడచుట్టూ బిగించి ఇంక మోటారుసైకిల్ నిలపమంటుంది. అతను వినిపించుకోడు; ఆ శృంగారం చక్కిలిగింతకి ఉద్రిక్తుడై మరీ వేగంగా సైకిల్ నడిపిస్తుంటాడు. ముందుచక్రం వేగంగా కదలడం ఆమె చూస్తుంది. అందులో చెయ్యిపెట్టడానికి అందదు. అందులోనో వెనక చక్రంలోనో, కాలుపెట్టి వుంటుంది— ఏమో! మొత్తానికి నడుస్తున్న సైకిల్‌ని నిలిపేయత్నం చేసి వుంటుంది.

ఆ ఊగిసలాడ్డంలో భర్తపట్టు సడలి వుంటుంది. వేగంలో మతి పోయి, ఏ మలుపు తిరగడంలోనో యంత్రంపట్ల అధ్వర్యం విస్మరించి, సైకిల్ తిరగబడి, ప్రమాదానికి గురై వుంటాడు. వేగంగా వెడుతున్న ఆ మోటార్‌సైకిల్‌ని, ఉద్రేకంతో కొట్టుకుంటున్న ఆ గుండెలని, వొక్కసారి అరికట్టి, శాశ్వతంగా, స్థిరంగా, తనదిగా చేసుకోవాలన్న యత్నం అల్లా అంత మొందిందనుకుంటేనే నాకు తృప్తి. మృత్యువుకి కారణాలు ఏమిటో వేదాంతులు చెప్పొచ్చు. మరో కొత్త కారణం కల్పించింది, 'హోషియా మహబూబా వీ'! అర్థరహితమైన జీవితానికి అర్థం కల్పించడం తప్ప మానవుడు చెయ్యగలిగిన మహత్కార్యం ఏముంటుంది?

పెండ్లికూతురుగా 'వి' ని ఊహించుకున్నాను. తెల్లటి పైజామా— ఆకుపచ్చరంగు పొడుగాటి జుబ్బా— నారింజరంగు కండువా మేలి ముసుగులా తలమీదనుండి బుజాలపైకి రెండంచులూ జారేటట్లు ఆ పల్చని

కండువా మడతలలోంచి ఆకుపచ్చ జుబ్బా— వక్షంమీద వ్రేలాడవేసిన రెండుజడలు, ఏ అవయవం కేసి చూడనీకుండా, గిరగిర తిరిగే కంటిలో పాప, నిలిచి చూడమని శాసించే పళ్ళతళుకు, శాశ్వతంగా నవ్వే శిలా ప్రతిమలా విడిన పెదవులతో నిర్మాణమైన విడని మొగ్గలాంటి ఆ చిన్ని నోరు, దోవ వెదుకుతూ, గుండ్రటి ఆవరణ చేసుకుంటూ, బెదిరి వెనక్కి వెళ్ళి తెగించి ముందుకొచ్చి, ఒకరికొకరు తోడన్నట్లు వక్షంపై తేసుకుని శిఖరాలని అందుకుంటున్న చిన్ని గుండ్రటి స్తనాలు— రక్తమాంసాల పిల్ల పర్వతద్వయం నడుమ లోయలో కదలని నదిలా సన్నటి నడుం— హాషిమాబీని పెండ్లికూతురుగా అలా ఊహించుకున్నా. మరిప్పుడో వైధవ్యంలో బీ. అడవంతా ఒక్కసారి మండినట్లు, యౌవ్వనపు శృంగారం ఒక్కసారి ప్రజ్వరిల్లి, భూకంపంలా భర్త కోర్కెని చీల్చి, కిందకి పడేసి ఆశక్తితో అతన్ని చంపేసి, మండి మిగిలిన అడవిలో ఒంటి వృక్షంలా, ఎడారిలో మతిపోయి మిగిలిపోయిన చెట్టువేరులా, చంద్ర బింబాన్ని కామించి గెంతి మరి కిందికి దిగిరాని సముద్రం కెరటంపై తుంపరలా– ఎక్కడో హిమాలయ మంచుశిఖరాన ఇరుక్కుపోయిన తెల్ల మేఘంలా 'బీ' నా ఊహాలో నిల్చిపోయింది. పెండ్లికూతురుగా, తనూ భర్తా నన్ను చూడ్డానికొచ్చి సలాం చేసినప్పుడు ఏదేనా కానుక ఇద్దామను కున్నాను. వైధవ్యంలో ఆమెను తల్చుకుంటే అలా చూడకపోవడమే మంచిదనిపిస్తోంది. నా కెందుకీ బాధ!

భర్త చనిపోయిన తర్వాత బీని కుటుంబరావు చూశాడుట- నేను మరోసారి హైదరాబాదు వెళ్ళినప్పుడు చెప్పాడు. వాళ్ళ పాతింట్లో కిటికీ వెనక నిలబడి, సంధ్యకేసి చూస్తూ వుందిట. నల్లజుబ్బా. అక్కడ చిరిగిన తెల్లకండువా ముసుగులా జడమీద కప్పివేసి నిలబడిందట. అతన్ని చూడగానే గుర్తించినట్లు ఓపికలేని మందహాసంలో పళ్ళతళుకు, పెదవుల వెనక వికసించని పుష్పంలో పుప్పొడిలాగ ముక్కలైపోయిందిట. "నువ్వు చెప్పింది నిజమే. కంటిపాప గుండ్రంగా తిరుగుతున్నట్లు కనబడుతుంది" అన్నాడు కుటుంబరావు.

ఆ దృశ్యం కూడా నే చూడకుండా చేసిన విధికి లోలోన కృతజ్ఞత చెప్పుకున్నాను. విధిని వెక్కిరించనివారూ, తిట్టనివారూ లేరు నాకు విధిపట్ల గురిలేదు. కాని యీ ఒక్కసారి దాని ఉనికిని గుర్తించి జోహారు చెప్పుకున్నాను.

కుటుంబరావుకి అక్కడనుండి మరో ఊరు బదిలీ అయింది. వెడుతూ నా పని ముగిసేవరకూ తనింట్లోనే వుండవల్సిందిగా ఏర్పాట్లన్నీ చేసి, పనికుర్రాడు మరెన్నని వప్పగించి వెళ్ళాడు. ముందుగదిలో ఫాన్ లేదు. వీధిలో వెనకవున్న మాంసం దుకాణం, చెట్టు వేపు. ఇప్పుడక్కడ ఒక టీ దుకాణం అవతరించింది. రాత్రి పగలూ, గ్రామఫోను పాటలు లవుడ్ స్పీకరులోంచి బిగ్గరగా వినిపిస్తుంటాయి. ఆలోచన తోచనివ్వని ధ్వనులు. ఒకటి రెండు రోజుల్లోనే దానికి అలవాటు పడిపోయాను. ఆ దుకాణం రోతగా తోచినా, ఎందుకో అది దగ్గరలో వుందనుకుంటే కాస్తంత ధైర్యంగా, ఆహ్లాదంగాకూడా వుండేది. అయిష్టత పురిగొల్పే వాటితోకూడా సమాధానపడి వాటిని తనవిగా చేసుకుంటాడు కాబోలు మానవుడు.

టీ దుకాణంముందు సైకిలాగింది; ఒక మోటారు సైకిలాగింది. ఇద్దరుముగ్గురు పిల్లలుచేరి వాటిని పరీక్షగా చూస్తున్నారు. బీ జ్ఞాపకం వచ్చింది. ఆ యంత్రాలతో చెలగాటం ఆడి వినోదించేవారు లేరుకదా. బీ ఇప్పుడు ఎవరిళ్ళకీ వెళ్ళడంలేదని చెప్పాడు కుటుంబరావు. నా కామెని చూడాలనివుంది ఎందుకో! చూస్తే బాధగా వుంటుంది నిజమే. బాధ పడటంలో కూడా కాస్తంత ఆనందం పొందాలనిపిస్తుంది. త్రాచుపాము పడగపై గుర్తు, సముద్రం లోతులో ముత్యపు చిప్పలో ముత్యం, పౌరాణిక యుగంలోని జలచరం నుదిటిమీద వజ్రం, జుగుప్స కలిగిస్తాయి, ఆకర్షిస్తాయి. పాముని పెంచింది క్లియోపాత్ర. ముళ్ళపొద నీడలో వెన్ను వాల్చింది ఈజిప్టురాణి నేఫెర్ టిటి. కత్తిని తన రక్తంలోముంచి జాబు వ్రాసింది యూన్సీ. ఈనాడివి 'బీ'కి సాధ్యంకావు. ఆమె చరిత్ర కట్టలవెనక స్త్రీ. జమునా ఒడ్డున పాడుపడిపోయిన మహల్‌లో మూలగదిలో గులాబి

పూలమధ్య మొహం దాచుకుని, ఎర్రటి సంధ్యాలావణ్యం చూసి ఎర్రటి పెదవి కొరుక్కుని, కారిన రక్తం చుక్కలని రాని ప్రియుడికోసం, తన గుండెవలె, ఆ చుక్కలు గడ్డకడుతుంటె చూసి విషాదంలో జారిన కన్నీటి బొట్లద్వారా, గడ్డకట్టనీకుండా క్షామంతో శోకిస్తున్న చారిత్రిక జనానా లోంచి విముక్త అయిన ముస్లిం కన్య టీ కాసించేటందుకు రాకొమారులు లేరు యీనాడు: జయించేటందుకు రాజ్యాలు లేవు: ఎక్కేటందుకు పల్లకీలు లేవు. భగ్నం చేసేటందుకు ప్రేమించే హృదయాలు గుర్రాలమీద స్వారీ చేస్తూ రావు. ఆ దొరికిన ఒక్కదాన్ని, ఆ యంత్రంలో పడేసి చంపే సింది.

టీ దుకాణంలోంచి తిన్నగా నా గదికొచ్చాడు కొత్తగా పరిచయం అయిన రాజన్నగారు.

"పాపం! టీ ఎలావుందో చూశారా?"

"ఆ మధ్య చూశాను- రెండు నెలలైందేమో."

"దానికేం నిక్షేపంలావుంది" అన్నాడు.

"అంటే?"

"మా యింటికొచ్చింది చూడ్డానికి."

"దిగులుగా వుందా?"

"దిగులేం తెగులు. ఆటీన్ రాణీలాగుంది. పైగా మా గోడ గడియారం తగలేసింది"

"అంటే?"

"మాదో పాతది, గోడగడియారం వుందిలెండి. మావాడు కీ ఇచ్చి, అద్దంతలుపు వెయ్యడం మరిచినట్టున్నాడు. టీ వెళ్ళి అందులో చెయ్యెట్టి, పొడుగాటి తీగకి వుంటుందే పెండ్యులమ్ విళ్ళని కదిపినట్టుంది. ఏం చేసిందో నే చూడలేదు. మొత్తానికి ఆ గడియారం కాస్తా మూలపడింది" అన్నాడు రాజన్న.

నాకు నవ్వొచ్చింది— ఆపుకున్నాను. పాడైంది మన గడియారం కాదుగా— నవ్వితే ఆయనకి కోపం రావొచ్చు.

"అన్నీ అట్లాంటి పన్లే. ప్రతిదాంట్లో వేళ్ళుపెట్టడం, చెడగొట్టడం, వేళ్ళు విరగకొట్టుకోడం" అన్నాడాయన.

"మరంతే— ఆ పిల్ల జీవితం ? భవిష్యత్తు మాటేమిటి ?" అన్నాను.

"ఏమో, ఎవడికి తెలుసు. వాళ్ళమ్మ మిషను కుడుతుంది. ఇదికూడా ఆ పని నేర్చుకుని, గడుపుకుంటుంది— ఏదో ఉపాధి దొరక్కపోదుగా" అని వెళ్ళాడు రాజన్న.

తరవాత, పనికుర్రాడు మరెన్న నడిగాను దీని గురించి. మరెన్న తన చెయ్యి బోర్లతిప్పి చూపించాడు.

"చూడండి" అన్నాడు.

"ఏముంది ? ఏమీ కనబడ్డం లేదే !" అన్నాను.

"ఇప్పుడంతా సాఫైపోయిందిలెండి- అబ్బో ! వెనక నాలుగైదేళ్ళయిందండి— దొడ్లో ఆ వరండా ముంగల మెట్లున్నాయి చూశారు—ఆడ కూర్చుని ఫినైలుతో నేల తుడుస్తుండావండి. గుడ్డపీలిక ముంచి చదునుకు తుడుస్తుండా. ఆడకొచ్చింది బీ— నా చేతికేసి చూస్తూ నిలబడింది. 'లెగు, పో, అవతలకి' అన్నానండి. గిరగిర తుడుస్తుంటే, నా చేతిమీదికి గెంతి, కాలుతో తొక్కిందండి. 'అమ్మో చచ్చా' అన్నానండి. ఫినైల్ గొట్టం బుడ్డి పైకెత్తి, నెత్తిన పెడదామని తయముకెళ్ళానండి. పర్ కిర్, బిర్ కిర్ మంటా ఓ దౌడు తీసిందండి" అని ప్రత్యేకమైన వాడిభాషలో కొన్ని అమూల్యమైన ధ్వనులతో మేళవించి వర్ణనచేశాడు మరెన్న.

"భర్త పోయింతర్వాత, ఆమెను చూశావా ?"

"లేదండి. మొగుడుచస్తే బైటకి రారండి వాళ్ళు—"

"మరి రాజన్నగారింటి కెళ్ళిందిట."

"కూరకో, పచ్చడికో ఆళ్ళమ్మ పంపివుంటుందండి."

"ఇప్పుడు వూళ్ళో లేదా ?"

"లేదండి"

"ఏమైందో ?"

"హాయిగా మరో సాయిబుని పెండ్లిచేసుకుందండి."

"అదెప్పుడు ?"

"రెండు నెల్లయిందంటండి. అదుగో మిషనుకట్టు మహాన్ చెప్పాడండి."

"నిజంగా !" అన్నాను ఆశ్చర్యం ప్రకటిస్తూ.

"అవునండి. మలబార్ సాయిబంట. హాఫీజంటండి అదిపేరు. ఇమానం నడుపుతాడంటండి. ఆర్జి చేసుకుంది."

"వారి పెళ్ళి నువ్వు చూడలేదా ?"

"పై ఊళ్ళో స్నేహం కలిసిందంటండి. కసిబిసిగా, బిగిజిగిగా, గప్‌చిప్‌గా చేసేసుకుందంటండి-ఇమానంలో తర్‌మర్ పర్‌మర్‌గా తిరగొచ్చునని." అంటూ పనిమీద వెళ్ళాడు మరెన్న.

నాకు నవ్వొచ్చింది—బీ మళ్ళా పెండ్లి చేసుకుందన్న వార్త వినగానే, ఏదో కొంతభారం తగ్గినట్లనిపించింది. కన్య జీవితం మాతృత్వంలోగాని సంపూర్ణమవదు. అందుకనే కథలలోనూ, నవలల్లోనూ, విడివిడిగావున్న నాయికా నాయకలను జోడాలుగా కేటాయించ వల్సిందిగా రచయితని శాసిస్తాడు పాఠకుడు. వివాహంలో వారికథ సమాప్తం కావాలి. తరవాత వాళ్ళు ఎట్లావున్నదీ, ఏం చేసిందీ, అతను ఊహించుకో గలడు. తర్వాత ఏముంటుంది ? వారికి సంతానం కలుగుతారు. పెంచి, పెద్దలని చేసింతర్వాత, తలిదండ్రులు జీవితం చాలించుకుంటారు.

యుక్తవయస్సులో ఎవరేనా పెండ్లికానివారున్నారంటే, వారిపట్ల సమాజానికి బాధ్యత వుండితీరుతుంది. వారినో ఇంటివారినిగా చేసేవరకూ సమాజం నిద్రపోదు. నాలో వున్నది యీ రకం తృప్తికాదు. వివాహం చేసుకోవడంలో 'బీ' వ్యక్తిత్వం బైటపెట్టింది. ఆమె చాలా బీదది. నేను ఎదిగింతర్వాత చూడకపోయినా, పెద్ద చక్కంది కాదనే అనుకుంటాను. రోడ్డు ముగిసింతర్వాత ఊరవతల వానకి తడిసిన మన్నుగుట్టలు 'బీ' లాంటి స్త్రీలు. తోచక చేతులో వో ముద్దని తీసుకుని కాలక్షేపానికి దాన్ని కదిపి, దువ్వి, నొక్కి వొక ఆకృతితెస్తాడు అటు నడిచిన పురుషుడు. ఎండకి గట్టిపడి ఆ రూపం ప్రతిమగా నిలిచిపోతే వూళ్ళోకి తీసకెళ్ళి వొక చూరుకింద పెడతాడు. బొమ్మ పగిలి విడుతుంది. అందులోంచి మరో

బొమ్మ బైటపడొచ్చు. ఏమీ లేకపోవచ్చు ఈసారి నాకు 'వీ'ని చూడాలని వుంది. కాని వాళ్ళు హైదరాబాద్‌లో లేరు. భర్తకి ఔరంగాబాద్ విమానాశ్రయంలో పనిట. అక్కడికి వెళ్ళారు. ఆమె తల్లి కూడా అక్కడికే వెళ్ళిందిట.

నేనూ మా ఊరువెళ్ళిపొయ్యాను. 'వీ' కి పెండ్లి కాగానే ఆమెపట్ల కుతూహలంకూడా సన్నగిలింది. ఆమెని గూర్చి ఆలోచించడంకూడా జరగడంలేదు- ఎప్పుడేనా ఆకాశంలో విమానం వెడుతూ చేసే చప్పుడుకి, పైకి చూసినప్పుడు తప్ప.

రెండుమూడు నెలలకిగాని మళ్ళా హైదరాబాదు వెళ్ళే అవకాశం కలగలేదు. బదిలీ అయిన కొత్తఊరు కుటుంబరావుకి సరిపడలేదు. అతని ఆరోగ్యం బాగుండలేదు. మళ్ళా తనని హైదరాబాదు బదిలీ చెయ్యవల్సిందిగా దరఖాస్తు పెట్టుకున్నాడు. దానికేమీ సమాధానం వొచ్చినట్లులేదు. ఆరోగ్యం కోలుకొనే నిమిత్తమై రెండునెలలు శెలవుపెట్టి హైదరాబాదు వచ్చేశాడు. చికిత్స నిమిత్తమై హాస్పిటల్‌లో చేరాడు. చూడ్డానికి రమ్మంటే వెళ్ళాను.

కుటుంబరావుకి విశ్రాంతి కావాలన్నారు డాక్టర్లు విశ్రాంతి కావాలన్న డాక్టర్లంటే నాకిష్టం. ప్రపంచంలో అరిష్టాలన్నీ అందరూ విశ్రాంతి లేకుండా, పనిలో నిమగ్నులుకావడం వల్లనే సంభవిస్తాయనుకునేవాళ్ళలో నేనొకణ్ణి. ప్రతి సంవత్సరం వొక్కరోజేనా, ప్రతివ్యక్తి తనుచేసేపని నిలిపివేసి, తమాయించి, తన్నుతాను సింహావలోకనం చేసుకుని ప్రయోజనం కోరకుండా, ప్రపంచాన్ని తిలకిస్తే సత్ చిత్ ఆనందాలు సమకూరుతాయనుకుంటాను.

ప్రపంచం నామాట వినదు ఈ ముక్కలు ఎందరెందరో చెప్పారు. ఏ వొకరిద్దరు ధన్యజీవులో తప్ప, యీ బోధ ఎవ్వరూ పాటించరు. గోళాలు తిరిగిపోతున్నాయి. భూమి తిరిగిపోతూంది. ఎవ్వరూ ఆపలేరు. సమాజాలు కదిలిపోతున్నాయి. మనిషి నిత్యకర్మ అనే చక్రంలో నలిగి తిరిగిపోతున్నాడు. ఆ చక్రం అతన్ని తయ్యారుచేసుకున్నదే. 'వీ' లాంటి

వారెవరేనా అపుదామని చెయ్యిపెడితే, ముక్క వూడిపడుతుంది. మధ్య నాకెందుకు ?

కుటుంబరావున్న వార్డుపక్కగదిలో మిషనుకుట్టు మస్తాన్ వున్నట్లు, మరెన్నవల్ల తెలిసింది. చూడ్డానికి వెళ్ళాను. ఏమిటో మిషనుకుట్టేవాళ్ళు సన్నగా వుంటారని నా ఊహ. అతనిపేరు మస్తానైనా, మిషనుకుట్టు మస్తాననే అనబుద్ధేస్తుంది ఎందకో. సన్నగా వున్నాడు. చిరుగుల జుబ్బా-టోపీ. లోతుకుపోయిన కళ్ళు, ఎదిగినగడ్డం, మధ్య వొక పన్నులేదు. మూతికి ఇరుప్రక్కలా కాపలాకాస్తున్నట్లు లోతైనగీతలు, నీరసంగా కిందికిచూస్తూ నవ్వుతూ మాట్లాడతాడు.

అతనికి కీళ్ళజబ్బుట-ముఖ్యంగా మోకాళ్ళు పట్టేస్తాయిట. మోకాలు చిప్పలపై ఏవో రబ్బరుగొట్టాలు జిగిలించారు. ఇప్పుడు కొంచం మెరుగేట-నడవగలుగుతున్నాడుట, ఇంక నాలుగైదురోజుల్లో ఇంటికి వెళ్ళిపోతాడుట.

"ఊరికే రాత్రి పగలు, మిషనుకుట్టడంవల్ల కాళ్ళు పట్టేశాయేమో-పోనీ కొంతకాలం చేతిమిషను వాడరాదూ?" అని వోదారుస్తూ మాట్లాడాను. మరెన్న నవ్వుతున్నాడు.

"ఈడొక్కడేనంటండీ, కిస్‌పిస్, కస్‌పిస్‌మని మిషను తొక్కడం బోలెడంతమంది లేరంటండీ-ఆళ్ళందరూ కాళ్లు పట్టి చస్తున్నారంటండీ-ఈడి కర్మ !"

నిజమేనన్నట్లు మస్తాన్ నవ్వుతూ తన కాళ్ళకేసి చూసుకుంటున్నాడు.

చేతులతో కాళ్ళమీద రబ్బరుగొట్టాలు సరిగ్గా సర్దుతున్నాడు. ఎడమచెయ్యి వెనకభాగాన మానిపోయిన దెబ్బ గుర్తు కనబడింది. ఆ దెబ్బకేసి చూశాడు మస్తాన్. నవ్వాడు. ఏమిటన్నట్లు చూశాను.

"ఇది ఔరంగాబాద్‌లో జరిగిందండి. ఆ మధ్య అక్కడ మిలటరీ వోళ్ళ మిషన్లు వేలం పాడుతున్నారు. చవకగా కొనుక్కొడుదువుగాని రమ్మందండి 'ఛీ'. సరేనని వెళ్ళాను."

"ఎట్లావుంది 'బీ' ?"

"బాగానే వున్నారండి. రేకుల గది వొకటుందండి. అందులో తనూ, హాఫీజు వుంటారండి. వెనక మరో చిన్నగది. అందులో వాళ్ళమ్మ, ఏదో గడించి పడేస్తాదండి. అయినా ఆఁవాటు చొప్పున వాళ్ళమ్మ మిషను కుడతావుంటుందండి ఆ చుట్టుపక్కల ఇళ్ళవాళ్ళ చిరిగిన బట్టలు అయ్యి, మరమ్మత్తు చేసిపెడుతూ వుంటుందండి"

"మరి బీ కి కాలక్షేపం ?" అన్నాను.

"మొగుడుతో షికార్లండి. ఆళ్ళకో జీపుందండి. అందులో...."

అతని మాట పూర్తిచెయ్యకుండా ఆ వాక్యాన్ని అందుకున్నాడు మరెన్న.

"తర్ బిర్, తర్ బిర్ మంటూ మొగుడితో షికార్లండి" అని నవ్వుతూ పూర్తిచేశాడు మరెన్న.

"విమానంలో వెళ్ళరా ?"

"నాకేం తెలుస్తుందండి. రెండురోజులే నే వుంట. ఓ రోజిల్లా వేలంపాటతో సరిపోయిందండి. మొగుడు- హాఫీజు విమానం నడపటం నేర్చుకున్నాడండి. అందులో కొత్తవాళ్ళకి నేర్పతానికి ఎక్కించుకుపోతా వుంటాడటండి. ఆడోళ్ళని రానీరంటండి."

"మరి నువ్వెక్కావా ?"

"లేదండి."

"మిషను కొన్నావా ?"

"కొన్నానండి. ఆళ్ళగదివెనక మందువాలో పెట్టి మిషను తొక్కిరైటు చూస్తున్నానండి సాయంత్రం. బీ వొచ్చి తొక్కుతుంటే ఆ చక్రంలో 'చెయ్యిపెట్టి వెనక్కి నెట్టిందండి. పై బెల్టువూడి, నా వేళ్ళు సూదికింద కుట్టడిపోయాయండి. అదండి యీ దెబ్బ" అని చేతి వెనకభాగంకేసి దిగులుగా చూస్తున్నాడు.

"మా బాగా అయిందిలే" అన్నాడు మరెన్న. మస్తాన్‌కి వో పాత లాల్చి పంపించాను.

"పట్టుకుంటారాండి ?"

"లేదు, నువ్వు తొడుక్కో–" అన్నాను. అందరం నవ్వుకున్నాం.

ఆ సాయంత్రం హోటలుకెళ్ళి కడుపార భోజనం చేశాను. హాస్పిటల్‌లోంచి బైటపడగానే, మనం ఇంక బ్రతికి వున్నందుకు దైవానికి కృతజ్ఞత చెప్పుకుంటాం నీళ్ళు పోసుకోడం, తినడం, నిద్రపోడం లాంటి దినచర్య మరింత తీక్షణంగా వుత్సాహంలో జరుపుతాం. సినిమాకు కూడా వెళ్ళాను. ఆ సినిమా ఏమీ బాగాలేదు. కాని నేను చాలా ఆనందించాను. ఆ ఆనందం అంతా నాలో వున్నదే అని నాకు తెలుసు.

ఆ మొర్నాడు కుటుంబరావు హాస్పిటల్ నుండి విడుదలయి, యింటికొచ్చే యేర్పాట్లు చేస్తున్నాం.

మరెన్న ఎక్కడా అయిపులేదు. పక్కగదిలో మస్తాన్ కూడా కనబడలేదు. ఏమయ్యారు ? రాత్రి విడుదలయి ఇంటికి వెళ్ళాడా మరెన్నని తీసుకుని ? ఏమో, డాక్టర్ని అడగాలనుకున్నా. ఆయన ఇంకా రాలేదు. ఈలోగా ఏర్పాట్లు పూర్తయి యింటికొచ్చేశాం.

మరెన్న లేకపోతే ఇంట్లో పనికి కష్టంగావుంది కుటుంబరావుకి. ఆ వీధిలో దుకాణంలో వుండే గాలిబ్ తన కూతుర్ని చిల్లరపనులకి పంపించాడు. ఆ పిల్ల పేరు 'ఖైరున్నిసా'. నల్లగా వుంటుంది. చెవులకు పోగులుంటాయి. కోలమొహం, బుగ్గమీద పచ్చబొట్లు, చలాకీగా వుంటుంది కాని ఎక్కువ మాట్లాడదు.

బ్రెడ్ పట్టుకురమ్మని పంపించాడు కుటుంబరావు. నేను స్నానం చేసి, కిటికీముందు కూర్చుని పత్రిక చదువుకుంటున్నాను. రోడ్డుమీద టీ దుకాణంనుండి సంగీతం గందరగోళంగా వినబడుతూంది. దానికితోడు మరో సినిమాలారీలోంచి పాటలు లవుడ్ స్పీకరులో భీకరంగా పోటీచేస్తూ వాతావరణాన్ని కల్లోల పరుస్తున్నాయి. ఆ గందరగోళంలో నా మనస్సెందుకో ప్రశాంతంగావుంది.

ఒక్కసారి ఆ ధ్వనులు నిలిచిపోయ్యాయి. అంతా నిశ్శబ్దంగా వుంది. ఎలాగ, క్రమం తప్పినట్లు నాకు చిరాకేసింది. ఆ పాటలు నిలిచిపోతే

పిచ్చెత్తినట్లయింది. టీ దుకాణంకేసి చూశాను. జనం గుమిగూడారు. నిశ్శబ్దంగా వున్నారు.

ఆ గుంపులో 'ఖైరున్నీసా' చేతిలో పొట్లం పట్టుకుని నిలబడివుంది. ఇంటివైపు పరుగెత్తుకొస్తోంది. ఏమిటో చూద్దామని నేనూ లేచి బైటికి రాబోతున్నాను. ఆ పిల్ల గబగబ వొగరుస్తూ వచ్చింది.

"ఏమిటది ?"

"బీ చనిపోయిందట" అన్నది.

నేను, కుటుంబరావు వొక్కసారి 'ఆ' అని నిలబడిపొయ్యాము.

"అడుగో మరెన్న" అని రోడ్డుమీద గుంపుకేసి చూపించింది. మేం గబగబ రోడ్డుమీది కెళ్ళాం. మరెన్న వాడి వెనక కుంటుకుంటూ మిషనుకుట్టు మస్తాను వస్తున్నారు.

"ఏం జరిగింది ?"

మెల్లిగా నడుచుకుంటూ వచ్చి, వరండాలో బల్లమీద కూర్చున్నాడు.

"విమానంలోపడి చచ్చిందండి— బీ" అన్నాడు. వివరాలు చెప్పమన్నాం.

"నిజం భగవంతుడికి తెలియాలండి. హాఫీజు మరొకమ్మాయిని చేరతీశాడంటండి. దానికికూడా విమానంలో పనిటండి. అందులో వెళ్ళేవాళ్ళకి టిఫిన్, టీ అయ్యీ యివ్వడంటండి. దాన్నికూడా తర్ఫీదుకోసం తిప్పమన్నారటండి. హాఫీజ్ ఆ పిల్ల నెక్కించుకుని పోతూంటం బీకి నచ్చలేదండి. అదంతా వొట్టిది- ఆడోళ్ళని విమానం ఎక్కనివ్వరు, ఆ పిల్లతో ఆ మిస మీద షికార్లు తిరుగుతుండావు, వొల్లకాదని మందలిస్తే అదు వినడంలేదంటండి. హాఫీజ్, ఆ కొత్తపిల్ల జీపులో తిరగడం- సాయంత్రాల విమానంలో ఎల్లడం చూసి 'బీ'కి బిసెక్కిందండి.

ఆ సాయంత్రం విమానం ఎగిరేచోటకి బైలుదేరాడంట హాఫీజు. నేనూ వస్తానంది 'బీ'. వల్లకాదన్నాడు. వచ్చితీరతానంది. హాఫీజు లగెత్తుకుపొయ్యాడు. ఆడెనకాల బీ పరుగెత్తింది. అక్కమ్మ పోమాకే, ఆ చచ్చినోడితో, నీకేం కతుకు అంటానే వుందంట— యిది...."

"....నో పగవటిగడపుం దేవుడు" అన్నాడు మరెన్న. అతన్ని చెప్పనీమని మరెన్నని మందలించాడు కుటుంబరావు.

"ఇంకేముందండి, విమానాలకాడ ఎవ్వరు లేరంటండి. వో విమానంలో హాఫీజు ఆ నేర్చుకునే మార్వాడీపిల్ల ఎక్కారంటండి. తలుపు లేశారట. ఏ పరుగెత్తుకుంటూ, విమానంకాడి కెళ్ళిందండి. విమానం కదిలిందంట. నిలవమంది 'ఏ'. పరుగెత్తుకుంటూ పైకి ఎగిరి గది తలుపు పట్టుకోబోయి, చెయ్యిజారి కింద పడి చచ్చింది అంటుందండి ఆ మార్వాడీ పిల్ల "అదేంలేదు. విమానం ముందుగా నిలబడింది. విమానం కదిలింది. అది తప్పుకోలేదు దాన్ని గుద్దేసి సర్రున వెళ్ళింది- ఫర్లాంగు వెళ్ళాక నిలిపాను. దిగిచూసేసరికి ఎక్కడా మనిషి అవుపలేను అంటాడు హాఫీజు. నిజం భగవంతుడికె తెలియాల. మొత్తానికి సచ్చిందండి- పసందైనపిల్ల పాపం...." అని మస్తాన్ తన మోకాలికేసి చూస్తున్నాడు.

కుటుంబరావు కళ్ళల్లో తడి చూశాను. అప్రయత్నంగా నా కళ్ళ కూడా తడిశాయి. రుమాలుతో తుడుచుకున్నాను.

"హాఫీజు అది సావాలనే విమానం పోనిచ్చాడండి. అందుకనే ఆణ్ణి పట్టుకున్నారు పోలీసోళ్ళు. అన్నే, ఆ పిల్లనీ...." అన్నాడు మరెన్న.

"ఏముందండి- ఆడు గోల- నాకేంలేదు బాబో అని ఏడుస్తాడు. అదీ ఆపుచెయ్యమంటే, ఆడంతా వేళాకోళం అనుకున్నాడుటండి. నిజంగా చస్తుందని కల్లోకూడా అనుకోలేదన్నాడండి. ఆళ్ళిద్దరినీ అరెస్టు చేశారండి. ఏ తుక్కుతుక్కు అయి, మనిషెక్కడా కనబడలేదండి. తెల్లవార్లు లైట్లేసుకుని వెతికి, తెల్లారగట్ల, పొదల్లో దానిబట్టల పీలికలు, మిగిలినవాటినీ తెచ్చి భద్రంచేసి గుర్తుపట్టే నిమిత్తం తెలిసినవోళ్ళని పట్టుకు రమ్మని, పోలీసోళ్ళని కారులో పంపితే, నేనూ- నడవలేను కదండి- సాయంగా మరెన్న, రాత్రి కార్లో బైలుదేరి మధ్యాహ్నానికి చేరుకున్నా మండి. గుర్తుపట్టామండి. ఆణ్ణి విడిచి పెడతారంటలెండి- పెద్ద పోలీసువారం

బ్రహ్మాండమైన వేగంతో పాన్ రెక్కలు గుండ్రంగా తిరుగుతున్నాయి. నిలవమని కేకేసింది ఆ శబ్దంలో ఎవరికీ మాట వినపడదు. విమానం కదలబోతోంది. ఆ రెక్కలని పట్టుకుని నిలిపివెయ్యాలి. తనకి తెలిసింది, అలవాటైంది అసాధ్యాన్ని సాధనం. చెయ్యిపెట్టి పట్టుకోబోయింది. ఆ చక్రంలో శక్తి ఆమెని గిరగిరా తిప్పి, తుక్కుచేసేసి, దూరంగా ఎక్కడికో విసిరిపారేసింది. ఆమెలో మిగిలిన భాగాలు గుర్తుపట్టడమే కష్టమైపోయింది.

ఆ విధంగా ఈ బంధమెందుకుందనుకుంటాను. మహాత్మ్యమంతా చెప్పుకుని కుటుంబరావు, నేనూ ఒక నిర్ణయానికొచ్చాం. కొన్ని విషయాల పట్ల కారణాలు స్పష్టంగా కనబడకపోవచ్చు; తర్కబద్ధమైనవిగా నిర్ణయానికి తరమనక్కర్లేదు. కాని సత్యదర్శనాన్ని మనస్సు ఆమోదిస్తుంది. ఆ ఆమోదంలో గొప్ప ఆనందం వుంది.

రాయిమీద కూర్చున్నా, పత్రాలు గుసగుసగా వినపడుతున్నాయి. ఎక్కడనుండో ఏ జంతువు అరుపో వినబడుతోంది; ధ్వని నిశ్శబ్దాన్ని కామిస్తోన్నట్లు, పాదాలకింద కీచురాయి రోదిస్తోంది. ఆ నిశీధి ప్రశాంతతలో నా ఊపిరికి స్థానంలేదు. నిట్టూర్పు అక్కడ వొదిలేసి వెనక్కి తిరిగాను అక్కడే వొక రాయిలా స్తంభించి నిలిచిపోతుంది ఆ నిట్టూర్పు.

మృత్యువుతో కథని ముగించడం సులువే. కథలో ఇమడటానికి అనువైనవిగా సిద్ధంగా లభించవు జీవితంలో సంఘటనలు. కాని ఈ కథ సిద్ధంగా పెట్టిన కథ. అమర్చిపెట్టిన కథ. దాని కేదో అతికించి, కల్పించి, వ్యాఖ్యానించి, ముగించే అవసరం లేకపోయినా, చటుక్కున స్ఫురించే అర్థమట్టుగా కనిపించడం లేదు. ఈ కథకేమున్నా అర్థంవుందేమో ఎవరైనా చెబితే సంతోషిస్తా.

ఏదో అంతరార్థం కల్పిస్తేగాని, మనస్సు ఊరటబడదు. ఈ ప్రాణి ఏ కొత్త విషయం సాధిస్తుందో చూద్దామన్నట్లుగా వొక్కొక్క జీవిని లోకంలోకి నెట్టుతుంది సృష్టి. తన ఉనికిని పెంపొందించుకోవాలనే సృష్టి అభిలాష. దానికి తోడ్పడేటందుకు ప్రాణులను సృష్టిస్తుంది. ఒక్కొక్క

ప్రాణి వొక్కొక్క సృష్టి రహస్య పరిశోధకుడు. వారివారి కృషి ఫలించిందీ లేనిదీ సృష్టికే తెలుస్తుంది. పెడదోవని పట్టినవారినీ, మిడిసిపడీ, అతిగా శోధించినవారినీ సృష్టి మందలిస్తూనే వుంటుంది. తన శక్తికి మించిన శక్తిగల ప్రాణులొచ్చినపడితే భరించలేదు.

అట్లాంటి ప్రాణి, హాసిమా ఏ. సంద్రంగా తిరిగే కంటిపాపల నేత్రాలుగల శారీరక వైచిత్రిని తెప్పించని సృష్టి రహస్యాన్ని శోధించ దానికి పూనుకుంది ఆమె. ఆ పరిశోధన స్వరూపం ఎట్లాంటిదో నే ఊహించగలను.

మొత్తం విశ్వంలోవున్న పదార్థం అంతా వొక చిన్న గోళంగా కుదించి వుండేది సృష్టి ప్రారంభంలో. అది ఎందుకు అట్లావుందో, ఎక్కడనుంచి వొచ్చిందో ఎవ్వరికీ తెలియదు. ఉంది. అంతే ఆదిలో దాన్నెవరో గిర్రున తిప్పారు. అది కోట్ల సంవత్సరాలుగా గిరగిర తిరుగుతోంది. తిరగడంలో గోళంలోపల పదార్థం అణువులు వొత్తిడికి లోనై, విడి వేరు వేరు గోళాలుగా తిరుగాడాయి. అట్లా ఒకొక్క గోళంలోనుంచి కొన్ని పిల్లగోళాలు పుట్టి విడిపోయి, పరిభ్రమిస్తూ వున్నాయి. విడిపోయినా వాటికి అన్యోన్య ఆకర్షణ వుంది. నిర్ణీతమైన దూరంలో మార్గంలో తిరుగాడుతాయి. గోళాలు పెరిగిపోతున్నాయి. కొన్ని విడిపోయి, నుశైపోతున్నాయి. కొన్ని పెద్దవైపోతున్నాయి. విశ్వం పెరిగిపోతూవుంది. విశ్వంలో ప్రతి పదార్థమూ గిరగిర తిరిగిపోతోంది. దాన్ని ఎవ్వరూ ఆపలేరు. మొదట్లో ఏ శక్తి తిప్పిందో. ఆ శక్తికి కూడా నిలపడం సాధ్యం కాదు. సృష్టి ఆగదు. పరిభ్రమిస్తూ వుంటుంది. విశ్వంయొక్క వైశాల్యం గాంభీర్యంతో పోలిస్తే మానవుడు అల్పుడు. కాని దాని వైశాల్యం గాంభీర్యం ఎట్టిదో ఎంతటిదో తెలుసుకోగల మహత్తర శక్తి. అద్భుత చైతన్యం, వొక్క మానవుడికే వున్నాయి. విశ్వంముందు మానవుడి అల్పత్వం ఋజువు కావాలంటే, అది మానవుడి ఊహావల్లే జరగాలి.

కాని, ఇది తెలుసుకోడం వేరు, ప్రత్యక్ష పరిశోధనకి పూనుకుని, ఊహని కార్యంలోకి మార్చడం వేరు. ఆ కదలిపొయ్యే సృష్టిని, తిరిగే విశ్వాన్ని వొక్క క్షణం ఆపుతానంటుంది హాషిమాదీ. అంతటిశక్తి యౌవ్వనానికి తగదు. అంతటిశక్తిని ఆమె శరీరం వుంచుకోలేదు. దైవానికి సాధ్యం కాని కార్యం ఆమెకి ఎందుకు సాధ్యం కాకూడదో ఆమెకి తెలీదు పాపం. ఈ రకం పరిశోధనకా ఆమె నిక్కడికి పంపించటం! తగదని తీసుకుపోయింది సృష్టి.

మళ్ళా మనుషుల అలజడి, దుమ్ము, ధ్వని, దీపాలు, గుడ్డవిప్పుకుని నగ్నంగా గెంతుతూవున్న గాలి- యీ నా ఆలోచనల్ని భంగం చేశాయి. అదుగో దూరంగా రోడ్డు మొగ, అక్కడో రాలిబండ, దానిమీద వో కుర్రాడు. పరీక్షగా చూశాను. మరెన్న.

"ఏం మరెన్నా, ఇల్లా కూర్చున్నావు వొక్కడవు? అయ్యగారిక్కావల్సినవన్నీ చూశావా ?"

"ఉరికినే, ఏమీ తోచక యిట్లా గొచ్చానండి."

"ఏం ?"

"దీని గురించి తల్చుకుంటే దిగులేస్తుందండి."

"అవును పాపం."

జేబులోంచి ఏదో తీశాడు మరెన్న. కాగితం మడత, అది విప్పాడు.

"తెల్లవార్లు తెగవెదికినారంటండి. బీ జాడ కనబడలేదండి సాయంకాలం వచ్చేముందు, నేనూ ఎదికినానండి— దిగమగ గమదిగ పుట్లంట నడుసుకుంటూ ఎళ్ళి, దాని బట్టల పీలికలు అయ్యి, ఆ పొదంట దొరికినయ్యండి. అడ పడుందండి— యీ తలవెంట్రుక" అని కాగితం మడతలోంచి నల్లటి పొడుగాటి తలవెంట్రుక అరచేతిలో పెట్టి పైకి చూపించాడు.

"ఏ జాతలోదండి."

నేనేమీ మాట్లాడలేదు ఏ[illegible]...

"దాని జాతలోదనెట్లా తెలుసు?"

"మాదంతే, ఒకటేనండి. అన్ని [illegible] జాతులు— దానిదీ అదేనండి. దానికి వొంకలు తిరిగే తంగ [illegible] యిష్టపడుతుంది జడ వొంకర్లు తిరగకుండా పెట్టుకొన్న, [illegible], సరైన పెట్టు..నే దండి...." అన్నాడు.

నడక సాగించాను. వాడూ లేచాడు. "అయ్యా మనకెందుకండి- దేని జోలికీ పోకూడదండి." అని మరెన్న ఆ చంద్రుకళ సగ్గంగా వీస్తున్న గాలిలో విడిచేశాడు. చంద్రుడి పేసి ఎగిరిపోయింది. దానిలో నగ్నశరీరాన్ని మరుగుపరచకుండి గాలి. వెనకటి కథలకి చివర గుణపాఠం తగల్చడం సంప్రదాయం. కథలే వాటిని నిలవనీయడదు అన్న నీతిపాఠంతో యీ కథ ముగించబుద్ధివేస్తుంది. ఇది నే నేర్చుకున్న పాఠం కాదు. అసలు దేని జోలికీ పోకూడదన్నాడు మరెన్న. గీతలో బోధ అది. ఆ ఒక్క వాక్యంతో మరెన్నని- మరొకడినీ, అందరినీ, ప్రపంచంలో ప్రాణులన్నింటినీ, ఒక అణువుగా చేసేసి చేతిలో బిగించి గుండెలకు హత్తుకోవాలనిపించింది ఆ క్షణికమైన అనుభూతినిచ్చి వెళ్ళిన మాష్టిమాది జీవిత రహస్య పరిశోధనలో కృతార్థురాలైందనుకుంటా.

రచనకాలం : 1959 ఏప్రిల్

ప్రచురణ : జయంతి 1959 జూలై

ఆమే ప్రశ్న మళ్ళా అడగడం నాకు ఆశ్చర్యం కలిగించింది. ఇలా
నేను కథలు వ్రాస్తానన్న సంగతి ఆమెకెల్లా తెలుసో నాకర్థంకాలేదు
నా కథలు, ఒకటి రెండు తప్ప అచ్చుకాలేదు; వాటిని గురించి నే నెవ్వరి
తోనూ ముచ్చటించలేదు. ఇరవై సంవత్సరాల యువక అజ్ఞానంలో వున్న
నన్ను ఎన్నుకోదగ్గ రచయితగా యీ సంఘం గుర్తించదని నా ఉద్దేశం.
ముదుసలే జ్ఞాని కాగలడని భారతీయుల పెద్ద నమ్మకం. పెద్దలన్నా,
ప్రాచీనులన్నా, పాతవిషయాలన్నా, మనవాళ్ళకి అంత గౌరవం. ఒక
విషయం మంచిదా చెడ్డదా అన్న తార్కిక సంశయానికి సంఘంలో అంతగా
తావులేదు. ఎటొచ్చీ ఆ విషయాన్ని ప్రతిపాదించిన వ్యక్తి వృద్ధుడై
వుండాలి.

శక్తిగలవాళ్ళు ధనార్జనలోనూ, అదీ లేనివాళ్ళు దైన్యంలోను
లీనమైన యీ దేశంలో కథకుడికి విలువలేదని నే నా రోజుల్లో
నమ్మేవాడిని. నేను వ్రాసి తగలపెట్టిన రచనలతో నాకు మరో దేశంలో
బ్రహ్మరథం పడుదురు. సంఘం గుర్తించదన్న భయ మొకటేకాదు,
నేను కథలు వ్రాయకపోవడానికి కారణం; నా రచనా విధానానికి పరిపక్వం
రాలేదని కూడా నే లోపల అనుకునేవాడిని; నా సృష్టి శక్తుల్ని రగిల్చి
నన్ను తన్మయుణ్ణిచేసి నా జీవితంపై ఆర్తిని కలిగించే వ్యక్తులుకాని, నా
రచనల్ని చదివి, వాటిల్లోని లోతులకి దిగ్భ్రాంతి తాత్కాలికంగానైనా
ధన్యతచెందే వ్యక్తులుకాని ఆనాటివరకూ లేరని నాకు తెలుసు. ప్రపంచాన్ని
పరిశీలిస్తూ వ్యక్తుల మంచి చెడ్డలని, వింత ప్రవర్తనని ప్రేక్షకుడుగా అనుభ
వించి అర్థంచేసుకుని, అల్లా సంపాదించిన అంతరంగిక జ్ఞానాన్ని నా
తాత్వికదృష్టిలో మేళవించి, వార్ధక్యంలో మహత్తర గ్రంథం వ్రాసి
మరణించాలని నా ఆదర్శం. ఈ రెంటిలో ఏదైనా జరిగితీరుతుంది.
మహత్తర గ్రంథం వ్రాయలేకపోవచ్చు; కాని మరణం మాత్రం తప్పదన్న
ధైర్యం నాకో నూతన వుత్సాహాన్ని ప్రసాదించింది. ఆ రోజుల్లో, "నన్ను
గురించి కథ వ్రాయవూ?" అనే ప్రశ్న స్త్రీ నోటినుండి వినడం ఇదే
మొదటిసారి. తన వ్యక్తిత్వాన్ని గుర్తించమని, దాని ప్రభావాన్ని ఇతరులకి

తెలియచెయ్యాలన్న స్త్రీని మొట్టమొదట కుముదంలో చూడగలిగాను. ఆమె వొక జీవి; ప్రత్యేకమైన వ్యక్తిగలది. ఆమెని తొలగిస్తే ప్రపంచంలో కొంత పవిత్రమైన ఖాళీ ఏర్పడుతుంది నే చూసిన స్త్రీలు వివాహం జరిగిన రోజునే జన్మించినవాళ్ళు. భర్తని తొలగిస్తే, స్త్రీ పోతుంది; యింకా పొడిగిస్తే భర్త సంతానంగా మారిపోడు; అతను గతించగానే ఆమె స్థూలజీవితం సమాప్తమౌతుంది. సృష్టిని ఆహ్వానిస్తూ తెరుచుకున్న తలుపులు మన స్త్రీలు. తెరుచుకోని తలుపులు లేవు. ఏదైనా వొక తలుపు తెరుచుకోనివాళ్ళ, దాన్ని గురించి చెప్పుకొని, మరమ్మత్తు సంకల్పించాలి. మరమ్మత్తుచేసినా బాగుపడని తలుపులను నిర్మూలం చెయ్యాలా, లేక వేరే పనులకు వుపయోగించుకోవాలా అన్న సందేహాన్ని సంస్కర్తలు తీర్చాలి. కథకుడు, ఏం చెడిపోయిందో చెప్పగలడు; వీలైతే మిగిలినదానితోనే తృప్తిపడుతూ యితరులతో ఆ తృప్తిని పంచుకోగలడు; కాని బాగుచేసే విధానాలతో అతనికి నిమిత్తంలేదు.

"నీలో ఏముందని నిన్ను గురించి కథ వ్రాయనూ?" అన్నాను. అట్లా అన్నందుకు పశ్చాత్తాపపడనా, ఆ ప్రశ్న నా నమ్మకాన్ని, ఆశయాలనీ యథార్థంగా వ్యక్తపరుస్తుంది. ఆమెలో కథావస్తువుగా వుండేటంతటి విశేషం వొక్కటి కూడా లేదు. చూడడానికి చాలా సామాన్యంగా వుంటుంది; పల్చటి శరీరం; వేసంగిలో వర్షం కురిసేముందు దట్టంగా అల్లుకున్న మబ్బురంగు శరీరచ్ఛాయ; సంపూర్ణంగా వికసించని అవయవాలు; ఎవరో దువ్వినట్లుగా వుండే జగకట్టు; చూసిన వస్తువులు తన కోసం రానట్టు చాంచల్యంగా కదిలే గుణహీనమైన కనురెప్పలకింద మంచులో కదిలిపోయిన కుందేలులా మెరిసే నేత్రాలు; కంఠంలో కొలవడానికి వీలుగావుండే వృత్తాకారాలు; నీడ కనిపించినట్లు స్ఫురించే వక్షం; శరీరంలో సౌభాగ్యాన్ని మోసేటందుకు వోపికలేనట్టి అల్పమైన నడుం. కుముదం సాధారణమైన స్త్రీ. ఎవరూ-తుదకు వాళ్ళమ్మకూడ-ఆమె

అందమైందని చెప్పుకోడం నే నెరగను. అంటే, నేనే ఆమెలో నేనేమీ విశేషం చూడలేక పోయ్యానేమో!

"నాలో ఏముందాలి?"

"ఒక ప్రత్యేకత, అందరిలోనూ లేని ఏ చూపక్కా విశేషం లేకపోనా సరే—"

వేలునున్న ఉంగరాన్ని చూచి దాన్ని వేళ్ళతో తిప్పింది. పోతపోసి పదునుపెట్టినట్లుగా చలించే వేళ్ళు ఆమెవి. ఏ అవయవం కదిలినా, శరీరం లోని శక్తంతా దానిలో పూరించినట్లుగా వుంటుంది. ఒక వస్తువు వేసి చూస్తూన్నప్పుడు, పంచప్రాణాలు కళ్ళల్లోకి పరిగెత్తుకొచ్చినంత తీవ్రంగా చూస్తుంది. సిగ్గుపడితే రక్తం చెక్కిళ్ళలోనుంచి పొంగి చూస్తున్నట్లుం టుంది. కాని కుముదాన్ని వర్ణించినంతమాత్రాన కథౌతుందా?

"నీ పెండ్లికి నన్ను పిలవలేదేం?" అని అడిగాను.

"మా అమ్మ నీకూ శుభలేఖ పంపానంది- వొస్తే నలుగుర్నీ చూచి, ఏమన్నావుంటే కథేనా వ్రాద్దువుగా" అంది కుముదం. కళ్ళల్లోంచి పెదవుల మీదికి దిగజారిన నవ్వుని ప్రదర్శిస్తూ.

"నేను తమాషాకి అనడంలేదు. సాధారణ వ్యక్తులను గురించి వ్రాసేటందుకు ఏముంది? పదిమందీ ఒకేలాగున్నప్పుడు వారిలో ఏ ఒక్కర్నీ గురించి చెప్పుకోం. కాని, అందులో ఏ ఒక్కడైనా, పదిమందీ చేసినదానికి వ్యతిరేకంగా చేస్తే అతన్ని గురించి చెప్పుకుంటారు. అట్లాంటి వ్యక్తులని గురించి వ్రాయొచ్చు" అన్నాను.

"అయితే అందరూ చేసినదానికి విరుద్ధంగా చేసేవాళ్ళే మనుష్యు లన్నమాట...."

"నే అల్లా అనను, అట్లాంటి వాళ్ళు చెప్పుకోదగ్గ మనుషు లంటాను."

ఎక్కడో ఎప్పుడో పుట్టడం, ఎవరో ఎవర్నో వొప్పగిస్తే వార్ని పెండ్లాడడం. ఎందుకో తెలీకుండా పిల్లల్ని కనడం. ఎప్పుడో ఎక్కడో చచ్చిపోవడం ఇవే చాలామంది చేస్తున్నవి. వీట్ని గురించి కథగా చెప్ప

కునేందుకు ఏముంది? ప్రత్యేకత, వ్యక్తిత్వం లేని యీ జీవితాలు ప్రశాంతాన్ని పొందుతున్నాయి; కాని, అది బురదగుంటలో పురుగు పొందే ప్రశాంతం. సంఘాన్ని ధిక్కరించి, సాంప్రదాయాలపై విప్లవం చేసి, యితరులకి అవగాహన కాని కొత్త విలువని సాధించి పొందినవాడే ధన్యజీవి. వ్యర్థజీవులు సంఘం అల్లిన వలలో చిక్కుకొని, మర్యాద పేరు చెప్పుకుని కుళ్ళిపోతారు. స్థాపితమైన ఆదర్శాలపై విప్లవం చేసినవాడు సంఘాన్ని తనవైపుకి మరల్చ యత్నిస్తాడు కాబట్టి సంఘాభివృద్ధి అల్లాంటి వాళ్ళపై ఆధారపడుతుంది. కుముదంలో ఈ విప్లవచిహ్నం వొక్కటీ కూడా లేదు.

ఆమె చదువుకోలేదు; సంగీతం నేర్చుకోలేదు. కనీసం కూనిరాగాలు తీస్తుందని చెప్పుకోడమైనా నే నెరగను జ్ఞానం వొచ్చిం తర్వాత ప్రేమించి-చేసుకున్న పెండ్లి కాదు; గొప్ప స్థితిపరులాలుకాదు; పోనీ బాగా పేదదీకాదు, సానుభూతి చూపేటందుకేనా; చక్కందికాదు, పద్యాలు వ్రాద్దామంటే; అనాకారీకాదు, వికృతాన్ని ఆధునికుల ధోరణిలో చిత్రిద్దామంటే; మంచి వాళ్ళని గురించి వ్రాయొచ్చు; చెడ్డవాళ్ళని గురించి వ్రాయొచ్చు; కాని సాధారణమైనవాళ్ళని గురించి వ్రాయడం ఎంతో కష్టం. అసలు వ్రాసే టందుకు ఏముంది ?

కొందరు వ్యక్తులు తల్లిదండ్రుల చర్యలవల్ల ఖ్యాతి కెక్కుతారు. కుముదం ఆ తెగకి చెందదు. వాళ్ళ తండ్రి చనిపోయ్యాడు. తల్లి ఏ పూళ్ళోనో కొడుకు దగ్గర వుంది. వాళ్ళ కుటుంబానికి చరిత్ర లేదు.

"మీ ఆయన ఏం చేస్తున్నాడు ?"

"ఎల్. టి. చదువుతున్నాడు."

"స్కూల్ మాస్టరవుతాడన్నమాట- ఏ పనీ దొరకనివారికి అదే శరణు మంచివాడేనా ?"

నవ్వింది. "మంచి అంటే ఏమిటో నాకేం తెలుసు? నీకు తెలియాలి, కథలు రాసేవాడవు."

"ఓస్ ! చెప్పడం కాదోలు. అది కాదు కుముదం. అందర్లాగే కాపరాని కెళ్ళి పిల్లల్నికంటే ఏం ప్రయోజనం? ఏదో ఒ గొప్పకార్యం సాధించాలి; సంఘాన్ని ముందుకు నెట్టాలి. ఇక్కడికే భారతమాత ఈ సంతానాన్ని పోషించలేకపోతోంది."

"నా కింకా పిల్లలులేరు. అయితే ప్రతి ఆడదీ పెండ్లి చేసుకోకుండా, పెళ్ళిపందిళ్ళలో పికెటింగ్ చెయ్యాలంటావా ?"

"పెళ్ళి వొద్దని నే ననడంలేదు. వివాహం స్త్రీ జీవితంలో ప్రధాన ఘట్టం అందులో నువ్వు సాధించింది ఏముంది? ప్రేమా ? సౌఖ్యమా ? ఆధ్యాత్మికమా ? దేశభక్తా? ఏదీలేదు."

"పెండ్లి చేసుకున్న ప్రతి స్త్రీ భర్తను వొదలేస్తే నువ్వు కథలు వ్రాస్తానంటావ్. అంతేనా ?"

అంత పచ్చిగా అడిగినందుకు నాకు రోషం వొచ్చింది.

"వొదిలేస్తే చాలదు- మరో గొప్ప విలువని సాధించాలి."

"అంటే ?"

"ప్రేమలేని వివాహానికి విలువలేదనుకుంటాను."

"నీకేం తెలుస్తుంది ? నీకు పెళ్ళికాలేదు."

"ఆ విలువని సాధించగల్గితేనే వివాహానికి అర్థం వుంటుంది."

"అట్లాగైతే, ప్రతి స్త్రీ భర్తను వొదిలేసి మరోడితో వుండాలందూ, ప్రేమను సాధించేందుకు ?"

అట్లా అడిగినందుకు నాకు నవ్వొచ్చింది. "దానికోసం ఆ త్యాగం చెయ్యగలిగితేనే మెచ్చుకుంటాను" అన్నాను.

కుముదం మాట్లాడలేదు. ఈ భావాలు ఎంతవరకు ఆమెని కలవర పెట్టాయో నాకు తెలీదు. స్త్రీ ప్రకృతిపైన వొత్తిడి కలిగించేది భావాలో సహజమైన ఉద్రేకమో నేను చెప్పలేను. అది తెలిస్తే స్త్రీ హృదయం అర్థంచేసుకున్నట్లే.

"కాని....కాని...." మాటలకోసం తడుముకుంటూ నిదానించింది,

"ఏమిటి నీ సందేహం ?"

"ఏమీలేదు. నాకేదో చెప్పాలనుంది. ఎట్లా చెప్పాలో తెలీడంలేదు. నే చదువుకున్నదాన్ని కాను. ఉండు, ఆలోచించనీ...."

నేను ఆమె కళ్ళకేసి చూస్తూ కూర్చున్నాను. నిదానించి చూస్తే ఆమె మొహంలో వొకవింత ఆకర్షణ వుంది. ఆమె శరీరంలో వొంపులు, ఎత్తు పల్లాలు సూర్యరశ్మి సోకినప్పుడు తీర్చినట్లుగా విప్పారుకున్నాయి. ఆ కళ్లు ఆమెకి ప్రయోజనంలేవు కాబోలు; మనుషులకి ఆత్మ వుందో లేదో నాకు తెలీదు కాని, ఆమెకి మాత్రం లేనట్లు నా కనిపించింది. మరో లోకంలో ఆత్మని మరచిపోయి, శరీరాన్ని తనిష్టం లేకుండానే ఇక్కడికి రప్పించినట్లు సంచరిస్తుంది. ఈ ప్రపంచంలో మూసుకుని మరో లోకంలో తెరచుకున్న నేత్రాలు ఆమెవి. "కాని....కాని.... సూర్యుడు, చంద్రుడూ- ఎప్పుడూ చూస్తుంటాను, కాని ప్రతిసారి ఎందుకో క్రొత్తగా కనబడతాయి. మంచినీళ్ళు రోజూ త్రాగుతా. కాని ప్రతిసారి ఎంతో క్రొత్తగా వుంటాయి.... నక్షత్రాలు...."

నేను వెడతానని లేచాను.

"నక్షత్రాలా....శ....మంచిది...." ఆమెని గురించి ఏం కథ వ్రాయనూ ?

క్రితంసారి మేం కలుసుకుని నాలుగేండ్లయింది. ఈసారి కుముదం గారి వూరు అద్దెకోసమే వెళ్ళలేదు. వేరే పనుండి వెళ్ళాను, మధ్యాహ్నం రెండుగంటలు దాటింది. నడివేసంగి ఎండ నన్ను నీడకి తరిమింది. పోస్టాఫీసుప్రక్కనున్న మామయ్యగారింటికి ఎప్పుడూ దొడ్డిదోవన వెళ్లడం అలవాటు చొప్పున ఆ నాడు కూడా అల్లాగే వెళ్ళాను.

కుముదం ముందువాకిట్లో గచ్చుమీద కూర్చుని అనాసపండు తరిగి వెండిపళ్ళెంలో వేస్తోంది. నారింజఎండురంగు చీర కట్టుకుంది; నన్ను చూచి లేవడంలో తడబడింది. నాకర్థమైనట్లు నవ్వి వెనక్కి తిరిగి

లోపలికెళ్ళి పాత కుర్చీ అమర్చి కూచోమని సంజ్ఞ చేసింది. నే చూసిన దృశ్యం నా కిదివరకు లేని కొత్త చనువునిచ్చిందని వొప్పుకోకతప్పదు. మనిషి శీలానికి వ్యక్తిత్వానికి మొహం వొక్కటే నిదర్శనం కాదను కుంటాను. కొన్ని ఆకస్మిక దృశ్యాలు జీవితకాలం గమనించినా బోధపడని అంతరంగాలని తేటపరుస్తాయి కాబోలు.

కుర్చీలో కూర్చోగానే పటుక్కుమంది పాతకుర్చీ. లేచి సర్దుకున్నాను. కుసుమం పకపకని పళ్ళమధ్య బిగించి నవ్వుని ఆపు కుంటోంది.

"అన్ని కుర్చీలమీదిది నిన్ను భరించి పూరుకోక, విరిగి, కొత్త దారితీసింది చూశావా! దాని కథ వ్రాయవూ?...." అంది. నాకూ నవ్వొచ్చింది. చాపమీద కూర్చుని స్తంభానికి జారబడ్డాను.

"మనం కలుసుకుని దగ్గరదగ్గర నాలుగేళ్ళయింది. తెలుసా? నే నివన్నీ మరిచిపోయ్యాను. నీకింకా ఎట్లా జ్ఞాపకం వుందీ?" అన్నా ప్రశ్నార్థకంగా.

"ఏమో, నువ్వు జీవితాన్ని పరిశీలిస్తావు. నేను అనుభవిస్తాను ఏమో" అన్నది.

ఆమెకి జీవితం అనుభవించడం అంటే ఏమిటో తెలీదని నా నమ్మకం. కాలం ఆమెపై ఎట్లాంటి మార్పూ తేలేకపోయింది. ఇదివరకు చూసినప్పటికంటె ఈసారి ఎక్కువ ఛలాకీ, యవ్వనోద్రేకం చూప గలిగింది. ఆమెలో ఆకర్షణీయమైంది. ఎడతెగని యవ్వనమేమోనని పిస్తుంది. యవ్వనం ఒక్కసారి తనశక్తిని ప్రకటించకుండా, నిలిపి నిలిపి ప్రజ్వలించినట్లుగా గోచరిస్తుంది. * కొన్ని ఉపమానాలు మన నాగరిక సాంప్రదాయాలకి విరుద్ధమని జంకుతున్నాగాని, లేకపోతే ఆమె శరీరాన్ని గుఱ్ఱంపిల్ల కదలికలోని లావణ్యంతో పోల్చొచ్చు. లేడి గంతులో

---

* గుఱ్ఱంపిల్ల ఉపమానం సంప్రదాయానికి విరుద్ధం కాదు. వాల్మీకి

సాధారణంగా అందరికి జరిగేదేగా! నీకీ విషయం వింతగా తోచిందా?"
అంది. ఆమె అంత పరాయిగా తన పిల్లల గురించి చెప్పుకుపోవడం చూస్తే నాకు మరీ ఆశ్చర్యం కలిగింది.

"దానికో పాపాయి పుడుతుంది. ఎప్పుడో, ఎక్కడో అది ఎవర్నో ఎక్కడో పెండ్లి చేసుకుంటే దానికి మరో పాపాయి, ఎప్పుడో, ఎక్కడో పుడుతుంది. అలా జరిగిపోతుంది. ఇందులో ఆశ్చర్యపడవల్సిన విశేషం ఏముంది....?"

కుటుంబంలో మాతృత్వం తాలూకు చిహ్నాలేవీ నాకు కనబడలేదు. పిల్లలని చూసుకుని తల్లిపడే గర్వం ఆమెలో లేదు. ఆ ప్రశంస ఎత్తాలని ఆమెకు తట్టనేలేదు. ఆమె శరీరపటుత్వాన్ని చూస్తే, ఆమె ఈ పిల్లలని కన్నదా అనిపించింది. పిల్లలూ భర్తా, సంసారం- యివేవీ ఆమె నిజ శరీరాన్ని తాకి పంచుకున్నట్లు లేదు.

"నీ పోలికా, వాళ్ళ నాన్న పోలికా?"

"ఏమో నీకే తెలియాలి."

"నాకెట్లా తెలుస్తుంది? నేను వాళ్ళ నాన్నని చూడనే లేదుగా."

"వీధిలో వున్నారు చూడలేదమా?" వీధిలో అరుగుమీద విద్యార్థులతో ఆయన పడుతున్న అవస్థ నాకు వినపడుతునే వుంది. వెళ్ళేటప్పుడు చూడొచ్చు ననుకున్నాను. కుముదం పిల్లని బడికి తీసుకెళ్ళిపోయింది. ఆకులో అనాస ముక్కలుంచి, మంచినీళ్ళు పెట్టింది.

"పాపం, ఎండలో వొచ్చావు. నీ మొహం వాడిపోయింది."

"నిజంగా?"

"మనం పెద్దవాళ్ళమైపోతున్నాం కదూ!"

"నా మాట తెలీదుగాని, నువ్వు మాత్రం యింకా చిన్నదానివవుతున్నావు" అన్నాను.

"అది అబద్ధం. ప్రకృతి విరుద్ధం" కొంతసేపు ఎవ్వరం మాట్లాడలేదు. ఎందుకో కొన్ని కొన్ని సమయాలలో ఆమెతో మాట్లాడుతున్న

ప్పుడు, ఇంద్ర షాపు ఐపోతుంది. సిగరెట్టు పీలుస్తూ, పీట్లాడుకుంటున్న సమయంలో ఆహాలం గదిలోకి ఎవరైనా వొచ్చినప్పుడు, ఇంద్ర ఎట్లా పని చెయ్యదో, అట్లాగే ఆమెతో సంభాషణ.

"దేశంలో సంతానం ఎక్కువైపోతున్నారు. ఇట్లా పది సంవత్సరాలు జరిగిందంటే తినేందుకు తిండి వుండదంటున్నారు సాంఖ్య శాస్త్ర వేత్తలు, తెలుసా ?" అన్నాను.

"అది నాకు తెలుసు. మనం ప్రకృతికి దాస్యం చెయ్యడం తప్పదు. దాస్యం నేను సహించలేను. కాని అది తప్పదనుకుంటాను నేను ఎదురు తిరగలేక కాదు: నా కిష్టంలేదు. జీవితానికి తలవొగ్గి, ప్రపంచాన్ని అంగీకరిస్తాను."

"అదే పొరబాటు అంగీకారం అవసరాలు లేని, వ్యర్థజీవి విముఖత్వం."

"కావొచ్చు. సృష్టిలో నేనెంతో అల్పురాలనని తోటివాడవైన నీకే తోచినప్పుడు సృష్టిముందు నేనేం తిరుగుబాటు చెయ్యగలను చెప్పు ?"

వెడతానని లేచాను.

"అద్ది తీసుకురానా ?" అంది. "నేను దానికోసం రాలేదు. మని యార్డరు చెయ్యొచ్చు."

పాపిష్టి డబ్బుని ఆమె చేతుల్లో పెట్టటం నా కిష్టంలేదు. ఆమె భర్తని చూడడం కూడా మరచి, బైటికి నడిచాను. నన్ను కుముదం వెనక్కి పిలుస్తుందనుకున్నా, అట్లా పిలవలేదు. నా వెనకాల దొడ్డితలుపు గడియవేసిన చప్పుడు వినిపించింది.

కుముదాన్ని గురించి ఏం కథ వ్రాయనూ ?

* * * *

ఆరు సంవత్సరాలు గడిచాయి. రెండో ప్రపంచ సంగ్రామం ప్రారంభమైంది. అప్పటికి నా చదువు, ఉద్యోగయత్నాలు పూర్తయ్యాయి- నొక్క యత్నమూ ఫలించలేదు. మా మామయ్య నా కోసం పెట్టిన

డబ్బు ఖర్చంతా వృథా అయింది. పైగా, ఆయనా, మా అత్తయ్యా, ఇండియా అంతా యాత్రచేసి రావడంవల్ల ప్రావిడెంట్ ఫండంతా తరిగిపోయింది. నిరుద్యోగసమస్యను గురించి బోలెడు కథలు వ్రాశాను సమస్య పరిష్కారం కాలేదు; ఆంగ్లంలో యీ సమస్యను పరిష్కరించడానికి కొన్ని సలహాలిస్తూ వ్యాసాలు వ్రాశాను; ఎవరూ వాటిని గుర్తించినట్లులేదు కొన్ని సమయాలలో రాజకీయోద్యమంలో దిగి జైలు కెడదా మనిపించేది. అప్పుడు భుక్తికి లోటుండదు. కీర్తి దక్కుతుంది- పైగా జైలులో నే తలపెట్టిన మహత్తర గ్రంథాన్ని రచించడానికి మంచి అవకాశా లుంటాయి. కాని రాజకీయాలలో దిగడం ఎట్లా? 'ఫరవాలేదురా అబ్బీ, యుద్ధం వచ్చింది. దేవుడి ధర్మమా అంటూ నీ కేదో వుద్యోగం దొరక్కపోదు' అని మామయ్య ఓదార్చే వాడు. *

"నాకు నచ్చిన ఉద్యోగం ఒకటి ఖాళీ వచ్చింది మామయ్యా. దరఖాస్తుకి, ఇంటర్వ్యూకి వో ఏభై రూకలుంటే నాకు లభించొచ్చు." వెంటనే మామయ్యకి వో భావం తట్టింది.

"ఒరే! కుముదంగారింటికెళ్ళి, రెండునెల్ల అద్దె, ముందుగా ఇస్తారేమో కనుక్కురా" అని నన్ను సాగనంపాడు.

సూర్యుడు పడమటింట్లో గృహప్రవేశం అవగానే తలుపుచేసి, కిటికీ కర్టెన్లు దగ్గరగా లాగడానికి సిద్ధపడినట్లు, మేఘాలు చురుగ్గా విహరిస్తున్నాయి. కుముదంగారి దొడ్లో ఎన్నో యిదివరకు చూడని కొత్త మొక్కలూ, చెట్లు వున్నాయి. కొబ్బరిచెట్లు మేఘాలతో ఏకీభవిస్తున్నట్లు ఆకాశంలోకి పొడుచుకుని ఆడిపోతున్నాయి. బాదంచెట్టు వార్ధక్యం వచ్చిన దాని మల్లే ముడుచుకుంది. ఆ అల్ప ప్రకృతిలో పక్కాటీ సరాక గుర్తించినట్లులేదు? చెట్ల కొమ్మలకి ఉయ్యాల అమర్చబడి వుంది. నూతి పక్కం వేపునుంచి వో పాపాయి పాకుతూ వస్తున్నాడు. వాడితో ఏదో మాట్లాడాను; వాడికేమీ అర్థంకాక, జీవిత రహస్యం తెలుసుకోలేకపోయిన వేదాంతిలా,

* రెండో ప్రపంచ సంగ్రామం ముగియగానే వ్రాసిన కథ యిది.

నిరర్థకంగా ఏడ్పు మొదలుపెట్టాను. చెట్ల గుబురుమధ్య కుముదం మేఘాల మధ్య నక్షత్రంలా కదిలింది. నక్షత్రబృందంలోంచి విడిపోయిన పిల్ల కాంతిలా మరో చిన్నపిల్ల పరుగులెత్తింది. కుముదం చేతిలో గునపాన్ని గిరవాటెట్టి పమిటని పళ్ళమధ్య బిగించి పైకి రాగి, చేతులోవున్న మొక్కని నాముందు పడేసింది.

"చూశావా, యీ ఆకుని ఎట్లా తినేస్తోందో యీ చిత్రమైన పురుగు? ఈ పురుగు అందమైనదే, మొక్కా అందమైనదే. అందాన్ని చూచి అందం నోర్చలేదుకదూ ?

నే నేమీ మాట్లాడలేదు.

"నువ్వొచ్చి ఎంతసేపయింది ? పిలవలేక పొయ్యావా ? లేక నా పేరే మరచిపొయ్యావా ?" అంది.

"లేదు లేదు— యీ తోటని చూస్తూ ఆశ్చర్యపడుతున్నాను."

"ఇందులో ఆశ్చర్యం ఏముంది ? విత్తనంవేసి, నీళ్ళు పోస్తే మొక్క మొలుస్తోంది. ఇవన్నీ సాధారణమైన మొక్కలు," కొంటెగా నవ్వింది.

"మా పాపని చూశావా, పెద్దదైంది. నువ్వింక సంబంధాలు చూచి పెట్టే సమయం వస్తోంది. వాడు మా రెండోవాడు. ప్రకృతంటే పడదు. అన్నింటినీ ధ్వంసం చేస్తాడు. వీడు మా మూడోవాడు- వీడికి నాలా ప్రపంచంతో నిమిత్తంలేదు. -పాపా ! బకెట్ తీసుకురా...."

అమ్మాయి బకెట్ తీసుకొచ్చింది. కుముదం చిన్నప్పుడు జామ పండు తింటున్న దృశ్యం జ్ఞాపకం వచ్చింది.

"కొంచెం నీళ్ళు తోడిపెట్టు, చేతులు కడుక్కుంటా" అంది.

నేను తోడాను, బకెట్‌లో సగం నీళ్ళు నూతులోనే పడిపోయాయి.

"నీళ్ళు తోడడం తెలియకపోతే ఎట్లా ? నీ భార్య జైటుంటే నువ్వే తోడుకోవాలి."

"నాకింకా పెండ్లి కాలేదు."

నమ్మలేనట్లు చూసి, మౌనంలో పడింది.

"నాకు ఉద్యోగంలేదు. ఎందుకు పెండ్లి ?" అని స్వగతంలా చెప్పుకున్నాను.

కుముదం నామాట వినిపించుకోలేదు. చీరని పాదాల పైకితీసింది. ఆమె శరీరానికి మాతృత్వం పరిపూర్ణత నిచ్చింది. వయసు మొహానికి వైరాగ్యాన్నిచ్చినా, వార్ధక్యాన్నివ్వలేకపోయింది. మట్టిలో నీళ్ళు కలిపిన వింత సువాసన నన్నావరించింది. మొహాన్ని పమిటతో తుడుచుకుంది. తడిసిన పమిట పర్వతశిఖరానికి ఎగబ్రాకేవానికి పట్టుదొరికినట్లు, వక్షాన్ని అదిమిపట్టుకుంది. సూర్యుడి కడసారి కిరణం, లోయలో నీడని ఒక్కసారి వెలిగించి మాయమైంది. సంధ్య అందాన్ని అనుభవించాలన్న వాడు కుముదంతో వుండాలి. సంధ్యలో నే నెప్పుడూ చూడని ప్రత్యేక శోభని ఆనాడు చూడగలిగాను.

"దా, ఉయ్యాలమీద కూర్చో-వెనక విరిగిన కుర్చీ యింతవరకూ బాగుచేయించనేలేదు....ఏదో వొకటి వొస్తూనే వుంటుంది. తీరికలేదు."

కుముదం గడ్డిలో కూర్చుంది. అమ్మాయి, వేదాంతిని ఎత్తుకొని లోపలి కెళ్ళింది. రెండోవాడు, ధ్వంసంచేసేందుకు మొక్కలు లేవన్నట్లు, గడ్డినే దిమ్మిశాలా మర్దిస్తున్నాడు.

"మనం కలుసుకుని చాలారోజులైంది తెలుసా ?

"ఆహా, దగ్గరగా ఆరుసంవత్సరాలైంది."

"నువ్వు చాలా మారిపోయావు"

మంచికా చెడుకా అని అడుగుదా మనుకున్నాను. నన్ను మాట్లాడ నీకుండానే- "ఎక్క డెక్కడి కెళ్ళావ్, ఏం చేస్తున్నదీ- అంతా చెప్పు నిన్ను గురించి" అంది.

"ఉత్తర హిందూస్థానం వెళ్ళా-ఎక్కడా మంచి ఉద్యోగం దొరకలేదు. మామూలుగా ఇండియాలో మనిషి ఇరవై ఎనిమిదేండ్లకంటే ఎక్కువకాలం జీవించడంటారు సాంఖ్య శాస్త్రకారులు. దాని ప్రకారం నేను

నాలుగేండ్ల క్రితమే చనిపోయి వుండాల్సింది. అల్పాయువుగలవాళ్ళు సుఖంగా వుండగలరు మన సంఘంలో."

కుముదం సానుభూతిచూపి, జాలిపడుతుందని నా ఉద్దేశాన్ని ఎంతో కసిగా భయంకరంగా ప్రకటించానేమో !

"ఉద్యోగం లేకపోతేనేం ? దానికోసం జీవితాన్ని తిట్టాలా ! ఉద్యోగంలో ప్రవేశించాకే, ఆ పేరోకం, మరి ప్రపంచంతో సంబంధం వుండదు. ఎవరికో బానిసనై స్వేచ్ఛ పోగొట్టుకుంటావు. ఆడవాళ్ళకి వుద్యోగంచేసే బాధలేకపోవడం ఎంతో మెరుగు"

ఉద్యోగం చెయ్యనందుకు నన్ను అందర్లా ఆక్షేపిస్తూ తిట్టకుండా, మెచ్చుకున్నందుకు నేను కుముదాన్ని కొంత గౌరవించాను.

"పాశ్చాత్యదేశాలలో స్త్రీలు, పొట్టకూటికోసం భర్తలకు మన వాళ్ళల్లా అమ్ముడుపోరు" అన్నాను. అప్రయత్నంగా రెండు గడ్డిపువ్వులను తెంచి జుట్టులో అమర్చుకుంది.

"మనకీ ప్రపంచంలో ఎవరో ఒకరికి దాస్యం చెయ్యడం తప్పదేమో ననిపిస్తుంది. దేవుడు సైతం భక్తుడికి దాసుడు కావడంలేదు."

"నా కింతవరకూ ఉద్యోగం యివ్వని యీ సంఘాన్ని గౌరవించి, ఎందుకు సేవ చెయ్యాలో నాకు తెలీడంలేదు."

"నీకు ఉద్యోగం లేకుండావుంటేనే నువ్వు సుఖపడతావు. ఐనా నీ పిచ్చికాకపోతే, నీకు ఉద్యోగం ఎవరో యిచ్చేదేమిటి ? నువ్వేదో గొప్ప కార్యం చేయ్యడానికి పుట్టావని వెనక చెప్పావు అది నేను నమ్ముతాను. అది చెయ్యి. స్వతంత్రించి, నచ్చినపని చెయ్యడమే మంచిది. నేను దాస్యం సహించలేను."

"దాస్యంలేకుండా, ప్రేమని సాధించటం ఎట్లా ?" ఈ ప్రశ్న ఎందుకడిగానో నాకు తెలీదు,

"ఔను, మనుష్యులలో చేసే ప్రేమలో దాస్యంవుంది. సంసారంలో బంధనాలు, ప్రేమలో బంధనాలు; అసలు పుట్టడమే సృష్టికి దాస్యం దూరంగా వుంటే మంచిది."

కుముదం, హృదయానికి దగ్గరగావుండే విషయాలని గురించి ముచ్చటిస్తుంటే వినడం అదే మొదటిసారి. నేను అనుకున్నంతటి అమాయకురాలు కాదని స్పష్టమైంది.

"ప్రపంచంతో నిమిత్తం లేకపోతే, అసలు గొప్పకార్యం సాధించటం దేనికి ?"

"సాధించటంతో మనుషులకు చేసే దాస్యం నుండి విముక్తి దొరుకుతుంది. కాబట్టి, ప్రపంచాన్ని మనం ఏదేనా కోరి, ఆశిస్తే దాన్ని యివ్వదు. మనం దేన్నీ ఆశించకుండా, దూరంగా వుండి చెయ్యగలిగినపని చేస్తుంటే ప్రపంచం మన పాదాలముందు వాల్తుంది."

కుముదం, స్వతంత్రాన్ని అంత కాంక్షిస్తుందని నే నెప్పుడూ అనుకోలేదు. భర్త, పిల్లలు, సంసారం, ఉద్యోగం-తుదకి ప్రేమ-యివన్నీ కూడా దాస్యమే నంటుంది. స్వతంత్రం లేని బ్రదుకు వృథాట. ఒక విలువని అంతగా కోరినప్పుడు, దాన్ని వారు పొందలేకపోతే, నా హృదయం బాధతో క్రుంగిపోతుంది. జనసామాన్యానికి స్వేచ్ఛనిస్తే దుర్వినియోగం చేస్తారు. దాని విలువ తెలియనివాళ్ళకి అదివ్వడం మహా పాపం కాని, దేన్నీ వుపయోగించుకోకుండా, కేవలం విలువల ఆరాధనతో తృప్తిపడే కుముదంలాంటి వ్యక్తులకి స్వేచ్ఛ లేకపోవడం ప్రపంచానికి అనర్థం.

"నేను నువ్వైతే ఏం చేద్దునో తెలుసా ? నదీ తీరాన్ని చిన్న తాటాకుపాక కట్టుకుంటాను. అందులో కూర్చుని, కోరితే చదువు నేర్పుతానని చాటింపు వేయిస్తాను. మొదట ఏ పదిమందికి పొలం కాపులో వస్తారు. సాయంత్రం, వాళ్ళకి బోధించడం మొదలెడతాను. ఇరుగు పొరుగునుంచి అనేకమంది కర్షకులు, కూలివాండ్లూ చదువుకోసం వస్తారు. ఉత్త చేతుల్తో రాకుండా, ఒకరు వుప్పు, చింతపండు, ఒకరు పాలు-ఆల్లా నాక్కావల్సినవాటిని వాళ్ళే సిద్ధంచేస్తారు. వారు నా శిష్య బృందం. వాళ్ళ కష్టసుఖాలు పంచుకుంటా; వారి తగాదాలకి తీర్పు చెపుతా. అంతే; అప్పుడు నా జీవితం వృథా అనుకోను."

సూర్యుడు అస్తమించగా అలిసిన తన పరివారం పడమటిలోయలో సేదతీర్చుకుంటున్నట్లు వెలుగు ఛాయలు కదుగుతున్నాయి. ఓపికలేక కదలలేకపోయిన మేఘద్వయం. దక్షిణ గాలి పిలుపుకి కదలిపోతున్నాయి. ఇది నా రాజ్యం అన్నట్లు వొంటినక్షత్రం కన్నుమీటింది. ప్రకృతిలో నిశీథకీటకాలు తన్మయరాగదసాగించాయి. మా సంభాషణ విని విని విసుగెట్టిన పుష్పాలు చీకటి ప్రశాంతంలో ముడుచుకున్నాయి. తూర్పు ఆకాశం జడవిప్పుకుంది. కుముదం తలలో తెల్లవెంద్రుక మెరిసింది.

"తెల్లవెంద్రుక" అన్నా, వున్నచోట వేలు మెదుపుతూ.

"ఎన్నాళ్ళని యవ్వనానికి శరీరం దాస్యం చేస్తుంది ? దానిదోవ అది చూచుకుంటుంది."

నా కళ్ళు చెప్పలేని విచారంతో తడిసినై. నేను అద్దె మాట అడగడం మరిచిపొయ్యాను. ఆ తన్మయతతో బరువెక్కిన వాతావరణాన్ని డబ్బు ప్రశంసతో పాడుచెయ్యడం నాకిష్టంలేకపోయింది.

పెడతానని లేవా; మంచిదంది; పోనీ, యీ రాత్రి యిక్కడుండి వెళ్ళకూడదా అంటుందనుకున్నా. కుముదానికి మర్యాదంటే ఏమిటో తెలీదు.

మరి నాలుగు సంవత్సరాలు గడిచినై; యుద్ధం సాగుతోంది. నాకు మాత్రం ఉద్యోగం చిక్కలేదు. నేను దాన్ని గురించి విచారించే రోజులు వెళ్ళిపోయాయి.

రోజులు గడిచిపోతున్నాయి. నా తిండికి ఎట్లాంటి లోపమూ రాలేదు. వస్తున్న రోజు ఒకటిపూటా లేదు. దూబరా ఖర్చుకి నాకే అలవాట్లు లేవు. సిగరెట్లు కాల్చను; సినిమాలకెళ్ళను; పుస్తకాలు కొనుక్కోను. అవంటే యిష్టంలేకకాదు. అవి నా అందుబాటులో లేవు. మా మామయ్య చనిపోయి ఆరునెలలైంది. మా అత్తతప్ప నాకు 'నా' అన్నవాళ్లు ఎవ్వరూ లేరు. ఇది కొంత మేలే. నామీద అధికారం చలాయించేటందుకు ఒక్కరూ లేరు. ఒకే సంఘం తిండిపెట్టనక్కరలేదు. నా బ్రమకు నన్ను బ్రతకనిస్తే

నిశీథిలోకి కదిలి వెళ్తాను. నాకు స్త్రీ అనుభవం సంభవించి నప్పుడు, తార్కిక జ్ఞానం, విమర్శనాబుద్ధి పనిచెయ్యవు. ఇంద్రియాలు శరీరాన్ని వదిలి, కొత్త జన్మనిస్తాయి. భావోద్రేకంలో నిమగ్నుడై చైతన్య ప్రవాహంలో కొట్టుకుపోతున్న వ్యక్తి, ఒక్కసారి సృష్టి రహస్యాన్ని, మెరుపులా ఛేదించి మరో అవతారం దాలుస్తాడు. చచ్చి బ్రతకటంలాంటిది ఆ అనుభవం.

కుముదం నా వివాహాన్ని గురించి చెప్పిన కడసారి మాటలు నాలో అధోలోకాన్ని త్రవ్వి దాని దాపరికాన్ని నా కళ్ళముందు ప్రదర్శించినట్లయింది. ఆమెకోసం పెండ్లి చేసుకోలేదట! మానసిక శాస్త్రజ్ఞులు, మానవుడి బుర్రలో అధోలోకం వుంటుందంటారు. అక్కడ అతని రహస్యమైన కోర్కెలు, బైట చెప్పుకోలేని తీరని వాంఛలు అడవిమృగాలలా తిరుగుతాయట. అవి అన్ని సమయాలలోనూ బయటికి రాకుండా బుద్ధి కాపలా కాస్తుంది. అవి బైటికి రాలేకపోయినప్పటికీ, ఎప్పుడో, నిద్రలోనో, బలహీనమైన స్వప్నావస్థలోనో, గర్జించి వాటి వునికిని బాహ్యప్రపంచానికి వెల్లడిస్తాయట. ఇంతకాలం నా బుద్ధి వాటిని కట్టేసింది. ఆనాడు ఆమె చెయ్యిమీద చెయ్యివేసినప్పుడు బుద్ధిని తొలగించి వాంఛలు బైటికొచ్చినట్లు, కుముదం గ్రహించి, మనసుపేటిక లోపల దాచుకున్నట్లు వాటిని వెనక్కినెట్టి నోరునొక్కింది. ఆమెలో ఏమీ విశేషంలేదని సమాధానపడుతున్నా, ప్రాకృతికమైన ఆకర్షణ లోపల దాగివుండి, నా జీవితంపై అంత ఒత్తిడి కలిగించినందుకు ఆశ్చర్యపడ్తాను.

తననిగురించి కథ వ్రాయమంది. [illegible], ఆరు వందల మాటలతో, నా ప్రపంచాన్ని తలక్రిందులుచేసి, నా జీవిత పరమావధినే తారుమారుచేసిన కుముదాన్ని గురించి ఏంకథ వ్రాయను?

రచనకాలం : 1946

ప్రచురణ : ఆంధ్రపత్రిక, 1946 ఆగస్టు

# పై నీడ

ఇవన్నీ రాజారావుకి సంభవించాయి. జరిగిందిది— నమ్ము నమ్మకపో అని జరిగిందంతా చెప్పి ముగించాడు.

నేను నమ్ముతాను. ఎందుకంటే అదంతా దేన్నో సమర్థించేటందుకు చెప్పింది కాదని స్పష్టమైంది. దానికంతటికీ చమత్కారంగా ఏదో వ్యాఖ్యానం చేస్తే తప్ప చటుక్కున స్ఫురించే అర్థం లేదు. అపూర్వమైన సంగతులు జీవితంలో తటస్థపడటం అందరికీ అనుభవమైనా, కళలో వాటిని మనం నమ్మలేం. కళలో ప్రయోజనం, విలువలు- వీటితో మనకి నిమిత్తం వుండి గనక అపూర్వమైన సంఘటనకి ప్రముఖస్థానం లేదు. కల్పితమైన వాటికన్న జీవితంలో నిజంగా జరిగేవే ఎక్కువ ఆశ్చర్యాన్ని కలిగిస్తాయన్న నిర్వచనం ఇదే చెబుతుంది. వాస్తవిక సంఘటన కలగచేసే ఆశ్చర్యానికి కళలో తావులేదు— దాని కేదో ప్రయోజనమూ, అర్థమూ, ఔచిత్యమూ వుంటేతప్ప ఇవన్నీవుంటే అసలంత ఆశ్చర్యమే కలగదేమో కూడా!

అనుభవానికి తుదీ మొదలూ, కారణాలు కొంతవరకూ వూహించవచ్చు. ఈ ఊహామటుకు సక్రమంగా కొనసాగకపోతే, అనుభవాన్ని చిత్రించినవారిని విమర్శించాలి గాని, అనుభవాన్నే శంకించకూడదు. రాజారావు పరిస్థితులు కొంతవరకూ నాకు తెలుసు. సంసారభారం పైనబడి ఇంటర్‌తో చదువు చాలించి ఉద్యోగం కోసం యత్నాలు చెయ్యాల్సి వొచ్చింది. అనువైన వుద్యోగం దొరకడంలేదు. ఏదో వో వుద్యోగం— ఏ వుద్యోగమైతేనేం- పొట్టపోసుకోడానికీ, ఆదర్శసాధనకీ సంబంధం ఏమిటి ?— అనుకునే స్థితి కొచ్చాడు. భార్య, పెండ్లి, సంసారం- వీటి యథార్థాన్ని ఎదుర్కొనే చైతన్యాన్ని పరామర్శ చేస్తుండగానే వివాహమై పోయింది. భార్య సీత- ఎంతో మంచిది, అమాయకురాలు. వ్యక్తిత్వంలో సర్వస్వమూ వొక్కచూపులో స్వాధీనం చేసేలా చలించని నిండుచూపు, సన్నటి ముక్కు, వింత భావాలని ప్రకటించే మాటలకు అలవాటుపడని

పసిపెదవులు,— సీత ఎదురుగా వున్నాకూడా ఆమె దూరంగా వుండగా తల్చుకున్నప్పుడు కలిగే జాలి జ్ఞాపకాలొస్తాయి. అతనెవరో ! ఆమెవరు ? వారిద్దరూ భార్యాభర్తలా ? వా రేంచెయ్యాలి ? వా రేం కావాలి ? రాజారావు కివేవీ అర్ధంకావు.

అందరు విద్యార్ధులవలె అతను ఊహాజగత్తులో విహారం విరమించ లేదు. ఆ జగత్తుకి మనస్సుతో ప్రమేయం లేదు. శరీరంతో యింక దెబ్బ లాడలేక యౌవనం మనస్సుని ఉసిగొల్పి స్వప్న జగత్తులోకి పారి పోతుంది. శృంగారం వొక సరస్సు, ఆదర్శాలు చుట్టూ కొండలు; మధుర స్వప్నం వొక మొగ్గ; ఆమె నవ్వు వికసించిన పుష్పం; ఆనందబాష్పాలు జలపాతాలు; యౌవనం నావ— అతడు నావికుడు. ఆమె ఎవరు ? భార్య సీత కాదు. ఎవ్వరూ లేరు. ఈ జగత్తులో అన్నీ వున్నాయి. ఒక్క ప్రేమ తప్ప. ఆమెని పిలిచాడు. జవాబు లేదు ఒంట్ని వెదుకుతున్నాడు.

'పోస్టు టైమయిందేమో, మరి దరఖాస్తు పంపవూ ?' ఎదురు గుండా సీత.

చుట్టూ శిఖరాలు విరిగిపడ్డాయి. మొగ్గలు వాడిపోతున్నాయి. పుష్పాల రేకులు గాలిలో ప్రకృతి తుమ్మినట్టుగా కొట్టుకుపోయాయి. నావలో కంత— అతను మునిగిపోతున్నాడు.

లేచి దరఖాస్తు కవర్లో పెట్టి పోస్టాఫీసు కెళ్ళాడు. అతను వెళ్ళగానే సీత తలగడదిండు సర్దింది. దిండ్లకింద పుస్తకం. పుస్తకంలో ఫిలింతార ఫొటో. ఆమె అమాయకంగా నవ్వింది.

ఇంట్లో భోజనం, నిద్ర— తరవాత బైట రోడ్లమ్మట నడుస్తూ, ఆలోచిస్తూ పోతూండడం— అల్లా గడిచిపోతున్నాయి రోజులు అతనికి బైట బాగాలేదు. ఇళ్ళముందు మురికి కాలువలు; పందులు, గాడిదలు— వాటి దెంత ప్రశాంత జీవితం ! దుకాణాలు— ముష్టివాళ్ళు, కుష్టువాళ్ళు, దూరంగా గుడిసెలు, ఎండ లేకపోతే వాన, ఆ జనం, ఆ వాసనలు, ఆ దుమ్ము— ఛ, ఛ, ఇదే నయం. కొన్నివేల సంవత్సరాల క్రితం సిద్ధార్థునికి కలిగిన అసంతృప్తే అది.

అన్ని మూలల్లా పరకాయించి చూశాడు, ఆ మాసిన బట్టలబుట్ట దాని

కింద దొడ్డింకలూ, ఎలుకలు ఆ మూలంగా జబ్బూ, పాలిగూళ్ళు, చచ్చిన కీటకాల కళేబరాలు. ఆ పాకుడు మెట్లు వంకరగా పైకొచ్చి పిల్లైనప్పుడల్లా లేచినవాళ్ళందర్నీ వెంటాడుతున్నాయి. 'ఛీ, అబ్బ!'— గాలి, వెలుతురు రావు. పగలల్లా పంకాల సవ్వడులు స్వేచ్ఛాకేళి; రాత్రల్లా దోమల బృందగానం. పోనీ కదా ఒక గది స్వాతంత్ర్యాలు. ఆ గోడగడియారం తిరగదు; అబ్బబ్బా— ఏమిటి పని వొచ్చి, ఈ చెమట నెల్లా భరించడం! ఒళ్ళంతా చెమటలు పట్టేస్తాయి చెంబుడూ! శరీరంలో ఏదో ఓ భాగాన్ని చెమటకి కేటాయించకూడదూ ఈ సృష్టికర్త!

రాజారావుకి సీతపై, తనపై, తనని పుట్టించిన తలిదండ్రులపై, వారిని పోషించిన సమాజంపై, సమాజానికి తావిచ్చిన దేశంపై, సముద్రాల ద్వారా ఏకంచేసిన యీ గోళంపై ఈ నిర్భాగ్య గోళాన్ని తనచుట్టూ తిప్పుకుంటున్న సూర్యబింబంపై— ఆగ్రహం ముంచుకొచ్చింది. బైటకెళ్ళాడు. ఏవో ఆలోచిస్తూ నడుస్తున్నాడు.

మానవహృదయం అంత విశాలమైందంటారు. ఊహకు అంతం లేదంటారు. అయినా అతనివి అవే ఆలోచనలు. పాతవే ఎన్నిసార్లో సాగించిన ఊహలు. కొత్తవి కనబడవు. మళ్ళా మళ్ళా మొన్న చూసిన సినిమాలో ఊర్కొనే ఊహాలో పడి అతన్ని కలవరపరుస్తున్నాయి. కథానాయకుడు తనంత బాగుండడు; తనంత చదువుకున్నవాడు కాదు; అసలతని చదువు, ఉద్యోగం విషయం అందులో లేదు. హాయిగా టెన్నిస్ ఆట ముగించగానే కార్లో సరోజ యింటికెడతాడు. సరోజ తండ్రికేం పనో తెలీదు. వాళ్ళిల్లు ఎంత బాగుంటుంది! గేటు- మొక్కల పార్కు, పోర్టికో మధ్యలో నగ్నంగా స్నానం చేస్తున్న స్త్రీ విగ్రహం- పెద్దహాలు- ఎక్కడ చూసినా సోఫాలు, సెట్టీలు, ఊగే కుర్చీలు, ఏమరిపాటుగా కూలబడితే గజంపైకి ఎగిరేసే స్ప్రింగులు, కుషన్ల కుర్చీలు; పైన వేళ్ళాడే 'షాండిలియర్లు'- బెల్జియమ్ గ్లాస్‌తో చేసిన దీపాలగుత్తులు, బ్రాకెట్ లాంప్‌లు 'వెస్ట్‌మినిస్టర్' సంగీతంతో గంటలు మోగే 'కింజిల్' గడియారాలు, 'ఎపోల్లో' దేవత కంచువిగ్రహం చేతిలో సురో రంగుదీపం, గోడలనిండా బొమ్మలు- గోల్డ్‌ఫ్రేములో తైలవర్ణ చిత్రాలు— అర్ధవేళ

మెట్లుగల స్టెయిర్ కేస్‌మీద పెర్షియా లినొలి- మెట్ల మొదట్లో ఎలబాస్టర్ రాతిలో చెక్కిన ఇద్దరు స్త్రీ మూర్తులు; ఎంత సౌందర్యం! ఎంత సౌఖ్యం! సరోజ మేనమామ ఇంగ్లీష్ నైట్‌గౌన్లో, హాలండ్ 'పైప్' పీలుస్తూ క్షణం దర్శనం యిస్తాడు. 'పెర్లీ చైనా' టీ కప్పు చేతులో పట్టుకుని— నల్లని అల్‌సేషియన్ కుక్క- దూరంగా గుమ్మంలో వంటామనిషి. సరోజ ఆనందంతో అద్దంముందు కాసేపు నాట్యంచేసి, పాట పాడుకుంటూ సింగారించుకుని సినిమాకని చెప్పి కార్లో వెళ్ళిపోతుంది.

సరోజ తోటికోడలు, ఒక సీతలాగ పూర్వకాలపుది. తన గదిలోంచి బైటకి రాదు. ఆమె ఎప్పుడూ పూజామందిరంలోనే, భగవంతుడి ప్రతిమముందు నాట్యంచేస్తూ, పాడుకుంటూ వుంటుంది. కాని ఎంత అందమైన గది! దుర్గ, కృష్ణుడు, అంజనేయులు, సరస్వతి, వినాయకుడూ, కాళి— యివన్నీ, దంతపుబొమ్మలు, లోహాపు చిత్రాలు. పైన బుద్ధుని ప్రతిమ. ప్రక్కనే 'మహాత్ముడు' ఫొటో. మరో గోడమీద రామకృష్ణ పరమహంస, శివాజీ- మధ్యలో శివాజీ ఎందుకో ?- కాళికాదేవి ప్రసన్నమైందటగా !

అంత అందమైన పూజామందిరం త నెవ్వరింట్లోనూ చూడలేదు. తెల్లటి మెత్తటి మెరిసిపొయ్యే ఆ గోడలు ఎక్కడా అట్లాంటివి చూడలేదు. తను చూసిన యిండ్ల గోడలనిండా ఏవో కాగితాలు, బొగ్గుతోనో, యిటుకతోనో వ్రాతలు, మీసాలు తగిలించిన ఆడబొమ్మలు, ఫలానావారికి వోటిమ్మని వ్రాతలు, బూతులు - సినిమాలో యిండ్ల గోడలకి యివేవీ వుండవు. అతనికి పరిసరాలపై రోత ప్రబలడానికి కారణం ఈ సినిమాలో సృజింపబడిన సౌందర్య దృశ్యాల జ్ఞాపకాలే !

రాజారావు పూరవతల పార్కు దాటి, నరసింహస్వామి ఆలయ పావరణకి చేరుకున్నాడు. నవ్వొచ్చింది. సినిమాలో వస్తే సెట్టింగులు- ఎక్కడెక్కడినుంచో ఆ వస్తువులన్నీ సేకరించి, అమర్చినవి జీవితం అంత అందంగా వుండాలని- వుండేటట్టు చేసుకోమనీ వాటి వుద్దేశం. అల్లా ఎవరేనా వున్నారా ? ఏమో వున్నారేమో ! తనకేం తెలుసు ? ఎక్కడా లేకపోతే మాత్రం అల్లా ఎందుకు చూపుతారు ? సరోజగారింట్లో పనిపిల్ల ఎంతందంగా వుందని! తోటలో వెన్నెట్లో నృత్యాలు: చిన్నయ్యగారు ఆమె

ఒక సౌందర్యమూర్తి నీడ చూశాడు. ఆమె పెదవి [illegible] గోడమీదా ఆక్ర మించాయి. ఒక్క క్షణం ఆ నీడ నిలిచింది. చెట్ల ఆకులు కదలడం మాని నీడలో కలిసిపోయ్యాయి. జడ మెడమీద పడింది. ఆ వెంట్రుకల్లో 'డైమండ్' ఆకారంలో ఏర్పడ్డ ఖాళీ తెల్లగా కన్పడుతోంది.

విరిచిన విల్లులాగ, త్రిప్పిన [illegible] అమరిక, ఎవరో విరిచిన కాడలులాగ కనురెప్పలు; గుండ్రంగా ప్రారంభమై చదరంగా అంచు మొంది సగం తీసిన చాకులాగ, వొంగి విరిచిన ముక్కు, సమంగా ఉన్న రెండు పెదవులు, సిగ్గుతో వొంగి చోద్యం చూసే దుస్సాహసంతో ఒక్క సారి వొయ్యారంగా, పైటకి గెంతి, మళ్ళా భయంతో చరచరా లోపలికి వెళ్ళిపోయినట్లు, వొంపు తిరిగినగెడ్డం- ఆ శ్యామలమూర్తి నీడ సౌందర్యానికి, అతడు ముగ్ధుడైపొయ్యాడు. ఏవేవో ప్రతిమలు, చిత్రాలు, ఫిలింతారల ఛాయలు, చరిత్రలో కలిసిపోయిన సుందరాంగనల ప్రతిబింబాలు అతనిని కలవరపర్చినవి. నీడను ప్రేమించడం నూతన అనుభవం. అతడు దానికి లొంగిపొయ్యాడు. దూరంగా ఊరేగింపు ధ్వనులు మీదకొచ్చి పడు తున్నాయి వాద్యకారులు వొచ్చేశారు. ఆ శ్యామలమూర్తి ఆ నీడలమధ్య కలిసి కరిగి పోయింది. ఎన్నో నీడలు- ఆకృతి లేని, నల్లగా గోడమీదా ఆక్రమించాయి. ఆమెకోసం వెనక్కి తిరిగి చూశాడు. అంతా ఊరేగింపు జనం గజిబిజిగా త్రోసుకుంటూ వెడ్తున్నారు ఆమె కనబడలేదు. గుంపు దాటాడు. జనం పల్చబడ్డారు. కుడివైపు సందులోకి నడిచాడు. ఎక్కడా మనుషుల జాడలే లేదు.

దీపం నీడలో దూరంగా ఉన్న మేడ. ఎవరో పులిస్తరాకులు గిరవాటు పెట్టారు. సందుదాటి పార్కువైపు కొచ్చాడు. ఆమె ఏమైంది? ఆమె నిజంగా ఉందా? తన మనసులో భ్రమలు ఆ నీడరూపం దాల్చినవా? తనని పరీక్షించడానికి దేవతలు కల్పించిన మాయారూపమా? అలసటతో అసంతృప్తితో చెమట్లుపోశాయి. ఆ బెంచీమీద కూర్చున్నాడు. చొక్కా బొత్తాములు విప్పాడు. సోడా కొట్టించుకు త్రాగాడు కళ్ళుమూసుకుని పడు న్నాడు. రెప్పలక్రింద ఆమెనీడ నల్లగా వొత్తిడి చేసింది. అతనికేదో అపూర్వసౌందర్యం దొరికింది. కాని దాన్ని ఉంచుకోలేదు. కదిలిపొయ్యే

జీవితంలాగ కరిగిన స్వప్నంలాగ, ఉండి కూడా లేని ఇంద్రజాలం, ఎండ మావి నడచినకొద్దీ దూరమయ్యే ఇంద్రధనుస్సు.

ఏదో పురుగు పొదల్లోపల కదిలింది. ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు. దిగాలుగా నడచి ఇంటికి చేరుకున్నాడు. పదిగంటలు కావొస్తోంది.

“సినిమా కెళ్ళారా?” సీత ప్రశ్నకి లేదన్నట్లు తల పంకించి, భోజనానికి కూర్చున్నారు. భోజనాలదగ్గర ఎవరూ ఏమీ మాట్లాడలేదు. భోజనాలయ్యాయి. అతడు అరుగుమీద ఏకాంతంగా కూర్చొని ఆకాశం కేసి చూస్తున్నాడు. ఇంతలో లైట్లు పోయ్యాయి. కొవ్వొత్తి వెలిగించి గదిలో పెట్టి సీత బైటికొచ్చింది.

‘ఏమండి; దిగులుగా వున్నారేం?’

సమాధానం లేదు.

‘ఉద్యోగం విషయమా? అదే వొస్తుంది.... కాలం కలిసిరావాలి. చెప్పరూ....’

‘ఏమీలేదు.... ఊరికినే....’

‘ఏదో వుంది. నాతో చెప్పకూడదా....?’

‘నీ కర్థమవదు.’

‘అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తాను” అంది సీత.

‘నాకేం దిగులుగా లేదు. మనస్సంతా అదోలాగుంది; ఫలానా కారణం అని లేదు.’

‘పోనీలెండి చెప్పకపోతే, ఇంకెప్పుడూ అడగనులెండి.’

దూరంగా కొవ్వొత్తి వెలుగులో ఆమె కళ్ళల్లో తడి మెదిలింది మృదువుగా. ఆమె నీడ వికృతంగా స్తంభంమీదపడి గాలికి కదులుతోంది. ఆమె ముఖాన్ని పైకెత్తి కళ్ళల్లోకి చూశాడు.

‘ఊరికినే.... కోపం వచ్చిందా?’

లేదన్నట్లు తలవూపింది.

‘నవ్వితే చెబుతాను.’

దట్టమైన వర్షం మధ్య కాసేపు సూర్యుడికాంతి ధారలమధ్య కొట్టుకున్నట్లు సీత నవ్వింది. నీడ స్తంభంమీద వొంకరలు తిరిగింది.

'చెప్పనా ?'

'ఊ' అన్నట్లు మూతి ముడిచింది.

'నే నొకర్ని ప్రేమించాను' అన్నాడు రాజారావు.

'నిజంగా' ?

'అవును.'

ఎవ్వరూ మాట్లాడలేదు కొవ్వొత్తి వెలుగులో కీటకాలు రెక్కలు విరుచుకుంటున్నాయి. ఏదో పురుగు టప్పుమని గోడమీద పడింది.

చాలా సేపైంది.

'ఎవర్ని ?' అంది సీత.

'నిన్నే' అన్నాడు.

ఆమె నవ్వింది- వింతగా నీడ కూడా నవ్వింది.

'వేళాకోళమా ?'

'ఎందుకు కాకూడదూ ?'

'నే వెళ్ళిపోతా నంతే' అని, జడ ముందుకి లాక్కుని, పూల గుత్తిని చేతులోకి తీసుకుంది.

అనా ఢంతే సంభాషణ. కాని రాజారావు వూహాలో ఆమెనీడ అల్లానే నిల్చిపోయింది. ఉద్యోగం కోసం పడే ఆవేదనని త్రోసి, తనే మనస్సులో ప్రధానస్థానం ఆక్రమించుకుంటోంది. అతనిలో దిగులు ప్రబల మైంది. దేనివల్లనో- ఉద్యోగం కోసమా, ఆమె నీడ దొరకలేదనా అతనికే తెలీడంలేదు.

రోజూ ఆలయంవేపు వెళ్ళి ఆ మందిరం గోడమీది నీడల్ని చూస్తూ గడిపేవాడు. ఆమెనీడని ప్రసరించిన వ్యక్తి అతనికి కనబడలేదు. ఈ జగత్తంతా మాయగా కనబడసాగింది. మనుషులంతా నల్లగా, నీడలలా కనబడసాగారు. నల్లటి బాధ అతనిలో నిండుకుంది. చరిత్ర కంతలు, తలుపులు గుహల బిలలు మూసుకుంది. అంతా చీకటి. గతం అంతా తెల్లటి తెర; వర్తమానం ఒక పెద్దనీడ. భవిష్యత్తులేదు.

కొన్ని రోజులైం తరాత్వ సీత మళ్ళా అడిగింది.

'మీరీ మధ్య ఆదోలా వుంటున్నారు. కారణం చెప్పరూ ?'

'ఎనక చెప్తాను. వేళాకోళమని తోసేశావు' అన్నాడు.

'నన్ను ప్రేమించడమేమిటి లేకపోతేను!' అన్నది సీత.

'భర్త భార్యని ప్రేమించాడంటే హాస్యాస్పదంగా వుంటుం దెందుకో ?' అన్నాడు

'ప్రేమ కొంతకాలం వుండిపోతుంది. దాంపత్యం ఎప్పుడూ వుండేది అంటారుగా పెద్దలు' అన్నది సీత. ఆమెకేసి తేరిపారచూశాడు. తను అనుకున్నంత అమాయకురాలు కాదేమో సీత. ఆమెపై గౌరవం పెరిగింది. గౌరవం పెరిగినకొద్దీ ఆమె దూరమైపోతున్నట్లనిపించింది. మంట వెలుగిస్తుంది. వేడినిస్తుంది కాని వేలుపెడితే కాలిపోతుంది.

'ఎవర్నో చెప్పండి- నే నేమీ అనుకోను.'

'నువ్వు వూహించలేనా ?'

'లేను.'

'ఒకామె నీడని....'

సీత నవ్వింది — మెల్లిగా ప్రారంభమై, చప్పుడు లేకుండా, ఎంతో సేపు మొహంమీద వ్యాపించి, మళ్ళా పెదవులమూతలో దాగిన నవ్వు.

'అందుకనే నీ కర్థంగాదు — అన్నాను' అన్నాడు రాజారావు.

'మరి నవ్వనులెండి. ఎవరినీడో ?'

'గోడమీద పదిరెట్లు పెద్దదిగా పడింది ఆమెనీడ. వెనక్కితిరిగి చూశాను. ఆమె లేదు. ఏదో వూరేగింపు గుంపులో కలిసిపోయిందో, మరెటుపోయిందో. ఆమెను చూసేవరకూ నాకు తోచడంలేదు. ఈ అన్వేషణ వొక పరమావధిగా పరిణమించింది' అన్నాడు. సీత మొహంతిప్పి గోడ కేసి చూసుకుంది. రాజారావు నీడతో కలిసి, ఏదో ముసుగులా, ముద్దలా పడింది ఆ నీడలద్వయం.

సీత ఈ విషయం అంతగా పట్టించుకోలేదు. ఏదేనా సందర్భంవొరికి వచ్చుడు, దెప్పిపొడిచేటంతవరకే జ్ఞాపకం పెట్టుకుంది. దెప్పిపొడుపుకి వొకటి రెండుసార్లు రాజారావు చీకాకుపడటం చూసి, అదీ మానేసింది. వారాలు గడిచాయి. అతనల్లా తిరుగుతూనే వున్నాడు. ఆమెనీడ మూర్తి కనబడలేదు; ఉద్యోగమూ దొరకలేదు.

ఓ వుద్యోగంకోసం రాజారావు పట్నం వెళ్ళాల్సి వొచ్చింది. మొదలియార్ ఆఫీసులో అభ్యర్థుల పరామర్శ. ముందుగానే యింటికెళ్ళి

ఆయన్ని చూడాలనుకొని, ఓ డజన్ యాపిల్‌పండ్లు సంచీలో వేసుకొని మొదలియార్ యింటికి చేరుకునేటప్పటికి, సాయంత్రం ఏడు కావొస్తోంది. ఆయన క్లబ్బునుంచి యింటికి చేరుకునేవేళ అది. చుట్టూ గోడ. మధ్య గేటు. గేటులోంచి లోపలి కెళ్ళాడు. ముందంతా తోట— పెద్దచెట్లగుండా దోవ దాటింతర్వాత చిన్న మొక్కలు. వరండాలోకి మెట్లు. వాటిముందు రెండు పెద్ద విద్యుద్దీపాలు. ఆ కాంతికి మొక్కలనీడలు ఎదురుగావున్న గోడమీద స్ఫుటంగా పడుతున్నాయి. గోడలమీద నీడలకేసి చూడటం అలవాటైపోయింది. ఆ నీడలకేసి చూస్తున్నాడు. మొక్కలు పదిరెట్లు పెద్దవిగా పడుతున్నాయి. చలనంలేదు ఇంతలో వో కుక్కపిల్లనీడ పడింది తోక ఆడిస్తూ గంతులేస్తోంది. ఆ నీడ కదిలిపోయింది. దాని వెనకాల మరో స్త్రీ తలనీడ పడింది. నీడ నిలిచింది- మెడ, తల మాత్రం పెద్దవిగా కనుపిస్తున్నాయి. లోలాకులు కదిలి నిలిచిపోయ్యాయి. జడకి మెడకి మధ్యదైమండ్ ఆకారం ఖాళీ తెల్లగా కనబడుతోంది. ఇదే ఆమెనీడ. గుండ్రంగా ప్రారంభమై, చదరంగా అంతమొందిన నుదురు. విల్లువిరిచినట్లు పెదవులు, వొంచిన కత్తిలా ముక్కు, వొంకరలు తిరిగిన గడ్డం- ఆమెయే! అమ్మయ్య ఇన్నాళ్ళకి చూడగలిగాడు. ఆదుర్దాతో గుండెలు కొట్టుకుంటున్నాయి.

ఇంతలో కుక్కపిల్ల మొరిగింది. ఉలిక్కిపడి నాలుగడుగులు వెనక్కివేశాడు. కుక్కపిల్ల అతని చుట్టూ తిరుగుతోంది. చిటికెలువేస్తూ, 'టిబ్బీ' అని పిలుస్తూ, ఆమె మొక్కల మధ్యనుండి అతనివేపు నడిచి, చూడగానే నిలిచిపోయింది.

'ఎవరికోసం ?' అంది ఆమె.

'మొదలియార్‌గారి కోసం.'

'ఇంకా రాలేదు. మీరెవరు ?'

ఫలానా వూరని చెప్పాడు. ఉద్యోగం విషయంలో వారి దర్శనం కోసం వొచ్చినట్లు చెప్పాడు.

అల్లా వరండాలో కూర్చోండి. ఈపాటికి వస్తూవుంటారు' అన్నదామె.

'మీ రెప్పుడేనా మా వూరొచ్చారా ?'

'లేదు.'

'ఎప్పుడూ ?'

'లేదు. ఎందుకు ?'

'ఊరికినే. అంతే.... ఊరికే అడుగుతున్నాను.

'లేదు లేదు' అని ఆమె నవ్వింది.

కుక్కపిల్లతో లోపలి కెళ్ళింది. ఇంతలో మొదలియార్ గారి కారు హారన్ మ్రోగింది.

దిగులుపడ్డాడు రాజారావు. ఆమె అటుకేసి రాలేదు. కాని అచ్చంగా ఆమె నీడలాగా వుంది. దానితో ఎందుకు తృప్తిపడకూడదూ. ఆమెనీడ వ్యక్తినే చూడాలి. మళ్ళా చీకటి అలుముకుంటోంది.

ఉద్యోగం పరామర్శ అవగానే రాజారావు తన వూరికి చేరుకున్నాడు. రోజూ సాయంత్రం ఆలయం కేసి వెళ్ళి ఆ నీడని చూస్తూ కూర్చునేవాడు. మూడువారాలు గడిచిం తర్వాత ఆతనికి ఉద్యోగం వొచ్చినట్లు ఉత్తరం వొచ్చింది. సీత సంతోషంతో పొంగిపోయింది. ఈ వార్త విన్న 'అప్పి- పనిపిల్ల' కూడా నవ్వింది. రాజారావుకి సంతోషంగా వున్నా పిల్లెవ్వరూ నృత్యం చెయ్యనందుకు ఆశ్చర్యపడ్డాడు. తన వైఖరికి తాను నవ్వుకున్నాడు. సంతోషాన్ని బైటకు ప్రకటించడం ఎట్లా ? అందుకనే సినిమాలో ఆనందాన్ని నాట్యంగా వ్యక్తం చేస్తారు. కళలో మరోమార్గం లేదు. అదొక సాంకేతిక ప్రదర్శనం. ఈ మాత్రం తెలీ దతనికి ! సినిమాలో నృత్యంచేసిన పనిపిల్ల, పెద్దకుటుంబంలో పిల్ల అని చివ్వరిలో తెలిసిపోయిందిగా.

ఆమెనీడ స్ఫురణకొచ్చినప్పుడల్లా దిగులుపడేవాడు. ఆ సాయంత్రం ఆలయంకేసి వెళ్ళాడు. ఆ వంతెనమీద కూర్చుని, మందిరం గోడమీది నీడల్ని చూస్తూ కూర్చున్నాడు. తన కింక యీ గోడకేసి చూసే అవకాశం లేదు. మరో వూరు వెళ్ళి వుద్యోగంలో చేరాలి. నీడలు భయంకరంగా కదులుతున్నాయి పల్చబడ్డాయి. సైకిళ్ళు, రిక్షాలు, బండ్లు, ఆవులు, పోలీసు- యివన్నీ కదిలిపోయ్యాయి. గోడ తెల్లగా నీడలు లేకుండా వుంది. మనుషులు పల్చబడ్డారు. సోడా కొట్టిన చప్పుడు. దూరంగా గుడిగంటలు. మేక అరుపు. కుర్రాడి యీలపాట. గోడమీద ఒక స్త్రీతల పడింది— పదంతలు పెద్దదిగా.

ఆనాడు చూసిన ఆమెనీడ— లోలాకులు కదిలి నిలిచిపోయాయి. జడకి మెడకి మధ్య డైమండ్ ఆకారంలో ఖాళీ, గుండ్రంగా ప్రారంభించి చదరంగా అంతమొందిన నుదురు, వొంచిన కత్తిలా ముక్కు, వంకరలు తిరిగిన గడ్డం. వెనకాల మరో స్త్రీ నీడ పడింది. కదిలిపోతున్నాయి. ఆలస్యంచేస్తే అంతర్ధానమౌతాయి. చటుక్కున వెనక్కి తిరిగి చూశాడు. భార్య సీత, వెనకాల పనిపిల్ల 'అప్పి'.

'ఆలయాని కొచ్చాం. ఉద్యోగం రావాలని మొక్కుకున్నాను. మీరూ రండి' అన్నది సీత.

'అప్పి' వెర్రిగా నవ్వింది.

'ఆమెనీడ దొరికింది' అన్నాడు.

'ఎక్కడ ?'

'అటుచూడు.'

చూశారు. అప్పినీడ కనబడుతూంది.

'అప్పినీడా ?'

'ఛ, ఛ.'

'మరి' ఆశ్చర్యంగా చూసింది సీత.

'నీదే.'

'నాకేమీ కనపడ్డం లేదే !'

'మనం గోడకి మరీ దగ్గరగా వున్నాం— అప్పి కొంచెం దూరంగా వుంది.'

'ఎవరేనా చూస్తే నవ్వుతారు. రండి వెళదాం.'

మనం దగ్గరగా వచ్చినకొద్దీ దూరమయ్యే నీడ అది అన్నాడు రాజారావు. తనకి తెలీకుండానే ఒక జీవిత సత్యాన్ని తను బుజువు చేసుకొని ఒక్క వాక్యంలో యిమడ్చగలిగాడు.

అపూర్వమైన అనుభవానికి అర్థాలు కల్పిస్తే మరింత అసహజంగా ధ్వనిస్తుందన్న భయంతో యీ గాథను ముగిస్తున్నా.

రచనాకాలం : 1940, నవంబరు 1

ప్రచురణ : గృహలక్ష్మి, 1940, డిశంబరు

# చైతన్యాస్రవం

"నన్ను ఇంటర్వ్యూ చేసేటందుకు నీ వెవడవంటాను ? వాడు-ఆ దొర-దొరబాబు-నలుగురుంటారట దుష్ట చతుష్టయం చతురస్రపుం గాళ్ళ-నే మనిషినంటే నే మనిషిని, కోతినంటే కోతినినా ! వారు వేసే ప్రశ్నలకి. వాళ్ళతో శ్మశాన దహనము-అబ్బా. నాలిక మడతపడింది-వాళ్ళకో సమాధానం తెలిసేడిస్తేగా !

'నీ పేరు' ? దరఖాస్తులో తగులడిందిగా. 'ఇందులో ఎందుకు చేరతావు ? ఎందుకేమిటి, వాళ్ళంతా ఎందుకు చేరారు ? చేరు-చెర-చెరా చెరుపు-చెర్రు మంటుంది. ఇదంతా చెర, జైలు, బందిఖానా, ఈ సంసారం సంఘంలో ఒక చెరసాల---ఈ సంఘం దేశంలో ఒక జైలుగది. ఈ దేశం ప్రపంచములో ఒక మారుమూల చీకటి గది, ఈ ప్రపంచం విశ్వంలో అప్పే! గోళీకాయంతండి. సూర్యుడు గోళీ కాయంతయితే, భూగోళం ఇసుక రేణువులో వెయ్యోవంతు, ఈ విశ్వంలాంటివి మరెన్నో పలోమార్లో[1] వున్న భూతద్దానికి ఆగపడవట.ఎన్నెన్నో గోళాలు, విశ్వాలు, అనంత శూన్యంలో మా తమ్ముడు ఊదిన రబ్బరు బుడగలాగ పెరిగి పోతున్నాయి. దీన్ని ఊదిన వాడెవడు ?[2] ఎప్పుడో బ్రహ్మగాడి బుంకెళ్ళు పడతాయి. టి. బి. క్రిములుచేరి వాడి లంగులు పడతాయి. రబ్బరు బుడగ తప్పుమంటుంది.

వాడడుగుతాడు[3] - ఎర్రకొండమీద ముప్పైరెండు గుర్రాలున్నాయి.

---

1. నేటి ఖగోళ శాస్త్రజ్ఞుల నిర్వచనాలు. పలోమార్ నిర్మాణమైన పెద్ద దూరదర్శిని ద్వారా దూరంగావున్న ఎన్నో గోళాలను చూడగలుగుతున్నారు.
2. ఖగోళ శాస్త్రజ్ఞుడు స్పెన్సర్ జోన్స్ వేసిన ప్రశ్న.
3. జేమ్సుజీన్స్. "సూర్యుడు వేడిని కోల్పోయి, సన్నగిలి కొవ్వొత్తి లాగా పోతాడు. ఇది జరక్కముందే మన భూగోళం మీద ప్రాణులన్నీ నశించవుతాయి. ఇదంతా కొన్ని కోట్ల సంవత్సరాల మాట." ఈ సిద్ధాంతాన్ని కొందరు ఖగోళ శాస్త్రజ్ఞులు అంగీకరించరు.

ఉప్పుమంటే నిలచిపోతై ఏమిటో చెప్పు[4] ఎక్కిళ్ళు. పళ్లు, వాడి పెళ్ళాం గరిటతో కొట్టగా ఉండకుండా మిగిలిన ముప్పయిరెండు పళ్ళూ-ఆ-ఇప్పుడు తెలిసిందా? నే నెందుకు చేరతానో ఈ చెరకి? పావ్‌లావ్[5] కుక్కలాగా పొట్టకూటికి గుండ్రని ఎముకని చూపిస్తే వాడిచెయ్యి నాకుతా, వాడిపెళ్ళాం కాళ్ళు పడతా. ఛీ, ఛీ. ఫ్రాయిడ్[6] తాతయ్యో నూరిపోశాడురా నాకి పెళ్లాం గొడవ నా కెందుకు? వాడి కాళ్ళే పడతా-ఫ్రేజరు (Frazer)[7]

'బంగారు బొమ్మలో' వెనక ఉండిపోరాదీ వెన్నునా కేటందుకు

---

4. చిక్కుప్రశ్న.
5. పావ్‌లావ్-రష్యన్ మానసిక శాస్త్రజ్ఞుడు. కుక్కలపై పరిశోధనలు చేశాడు. పాలు కుక్క ముందుపెట్టి తుపాకీ మోగిస్తాడు. ఆ తుపాకీ మోతని పాలు త్రాగడంతో ముడెట్టి, పాలు లేకపోయినా, తుపాకీ మ్రోగగానే, కుక్కలో జఠరరసం ద్రవిస్తుంది. మనిషి ఆలోచనలు చర్యలు బాహ్యజగత్తులోని 'ప్రేరణలకు' సమాధానంగా భావించాలి గాని, వాటిని అతిక్రమించే వ్యక్తిగతమైన కార్యశూరత్వం, ఆత్మ బలం లేవంటాడు డాక్టర్ వాట్‌సన్. ఈ సిద్ధాంతాన్ని 'బిహేవియరిజమ్' అంటారు. ఆత్మకి, మనస్సుకి తత్వజ్ఞులు ఆపాదించిన గౌరవాన్ని కూలద్రోస్తుంది సిద్ధాంతం. దీన్ని యీనాడు అంగీకరించడం లేదు.
6. ఫ్రాయిడ్-మానసిక శాస్త్ర పరిశోధకుడు. సెక్సుకి సంబంధం, ఆకలికి సంబంధం, ఆ సంబంధాన్నుంచి జనించే 'నటన' బాల్యంలో స్థిరపడిపోతాయనడానికి ఉదాహరణలు చూపుతాడు.
7. ఫ్రేజర్-ప్రాచీన మానవుడి మనస్తత్వం, ఆచారాలు, మూఢ నమ్మకాలు శోధించి, నాగరికుల ప్రవర్తనకి కారణాలు వాటిమీద ఎంతవరకూ ఆధారపడ్డాయో 'గోల్డెన్ బో' (బంగారు కొమ్మ) అనే గ్రంథంలో చర్చించాడు. కొమ్మ బొమ్మైంది.

ఇద్దరు జీతగాళ్ల వుండేవాడిని వ్రాశాడు.[8] ఇది చదివి నాలిక కొరుక్కున్నారు. అయిదువేల కాపీలు[9] అమ్ముడుపోయాయి ఈ దేశంలో? దినవారం[10] పత్రిక- లేకపోతేను- చిన్న, వారం మాసికం సంవత్సరీకం పత్రిక ఒక్క కాగితాన్ని ఐదు వేలమంది ముక్కలు క్రింద కొరుక్కుతింటారు. పదివేల మంది పెళ్ళాలు- అంటే యూంగు[11] (Jung) గాడు చెప్పినట్లు ప్రతి మగాడికి ఒక పెళ్ళాం ఒక ప్రియురాలు- మొత్తం ఎంతమంది ? పదివేల మంది దానితో[12] పొయ్యి రాజేస్తారు. అంటుకని, గుండ్రని, ఎముకని పై ఆ పని చేస్తా. ఎక్స్‌ప్రెస్! ఎక్స్‌ప్రెస్! హిందూ, హిందూ దక్కన్ క్రానికల్ దక్షిణాధికార బంకల్[13] బస్సుగాదే. ధరను ఎంతండి ? మిమ్మల్నే ? సమాధానం చెప్పరేం ? ఆగిపోయిందా, డొమ్మ గడియారమా ? మామగారు చేతి గడియారం ఇస్తానని ఐదు నెలలనుంచి ఊరంతా యాగి చేస్తున్నారు.

---

8. ఈ కథ "హేవ్‌లాక్ ఎల్లిస్" సెక్సు గ్రంథాల లోనిది. ఈనాడు సినిమాలలో శృంగార ఘట్టాలవల్ల కలిగే జుగుప్సకి మారుగా, వెనక రాజులు, రాణీలు యీ విధంగా కామోద్రేకాన్ని పొందే వారుట.

9. కాపీలు-మనస్సు కాఫీమీదకి పెడుతోంది కాబోలు —ఎదురుగుండా హోటల్ని చూడగానే.

10. దినపత్రిక, వారపత్రిక-ధ్వనుల మేళవింపు.
సంవత్సరీకం పత్రిక-సంవత్సరాది సంచిక.

11. యూంగ్- మానసిక శాస్త్ర తత్త్వజ్ఞుడు. భార్య వుండగా, ప్రతి పురుషుడూ మరో స్త్రీని లోలోన ఆరాధిస్తూంటాడని-

12. దానితో- పత్రికతో.

13. రావణపంతు- క్రానికల్ పత్రికకోసం వాడినది.

అత్తగారు తైతక్కత్తె తధినదాం తత్తత్త దాం[14] అవొద్దు-నంజన్ గూడు పళ్ళపొడి వారణాసాత్కుడి అరంజీ పత్తబాయూత్ కూడి షికాయి పొడి, అరవైనాలుగు నయాపైసాలు-[15] చెప్పు. లెక్క అణాలలో చెప్పు, అదుగో బస్సు డబుల్ డెక్క మొగుడు పెళ్ళాం. రాత్రి పగలు-పట్నం పల్లె- రాగద్వేషాలు, ప్రైము లేదు— పుట్రణం[16] అత్తగారి దొద్దు గోడగడియారం గోడకు తగల్చండి. అల్లుడు ఉద్యోగంలో "దూరంగా నించో"[17] క్లార్కు గేబుల్ మిర్నాలాయ్ మ్యాట్నీకెళ్ళాలి. లోపల సిగరెట్లు త్రాగనివ్వరు. మిర్నాలాయి ముక్కు పక్షుల జొంపమున్ ముక్కుల చొకారమల్లా వుంటుంది ఎక్కడదిది. మొల్లరామాయణం- గొల్లకలాపాం- చల్లనమ్మబోయే వేళ. ఇల్లలికే అప్పమ్మ[18] దాని భుజాలకి నొక్కి వాడి పెదవుల బూజును తుడుచుకొంటాడు. ఎంత ధన్యం డొక్కో[19] ఖూనీ చెయ్యమంటే సిద్ధం అదిస్తే[20] - ఖూనీ వివరాలు వచ్చే

---

14. అల్లుడికి రిస్టువాచీ వొద్దు, గోడగడియారం యిమ్మంటుంది అత్తగారు— నలుగురూ చూస్తారు. భర్త అంగీకరించకపోతే కోపం. 'రెం'య్యిమని చేతులు, మెడ తిప్పుకుంటూ మీదికి వెళ్ళిన దృశ్యం ఊహించుకుంటే భరతనాట్యం భంగిమాలు స్మరణకొచ్చాయి కాబోలు.
15. 'పైసలు' అనుండాలి బహువచనం గనక.
16. పుట్రణం=పుట్టుక, మరణం, ద్వందాలు, ప్రైములేక వొకమాటగా కలిపేశాడు.
17. దూరంగా నుంచో- వొక ఇంగ్లిషు టాకీచిత్రం పేరు. అందులో ప్రధాన నటులు క్లార్కుగేబుల్, మిర్నాలాయ్- వాల్ పోస్టర్ చూశాడన్న మాట.
18. అర్థంలేదు— ఏ స్త్రీ అయినా ఫరవాలేదు కాబోలు.
19. ఆమెతో నటించిన నాయకుడనా ?
20. అది=ఉద్యోగం.

వారం చదవండి. సం॥ [21] షెర్లక్ హోమ్స్ అగతా క్రిస్టీని[22] పెళ్ళి చేసుకున్నాడు. అట్లీకి, రస్సెల్‌కి క్రిస్టీ కలలే ఆటగా! [23] నో. నో,- 'అగతా మనిషి—[24] ఎముకలకుప్ప. పదునైన మాంసపు ముద్ద- సంధ్యారాగంబు పోలె నయాగరాపోలె మిలమిల ప్రవహించే రక్తాశయం. ఆమె యవ్వనంలో మృత్యువంటే తెలియని మనోహర మధురమూర్తి- షెర్లాకో మరి? [25] క్యా వాట్ సన్? [26] షెర్లాక్ అచ్చుమనిషి 'ప్రింటర్స్ డెవిల్'— దేర్‌ఫోర్ కాబట్టి, అది [27] ఇస్తే మతం వదులుకుంటా— అసలు నాకు మతం ఎక్కడేడిసింది? ఏమిటి మతం? దరఖాస్తుతో జత చేసి పంపిన జందెం[28] "ప్రాచీన మానవుడు చీకటికి, భూకంపానికి, తుఫానుకి, పసిపాప జననానికి, వృద్ధుడిమరణానికి హడలి, బెదిరి, హడిడి, బెలిరి; [29] పారిపోయి రాయి వెనకా, చెట్టుమీదా దాక్కున్నాడు. సూర్యుడికి

---

21. సీరియల్ నవల, సంపాదకుడు చెప్పినది.
22. అగాతా క్రిస్టీ-అపరాధ పరిశోధక నవలా రచయిత్రి.
23. అట్లీ-మాజీ బ్రిటిష్ ప్రధాని. బెర్ట్రండ్ రసెల్ సుప్రసిద్ధ ఆంగ్ల తత్వ శాస్త్రజ్ఞుడు. సారస్వతానికి, నోబెల్ బహుమతి పొందిన రచయిత వీరిరువురూ, కాలక్షేపానికి, క్రిస్టి నవలలు ఎక్కువగా చదువుతారట.
24. అగాతా క్రిస్టి చిన్నప్పుడు ఎట్లా వుండేదో వూహించుకుంటూ—
25. కోనన్ డాయల్ రచించిన అపరాధ పరిశోధక నవలలో డిటెక్టివ్ షెర్లాక్ హోమ్స్.
26. అతని మిత్రుడు డాక్టర్ వాట్సన్.
27. ఉద్యోగం.
28. ఒక బ్రాహ్మణ నిరుద్యోగి. తను బ్రాహ్మణీకం వొదులుకొన్నానని చెపుతూ, ఉద్యోగానికి దరఖాస్తుతోపాటు జందెం కూడా పంపాడని యస్. వి. వి. అనే తమిళ హాస్యరచయిత ఆంగ్ల వ్యాసంలో వ్రాశాడు.
29. అర్థంలేని ధ్వనుల ఫిరాయింపు.

నమస్కరించాడు. అవే దేముళ్ళు: అదే విగ్రహాలు— వాడి మనమలు మునిమనుమలు వాటివెనకే దాక్కుంటే వాళ్ళందరూ చూపే భయానికి 'మతం' అని పేరు" ఎక్కడిదిది? విలియమ్ జేమ్స్[30] దీనికేం చెబుతాడో రాధాకృష్ణన్[31] ఉత్తరం వ్రాసి కనుక్కోవాలి. కండక్టరు చోటు లేదని చెయ్యి ఊపుతున్నాడు. మంచి గంధపు చెట్టు గ్రాసుని పట్టుకొని వేళ్లాడుతున్న పాములలా బస్సు కడ్డీలు పట్టుకుని వ్రేళ్లాడుతున్నారు లాయర్లు ప్రొప్రయిటర్లు, నిరుద్యోగులు, స్కూలు పోష్టర్లు,[32] రోడ్డు డస్టర్లు శాస్త్రులవారి విస్తళ్లు[33] అలీశాస్త్రమిడ్జో జోజో నా ముద్దులపాప పిస్తోళ్లు[34] టిక్కెట్లు వూరికే పోకుండా స్త్రీ వెంటపడే కళాకాల సౌందర్య పిపాసులు- కాళిదాసు మెచ్చుకుంటాడు- మంచి గంధం పరిమళం మాత్రం లేదు- కరింబీడి శాసనలో మిళితమై ధారకింద కారి, భూగోళం వెయ్యి సంవత్సరాల క్రితం ఎట్లా వుండేదీ-[35] కండక్టరు కోటుని డాగు పరిచిన చెమట చుక్కల ధార పరంపరలు. ఇదీ మా నాగరికత. కాళిదాసు కేం తెలుసు? "ఇదీ అన్యాయం. నువ్వు నా కాలంలో అధమ విషయాలను నా మేఘ

---

30. అమెరికా దేశపు తత్వజ్ఞుడు— 'వివిధ మతానుభూతులు' ప్రసిద్ధ గ్రంథం.

31. ఆధునిక విజ్ఞాన శాస్త్రానికి అతీతమైన మూలకారణుణ్ణి ఆధ్యాత్మికంగా సాక్షాత్కారం చేసుకోవాలి కాని, తార్కికంగా అన్వేషించడం అజ్ఞానమని డాక్టర్ రాధాకృష్ణన్ నిర్వచనాలు.

32. స్కూలు మాస్టర్లు అనుండాలి. ఆ సమయంలో ఏదో గోడమీద పోస్టర్ చూశాడు కాబోలు.

33. శాస్త్రులు గారంటే, విస్తళ్ళు జ్ఞప్తికి వొచ్చినట్లున్నాయి.

34. ఇండోనేషియా ప్రధాని. 'కొరియా' తగాదాలు స్మరణకి రాగానే యుద్ధం, పిస్తోళ్ళ మధ్యలో జోలపాట.

35. కొన్నివేల సంవత్సరాల క్రిందట భూగోళం మాప్ వేరుగా వుండేది.

సందేశంతో పోల్చి నువ్వు అన్యాయం చేసుకుంటున్నావు నో నో కాళిదాసు

స్టూడియోలో సుప్రసిద్ధ, అల్లారుముద్దు, మిస్ ఈస్టు, మిస్ వెస్టు-ఈస్టు వెస్టు, ఇంటర్నేషనల్ తెర తార-ఫిలిం స్టార్ భుజాల క్రింద గొనుకి పడే డాగులా ఉంతే— షేమ్. వాటిషేమ్ ఇన్ని సౌందర్య నిర్మాణ కర్మాగారాలు పారిస్‌లో షాంప్ ఎలిసీస్[36] మాంట్ పర్నాసి.[37] కోటీ[38] యార్డ్లీ నెయ్యి ఇట్లీగా[39] ఎక్స్‌ట్రా- మాక్స్ ఫాక్టరీ[40] మార్క్స్ థీరీ అఫ్‌లావు సర్‌ప్లస్ వాల్యూ-[41] యిన్ని కలిసి చెమటని అరికట్టలేవే!" స్త్రీ పురుషుల చెమటకి, చక్కదనం, సువాసన, మందం- ఘనసాంద్రత- పాటుపోట్లు. ఫ్రీక్వెన్సీ- సమం.

-అన్ని కాలాల్లోను, అన్ని స్థలాలలోనూ- జె.బి.యస్. హాల్డేన్[42] అంటాడు.

“అట్లాగయితే నా దుష్యంతుడూ అంతే” కాళిదాసు మెచ్చుకోడు.

బోళ్ళ రిపేర్స్. వాడు నా కాళ్ళకేసే చూస్తాడు. వాడి బ్రతుకంతా అంతే-పాదాల శిల్పి. కాళ్ళకేసి చూసి చూసి వాడి మెడ బిగిసి మరి పైకి లేవదు-టెటనస్[43] “అస్పే వృత్తికి సంబంధించిన । డాక్టర్ దినకర్.

36. పారిస్‌లో విహార స్థలం.
37. పారిస్‌లో.
38. సుగంధద్రవ్యాలు. సౌందర్య పరికరాలు తయారుచేసే కంపెనీ.
39. కొన్ని హోటళ్ళలో.
40. మాక్స్ ఫాక్టరీ- మేకప్ సామాన్ల తయారీ సంస్థ.
41. కారల్‌మార్క్స్. శరీరంలో అధికంగా కొవ్వు పెరిగి లావెక్కితే తగ్గించే మందులున్నాయి. వస్తువు తయారీకైన ఖర్చుకు మించిన విలువ కొనుగోలుతో పెరుగుతూంటుందని వొక ఆర్థిక సూత్రం.
42. జీవశాస్త్ర పరిశోధకుడు.
43. అదొక ప్రమాదకరమైన వ్యా

మొహం పైకెత్తి-నాలికకింద థర్మామీటర్ పెట్టాలి. అప్పే లేవదు. అంతే (మీ జోళ్ళకి పాలీష్ వేస్తా) ముత్యంలా మెరుస్తుంది. "నీకు జబ్బురా. మందివ్వనా" ముందు తాళ్ళు విప్పనివ్వండి) వాడి బ్రతుకంతే డెమోక్రసీట-జోళ్ళ పనివాడి దుకాణం రోడ్డు లెవల్ కంటె కిందుగా వుండాలి అప్పుడు రోడ్డుమీద వెళ్ళేవాళ్ళ కాళ్ళు ఎత్తుగా కనిపిస్తాయి. అప్పుడు వాడి తలపైకి నిలబడుతుంది-రష్యన్ మనస్తత్వవేత్త. జకావ్‌సిపిల్ పాలిష్‌స్కీ-[44]'ముగ్గురు లాయర్లు మాత్రిమూర్తి [45] చోటు లేక కడ్డీ వదిలి రోడ్డుమీద పడ్డారు.' రోడ్డు డామేజ్-డిపమేషన్ సెషన్ కోల్ టార్ సిమెంట్-ఏనుగు వీపుమీద పడిన పుండుమీద వాలిన ఈగల మాదిరి-ఏనుగు కాదు-వొంటి-మధురవాణి లొట్టిపిట్ట, [46] చెటపట. ఛమిడిపాటి కచట తప-అండమాన్సులో నీటికుండని అంటిపెట్టుకుని వున్న ఖైదీల ఎండిన పెదవుల మాదిరి-హాయ్ హాయ్! ఎలక్షన్‌లో నాకు మెజారిటీ వోటు తప్పదు. అదిగో బస్-వుడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్‌ని [47] మోసుగొస్తోంది. వెనకాల కాన్వెంట్ గరల్స్ బస్సు వాళ్ళ జడలు మంచి గంధపుచెట్టు మ్రానుకి వ్రేళ్ళాడే త్రాచుపాము పిల్లలు-[48] "నా చుట్టూ పూర్ణచంద్ర ప్రభావీచికలు విరిసినవి క్షీరసాగర తరంగములట్లు' [49] అలసముగ సాగు జోత్స్నాభిసారికల పయ్యెద తుదలు కన్పించె నదులేమొ యన్పించె."

యవ్వనంలో బంధించబడ్డ ఆ కన్యలని నాగరికత బస్సులో బంధించి కాన్వెంట్ అనే జైలుకి మోసుకుపోతోంది. కుటికురా, పెట్రోల్,

---

44. అట్లాంటి వ్యక్తిలేడు. జోళ్ళపనివాడి జబ్బుకి మందు సూచించింది లెనిన్ అని లైసెంకో వ్రాసినట్లు ఎక్కడ చదివాడో జ్ఞాపకం రాక, పేర్లని కలగాపులగం చేశాడా ?
45. ఎలిఫెంటా గుహలో త్రిమూర్తి విగ్రహం.
46. కన్యాశుల్కంలో, మధురవాణి ఉత్తరం చదవడం-నవ్వడం దృశ్యం జ్ఞాపకానికొచ్చి.
47. ఇంగ్లీషు మందు ఎడ్వర్‌టైజ్‌మెంట్ పోస్టర్.

48 & 49. సి. నారాయణరెడ్డి. స్వప్నభంగం' కావ్యంలోనిది.

గాసొలైన్, ఇక్ష్లన్, షెల్‌టాక్స్.[50] త్రికోణ ప్రేమ తత్వజ్ఞాలు ఎలక్ట్రాన్, న్యూట్రాన్, పీడబ్బ సైక్లోట్రాన్- ఇవన్నీ ఆ యవ్వనాన్ని కదుపుతున్నాయి. చైన్ రియాక్షన్-[51] కార్బన్-హైడ్రోజన్ వొక్కడికి చోటుందా ? ఉందా ? రైట్, ఎక్కుదాం, ఎక్కుతున్నాను. ఎక్కాను. అమ్మయ్య. జాకోబ్స్ లాడర్,[52] నిచ్చెన స్వర్గానికి మెట్లు, రంభ కుచద్వయ శిఖరం-నిలబడి కడ్డీ పట్టు, గుంటా వొదలకూడదు. వొదిలితే, పడి మోకాలుచిప్ప ఊడొస్తుంది' అల్లా వుండేటందుకే ఆ మోకాలుచిప్ప అమర్చబడింది.-[53] పనిమనిషి మోకాలు-అనే జబ్బు-నాగరికత మాట్లాడు తోంది. తురకం, అరవం, నరకం-[54] గుజరాతి లజపతిరాయి, మహారాష్ట్రి వ్యవస్థీకరణ, కన్నడ కొన్ను సముయపు ఆవేదన. తెనుగు నుడికారం పిలక-అమెరికా ముక్కు ధ్వని, అడమళయాళం కేరళసబ్బు-నాగరికతకి వాక్‌శుద్ధి లేదు. భాషా విచ్ఛిన్న సంకర సమీకరణ సంకలనం-నానెత్తి.

వొక్క సమాసం సరిగ్గా రాదు. చిన్నయ్యసూరి పుట్టి చచ్చినందుకు తార్కాణం నా భాషా పరిజ్ఞానం-[55] పిడుగు రామమూర్తికి మారు మోత నా నోట కుంటిధ్వని-స్కూలు మేష్టరు పాగా పాతది-పాగా తీయవయ్యా-దానికింద ? నమస్తే ఎమ్ ఎల్ ఎ జీ-టోపీ తియ్యండి దానికింద ? హల్లో హెడ్‌క్లార్కు హాట్ తియ్యి, దానికింద సిమెంట్ కాంక్రీట్ చప్టా—

గుండ్రని ఎముకకోసం ఆ కాసిని తెల్ల పెండ్రుకల్ని మొక్కు కున్నారా మీరలు ? జేబులో తాంబూళం, పుగాకు జర్దా, లాల్చీవ్యక్తి

50. ఆధునిక భౌతికశాస్త్రంలో విభజింపబడిన సూక్ష్మ పదార్థాం పేర్లు.
51. ఎటామిక్ సిద్ధాంతంలోనిది.
52. క్రైస్తవ పురాణగాథలో "జాకబ్" నిచ్చెన.
53. వ్యాధి పేరు.
54. మాటలు, ధ్వనులు, కలగాపులగం.
55. గిడుగు రామమూర్తి.

కంప్యూనిస్టు- 'అన్ని దేశాలలో పనివాళ్ళు, ఘుమఘుర్లు ఏకంకండి [56] కారల్ హాక్స్ [57] హాచ్-తుమ్ములు సిగరెట్టు కాల్చటానికి సిగ్లేదు ఎంకేత? బస్సు తగలడుతుంది. పాపం పారేశాడు. అదా సిగరెట్- చార్మినారైతే, అదాలో పదో వొంతు-బస్సు తగులడితే భూస్వాముల ప్రపంచంలో కొంత ధనం నశింపు-మంచిదే.

టికెట్-టికెట్-పిక్‌పాకెట్స్-ఛేంజ్? న్యాపా-నయాపైసా మన్యా అడిగింది బస్ ఎదుంగో-క్రాస్‌రోడ్ దిగండి గెట్ఫ్రప్-సీ నెక్కడ దిగాలో చెప్పు. స్టాన్లీ గరల్సు గల్లీ-[58] కె కె. ఇంగువ వాసండి [59] సముద్ర గుప్తుడు వాడేవాడు. టంగ్, టంగ్-కిర్ కిర్-విజిల్. చెవుల డప్పులు బద్ద లవుతాయి. అశోకుడి పక్కనొడి వాడండి-బౌద్ధ సన్యాసులుగా అవుతారు. ప్రక్కన అరవ సోదరుడు సుగమసంగీతం ప్రారంభించాడు. నగుమోము గనులేని? చెంబెయ్యం గుడి టప్పమ్మాళ్ [60] ఉస్తాద్ అల్లావుద్దీన్ రుక్మిణీ దయశంకర్ మొహాలు, సన్నవి, పొట్టివి-ఆధునిక శిల్పకళా మొహాలు- ముక్కుకింద గొయ్యి - అటూఇటూ రెండు గోతులు - అన్నీ కంగలు, గోతులు, మన్యదూలం—బ్రహ్మ చేస్తున్నప్పుడు, బేసిక్ వాల్యూస్ ఇవే-

---

56. కారల్‌మార్క్స్ ప్రచారంలో తెచ్చిన నినాదం అన్ని దేశాలలోని పనివాండ్రు ఏకంకండి.
57. హాక్స్=బూటకం. మార్క్స్‌వాదం - భౌతిక శక్తులు చరిత్రకి వెన్నెముక-అన్నవాళ్ళి చరిత్రకారులు. వీరిలో ముఖ్యులు స్పెంగ్లర్, టాయిస్ బీ.
58. నీళ్లతో నిండిన స్థలం.
59. ఇంగువ ఎడ్వర్‌టైజ్‌మెంట్.
60. చెంబెయ్ వైద్యనాథభాగవతార్, శమ్మంగుడి శ్రీనివాసయ్యర్, శ్రీమతి పట్టమ్మ, అల్లావుద్దీన్‌ఖాన్, శ్రీమతి రుక్మిణి అరుండేల్, ఉదయ శంకర్ - గాయకులు, వర్తకులు, పేర్లకుదింపు.

స్థూలమైన ఆకృతి, అస్థిపంజరం ఎబ్‌స్ట్రాక్టు ఆర్టు[61] అయోమయానికి అతీతమైన చిత్రలేఖనం. పమిటి జారితే కనబడేది ఒకటే రెండోది కనబడదు. [62] ఆ బొమ్మలో రెండోటి లేదు గవర్నర్ గోల్డుమెడల్ అందుకుంది అంటే రెండోది కాదులెండి. [63] పాల్‌క్లి మాక్స్ ఎర్నెస్ట్, పాబ్లో బాబో పీకి పిసుకో—చాగల్లు ఛఛ-మార్క్-చాగల్-జైమినీ భారతం రోయ్! [64] గగుర్పాటుకి రోమాలు లేచి నుంచుంటాయి. బాల్డుహెడ్ అయితేనో? రోమ్‌లో వొక చిత్రకారుణ్ని వొకాయన అడిగాడట. 'నీ బొమ్మలు యింత అందంగా వుంటాయి-నీ సంతానం అంత వికృతంగా వుంటారేం?'

"సంతానం చీకట్లో సృష్టి - బొమ్మలు వెలుగులో" వింత వింత ధ్వనులు-దుస్తులు రేయాన్, నైలాన్, ఐరిష్‌లినెన్-[65] సిల్క్‌ట్రాన్-[66]

---

61. ప్రకృతికి అతీతమైన ఆధునిక కళ - శిల్పాలు, చిత్రపటాలు - వాటి వర్ణన. ప్రకృతిలోను ప్రధానమైన ఆకృతిని తెలుసుకుని చిత్రించాలి అని ఆదర్శం-గణితశాస్త్రంలోని సున్నాలు, కోణాలు, చదరాలు. అన్ని వొస్తువులనూ యీ స్వరూపాలతో ముడి పెట్టొచ్చు.
62. ప్రక్కకి తిరిగినప్పుడు కనబడేది ఒకటే.
63. గోల్డుమెడల్ ఆ కనబడని రెండోదానికి కాదు, చిత్రానికి అని.
64. ఆధునిక చిత్రకారులు, పాల్ క్లి మాక్స్ ఎర్నెస్టు, పాబ్లోపికాసో (బాబో ఎందుకంటే, యీయన రోజ్ పిరిడ్‌లో ఎక్కువగా ఎరుపు రంగులు వాడాడు)

    పీకి పిసుకో-ఫిఢీశ్వం-వొస్తువు చాగల్లు-చాగల్ (చిత్రకారుడు) జెమినీరాయ్ చిత్రకారుడు.
65. ఐర్లండ్ దేశంలో తయారైన బట్ట.
66. సిల్క్+సైల్లా స్ట్రైన్.

హాండు లూమ్-[67] షిఫాన్-జార్జి సిక్స్‌తెట్టి[68] వెల్‌వెట్ వివియన్ లై బ్యూటీ-[69] ఇద్దరు వస్త్రధారీమురారీ. మోకాలు దాటగలదా ? [70]అది గడియారాల బుష్షర్టు- [71]అజ్‌టెక్.

నాగరికత చిహ్నాలు పాములు—ఆ పాముల బుష్‌కోటి, వాడి తెల్ల గడ్డం దశరథుడు - వీడి జుట్టు, వాల్మీకి జడ - లాలాజీ లాంగ్రీ నుంచి వచ్చిన ఆ లా కాలేజి విద్యార్థి పైలామ్యాం చూడండి. మరి వీడో - వీడి చేతిలో బాగ్ - ఎంతలావో - బాగ్ కాదు. ఎంతలావంటే - వాడి నీడ ఆ లాకాలేజి పిల్లాడిమీద పడిందంటె ఆ పిల్లాడు క్షణంలో చస్తాడు-ఆ బాగ్‌లో నోట్లు - నోట్లు-ఎన్నో ? [72] నగరాజు ధరలు నేడూ-ఇన్‌ఫ్లేషను స్పైరల్-[73]వంకరలు తిరిగే మెట్లు-ముసిరి-[74] పిలకూడుతుందిరా-మళ్ళా నిలిచింది. పుట్టడం, కదలడం, విజృంభించటం, చిక్కటం చీలటం, విధ్వంసం కావడం- అది నాగరికత చరిత్ర అంటాడు స్పెంగ్లర్ [75]మళ్ళా విజిల్- మళ్ళా కదులుతుంది. బాబోయ్-అంతలావే, ఆడాళ్ళు అంత లావుగా ఎలా వుంటారండి- మళ్ళా ఎప్పటికప్పుడు. కండ, మాంసం,

---

67. హేండ్ లూమ్.
68. జార్జెట్.
69. వెల్వెట్
విలియంలే—ఫిలింతార
70. మీరజాలగలడా సత్యాపతి—పాటపరస
71. అజ్‌టెక్-వొక ప్రాచీన నాగరికత, కోతులు, పాములు పిట్టలు, శిథిలాల చిహ్నాలు —కొన్ని బుష్‌కోట్లపై యీ రకం చిత్రాలుంటాయి.
72. నగుమోము గనలేని—త్యాగరాజు కృతిలో చరణం
73. అర్థిక శాస్త్రంలో—కొనుగోలు శక్తి క్రమంగా తగ్గడం
74. ముసిరి సుబ్రహ్మణ్య అయ్యర్—సంగీత విద్వాంసుడు
75. చరిత్రకారుడు స్పెంగ్లర్ సిద్ధాంతం

రక్తం పిల్లలకి పంచిపెట్టేసిం తర్వాత యింకా అంతమిగిలితే పిల్లలే లేకపోతే యింకా ఎంత లావుగా వుందురో— ఫెదర్ వైట్ ఛాంపియానెస్-[76]నా కొక అపూర్వమైన వైజ్ఞాని కానుభవం లభ్యం కాలేదు. నాకంటె తెలివయినవారికి, చరిత్ర కథలో ఒకలయ క్రమం, పద్ధతి, ఆకృతి, కనుపించాయి కాసించబడిన ఈ నాదం, నాకు వినబడలేదు కెరటాన్ని మరో కెరటం తరుముకొచ్చినట్లుగా వొక అవాంతరం మరో అవాంతరాన్ని తరిమింది-ప్రతి సంఘటన-ప్రతి ఫలితం వొక ప్రమాదం-ప్రమాదాలనుండి జనించిన పరిణామం మానవ చరిత్ర" [77]ఫిషర్‌గారి వుపోద్ఘాతం. "కొట్టుకుపోయే పడవ ఆదీ పురుషుడు టావో. ఇటు పోతుంది. అటు పోతుంది" టావోటీకింగ్ [78].

ముప్పయినాలుగో, అధ్యాయం, ఆడవొస్తే నే నెందుకులేవాలి? సమాన హక్కులు, ఆస్తిలో వాటా, ఇప్పుడు ఆస్తుల కోసం అన్నదమ్ముల కొట్లాటలు, మరి రేపో? అక్కయ్యల ఆధ్వర్యం మెయిడ్ ఆఫ్ మేట్రియార్కీ-[79]ఇన్నాళ్ళు ఆమె పెదవుల చిరునగవు కోసం వేచిన వేమన్న, ఈనాడు ఆమె మెళ్ళో పూసల పేరులోంచి చర్మం వేడికి ఊడిపడితే, ఏరుకు అమ్ముకు తింటాడు. ఇదే ఏరువాకా సాగాలోయ్ అంటె నాకేం చూడనట్లు నటిస్తాను అందరూ అంతే. భారతదేశంలో స్త్రీకి అంత గౌరవముంది.

గార్గి భార్గవి, తైత్తిరేయ ఉపనిషత్తు బండారినాయికా [80]వోర్ వెర్రివాడా-బ్రహదారుణ్యకరా-నోరు తిరగదు? సంస్కృత పాఠాలతో

---

76. స్త్రీఫహల్‌మాన్

77. హెచ్. ఎ. ఎల్. పిషర్. ఆంగ్ల చరిత్రకారుడు స్పెంగ్లర్ సిద్ధాంతాన్ని ఖండిస్తూ వ్రాసినది

78. చైనాదేశపు గేయంలో భాగం

79. సంసారానికి మూలం స్త్రీ గనక, సంఘ సంక్షేమం స్త్రీల ఆధ్వర్యం పై ఆధారపడుతుంది- హిందుకోడ్‌బిల్ ఫలితాల జోస్యం,

80. ఉపనిషత్తుపేరు వక్రింపు,

పట్నాడగొట్టుకో—ఈశోపనిషత్తు-కథోప భవిష్యత్తుత్వం, ఓం, తత్వమసి చేసెయ్యి: బస్సు కదుల్తోందా-వొక్కడూ దిగడు అంతా ఎక్కేవారే-దిగే వారులేరు, ఆ ముసలాడుచావగానే ఎగడతారు డజనుమంది. ఆ వల్కనైజ్‌డు టీసెట్‌లోకి [81]జగమేలే-శమ్మంగుడి-ఇంటర్వ్యూ-లోపలి లీల దర్శనం లిబిడో-[82] ఫ్రాయిడియన్ ట్రవుమా. "గిరిషన్ బలే పసందయిన పిల్ల—ఆమె రిష్యన్ నేత్రం కింద పెద్దదిగా కనబడడానికి గేట్లున్నాయి జాబ్బా తొలిగిస్తే, స్నేహపూర్వకమైన ఆమె స్థనాల మధ్య న్యూమోనియా మహదానందం వాగ్దానం వుంది"[83]-ఎలియట్‌గారి అమరత్వపు గుసగుసలు, (Whispors of Immortality) గిరిషన్ రష్యన్‌కన్య. పిల్ల కన్యకి తల్లి.[84] శంకర్స్ సిక్లి [85] జరిపిన అంతర్జాతీయ బాలిక చిత్రకళ పోటీలో ప్రెసిడెంటుగారి రేడియం మెడలు అందుకుంది.

మరి నాకో? చాలాకాలం నిరుద్యోగిగా వున్నందుకూ, అనేక ఇంటర్‌వ్యూలలో పాల్గొన్నందుకూ, హెవియం వోరియం [86] మెడలు

81. సీట్‌ట్‌లోకి-టీసెట్‌కింద ధ్వని కుదింపు (స్ఫూనరిజమ్)

82. లిబిడో— మనస్సులో అధోలోకం, రహస్యమైన ఆలోచనల మందిరాలు ట్రస్‌మా- మానసిక వ్యాధిమూలం.
బాల్యంలో హింసకు గురైన మనస్సు, ఎదిగింతర్వాత ప్రవర్తన లోని వైక్లబ్యానికి కారణం అని ఫ్రాయిడ్ సిద్ధాంతం. సెక్స్ జీవితంపై యీ హింస ప్రాబల్యం ఎక్కువగా కనబడుతుంది.

83. సారస్వతానికి నోబెల్ బహుమానం పొందిన ప్రసిద్ధ ఆంగ్లకవి విమర్శకుడు, టి. యస్. యెలియట్ పద్యానికి అనువాదం

84. పసివాడు యెదిగిన మనిషికి తండ్రి-వర్డ్స్‌వర్తకవి నిర్వచనం స్త్రీకి అన్వయింపచేశాడన్నమాట.

85. శంకర్స్ వీక్లి అనడం బదులు, అదీ చదివినవాళ్ళు 'సిక్లిగా' (నీర్గసంగా) మారతారని ధ్వనికాబోలు

86. లోహాలు, (అరుదు)

మేడమ్ క్యూరియం [87]తో పంచుకుంటాను. లేకపోతే ఇంటర్‌వ్యూట, "ఇంటీరియర్" అంటే లోపలి—వ్యూ అంటే దృశ్యం-నీ లోపల ఏముందో వాడు ఎలా చూస్తాడు? నా ఆత్మ ఎక్కడుంది? కాలర్, టై, కోటు; చొక్కా, బనియన్ నాగరకత నాకు తగిలించిన శృంఖలాలు. వాటిని విప్పితే, కత్తిర మార్కు-గుండె. [88] బంగారు కణికి ఉడిపి కాఫీ లంగ్—అచ్-హెచ్ హోచ్ [89] ఆమె చీరకి తగిలించిన బ్రూచ్. ఇటాలియన్ వేదాంతి. బెనిడట్టో క్రోచ్ [90] లారెల్ హర్డీ హరల్ హోచ్ [91] షణ్ముగం ముక్కుపొడా, చంపావు. ఇంకా ప్రొబేషన్ పూర్తి కాలేదు. మార్చి, సెప్టెంబరు, మార్చి, మైడియర్ మధు షూటింగు మొన్ననే మొదలెట్టాము. జింకార్ బెట్ [92] ప్రారంభోత్సవం చేశాడు. కొమవోన్ కొండలు సప్తరంగుల చిత్రం, [93] టైం ఎంతండి? ఝంగ్ ఝంగ్ హమ్. [94] అలారం టైమ్‌పీస్. అల్లునికి బరంపురం ట్రాన్సుఫర్. ఒక్కమాట తెలియదు. ఎవడి గొడవ వాడిదే. పంచవర్ష ప్రణాళిక పంచశీల, పంచరత్నాలు పంచ

---

87. క్యూరీ-రేడియం కనుగొన్నది

88. సిజర్ సిగరెట్

89. తుమ్ములు—లయకోసం అర్థంలేని ధ్వనులు

90. క్రోచీ—ఇటాలియన్ తత్వజ్ఞుడు

91. హాల్‌రోచ్ కంపెనీలో లారెల్ హార్డిలు (హాస్యనటులు) పని చేస్తున్నారు

92. ఫిలిం షూటింగ్
"షూటింగ్" అంటే పెటాడటం అనే అర్థంకూడా వుంది. జిమ్ కార్బెట్. ప్రసిద్ధ పులి వేటగాడు

93. సూర్యరశ్మిలో ఏడు రంగులుంటాయి

94. జంఘామ్—కంపెనీవారి అలారమ్ గడియారం

పాండవులు-పంచమూత్రం సీరకాయ పంచి నే నెవర్ని ? ఎక్కడి కెడుతున్నాను? 'నీవు ఎవ్వరవో తెలుసుకో' అదే సర్వతత్వాల సారం-సారో[95]

తెలిసింది నేను పలాన ఇంటర్వ్యూకి వెడుతున్నా సెక్రటేరియట్‌లో దిగుతున్నా గోకింది ఆమె కాలు అయినా కాలు నా స్వంతమే....[96] నా పాతదే. ఊడిపోలేదు. పక్కన నుంచుంది పాపం సీటులేక ఈ పిల్ల కూర్చోమంటే పాపం !

ఆమె తాలూకు ఎవడయినా వుంటే చావతంతాడు ధైర్యం చేసింది, వాడ్ని తోసికూర్చుంది.

లక్ష్మిబాయి[97] ఆఫ్ ది బస్.

తోటకూర [98]సబ్బువాసన ప్రక్కల నిలబడి. అళత్తూరు సోదరుడు. [99]అబ్బా అపవయ్యా-క్షమించండి.

గాడిద అని అర్థం వచ్చే రెండు అక్షరాల మాటకావాలి. క్రాసువర్డ్ పజిల్ కడుతున్నాను.

నేనే అవుతె ఆ మాట చివరిదే[100] క్రాసువర్డు సంభాషణ. హల్లో మంచి చెడ్డలలో మంచిది సాయంత్రానికి వ్యతిరేకం. గుడ్ మార్నింగ్, సైన్సు కనుక్కొన్న పాత ఆధునిక వింత. వెదతాకి వ్యతిరేకం. 'సినిమాకి వస్తారా ?' అలాగే క్రాసువర్డు ప్రేమ, ఓనా. నాలుగు పెదవులు కలిస్తే సింహాసనము మీద కూర్చున్న ఒక *

95. సారో-విచారం 'సారం'గా మార్చబడింది
96. ఎవరికాలో గోకేడు
97. ఝాన్సీలక్ష్మిబాయ్
98. కూటికూర సబ్బు
99. అళత్తూర్ సోదరుల పాటకచ్చేరి రేడియోలో వినబడుతోంది ప్రక్కల నిలబడి—కృతి
100. గాదిద అని అర్థం వాచ్చే రెంతక్షరాలమాట 'నేనే'

'అహం' నీ-అనురాగానికి మరో పేరులెండి-ంచు[101] చున్నావా. ఇవి మర్చిపోవాలి. రెండు చేతులూ బిగించి కూర్చోవాలి. గుప్పిడి విప్పితే ఏమీలేదు. హరిశ్చంద్రుడు అన్నట్లు అంతే జీవితం. తమిళ సోదరుడు కదిలాడు నేనేమ చేసేదిరా నా రామ.

ఇదిగో నా పర్సు 'ఏమండోయి సత్యనారాయణగారు ఎప్పుడు రావటం' 'ఏం ఇలా వచ్చారు ?' ఆయన కనుబొమ్మలు చిట్లిస్తూ న్నాడు. 'తమ రెవరు ?' 'అప్పుడే మర్చిపోయారు ?' 'నేను ఏక లవ్యుణ్ణి. లోహిదాసుణ్ని మీ దగ్గిర చదువుకున్నాను.' 'ఓరి ఖత్రా వారి నీవటోయ్ ! సినిమాలో మనకో చిన్ని వేషం వుందిలే. పక్క రోలు-' 'అఖరికి మీరు ఇందులో దిగారు ?' 'అంటె నీ అభిప్రాయం ?' చెంపాలపు వాసన బొంబాయి అందమయిన పట్నాలలో ఒకటి—

విశాలమయిన రోడ్లు. అందమయిన భవనాలు. ఒక్కొక్క భవనంలో ఒక చిన్న పట్నంలో వున్నంత ప్రజ. మధ్య చీరల తెరలు కట్టుకొని, తెరవెనకాల ఆకుటుంబాల భాగవతాలు[102] అంద మయిన పార్కులు జూహూబీచ్ బ్రైటన్ని మరిపిస్తుంది అంటాడు. హక్స్లే.[103] హక్స్లేకి ఏమి తెలుసు ? మిస్ పరిమళ చంద్ర సర్కారుతో డయిమ్లర్[104] లో బీచ్‌వొడ్డు షికారు వెళ్ళి ఎన్ని అయినా వ్రాయవచ్చు.

---

101. "అహం"ని ప్రేమించు—లో 'ప్రేమ' అనేమాట "అనురాగం"గా పైవాక్యంలో వుండిపోవడంవల్ల 'ంచు, మాత్రం మిగిలింది నన్ను ప్రేమించుచున్నావా ? అని తాత్పర్యం.

102. బొంబాయి పట్నంలో ఇల్లు యిబ్బంది. వొక్కగదిలో రెండు మూడు కాపరాలవారి అవస్థలు

103. ఆల్డస్ హక్స్లే-రచయిత, "జెస్టింగ్ పైలేట్" అనే యాత్ర గ్రంథంలోనిది.

104. వెహికల్-మోటారుకారు పేరు

ఈ కంరక్షక వుద్యోగం చెయ్యమంటే బాగుండును.

టక్! ఆగింది బస్సు-అబ్బ కాలితొక్కావయ్యా! ఆ జడ ఆ కాళ్ళు ఎవ్వరివో! చేతులు, బుజాలు, వెన్నులు, తలలు, టోపీలు ఈ వెటింగ్ ఇన్ ప్యారిస్,[105] కోటి, పాంపియా చచ్చిన చేప వాసనలు నలిగాను.

మూలిగాను. చచ్చాను.

అమ్మ బయటపడ్డాను. టిక్కెట్టు టిక్కెట్టు నేను శవాన్ని పరలోకానికే టిక్కెట్టు.

"జేబులో చేయిపెట్టి లాగు కడ్డీ వదిలితే కూలుతాను. చిక్కిపోయిన సెకండ్‌హేండ్ సిగరెట్టు కళేబరం

"ఏయ్ జేబులో చెయ్యేతీ" ఎక్స్‌క్యూజ్‌మి! నా జేబు అనుకున్నా "వుండవయ్యా ఇస్తాను చిల్లర" పదమూడు నయాపైసలు సెక్రటేరీయట్‌లో అవు. ఆ కుర్రాడు నీళ్ళు చేస్తున్నాడు. ఓరి సింద్రి ఫ్యాక్టరీ!

అహహా, నవ్వులు ఈలలు బయటికి ఊడిపడిన భావపరంపరలు మృతరోదనలు—

"నీవు పరీక్ష ప్యాసై రెండేళ్ళయింది. ఈ రెండేళ్లు ఏం చేస్తున్నావు?' "ఎప్పుడు పొట్టకోసరం ఏదో చేస్తువుండడము జంతువుల లక్షణం- పొట్టనిండిన తర్వాత ఏమీ చేయకుండావుంటేనే మానవుడి ఔన్నత్యం బయటపడుతుంది" జె. బి. యస్. హాల్డేన్ వర్జీనియా వుల్ఫ్ విషం త్రాగి చచ్చింది[106]. 'సంఘాన్ని వుద్ధరిస్తూన్నా సార్ 'ఏ విధంగా?' నేను ఊరికే కూర్చుండటం వల్ల నేను చేయగలపని మరొకడు చేసి బాగుపడుతున్నాడు. అది నా త్యాగం. ఇలాంటి వంటె దొరకి కోపంరావచ్చు "ప్రేమిస్తున్నాసార్ "అమ్మో! తక్షణం గెటవుట్ అంటాడు. కాని అది నిజం-నిజం చెబితే ఎవడికీ నచ్చనూ నచ్చదు. నమ్మనూ నమ్మడు—

105. పరిమళాల పేర్లు

106. వర్జీనియా వుల్ఫ్-నవలా రచయిత్రి. ఆత్మహత్య చేసుకుంది

'ఓ స్త్రీకోసం మహా కష్టాలు పడుతున్నాసార్-' యవ్వనం అనుభవించవలసిన సమయంలో యువకుణ్ని విద్య పేరు చెప్పి నాలుగు గోడల మధ్యా బంధించి వాడి సంతోషానికి సంబంధంలేని పుస్తకానికి కట్టేసి- వాడు తీరా కృతార్థుడైన తరువాత వాడికి నిరుద్యోగని నామకరణం చేసి హింసించడం విషాదకరమైన విషయం- నాకు ఉద్యోగం లేకుండా చెయ్యడం సంఘం లోపం.

ఆ సంఘ నిర్మాతలలో మీరొకరు.

నాకు ఉద్యోగం లేదు. దైవభక్తిలేదు. మతంలేదు. ఎస్. వి.వి.[107] అన్నట్లు దరఖాస్తుతో జందెంకూడ సంపుకున్నాను. నీతినియమాలులేవు. ప్రేమలేదు పెళ్ళిలేదు. నా స్థితికి కారణం మీరు. మిమ్మల్ని ఈ చేతకాని ఉద్యోగానికి రాజీనామా యిమ్మంటా. భలే లాజిక్. బ్రాడ్లెహాడలి చస్తాడు[108] ఇందులో వొక్క విషయం వాడిముందు మాట్లాడగలనా ?

అమ్మ బస్సు ఖాళీ అయింది, కాని సిగరెట్ తాగటానికి వీలు లేదు. సిగరెట్ వీలులేదు.[109] వెర్మూత్ వీలులేదు. డ్రైమార్టినీ వీలులేదు. తెల్లగుర్రం స్కాచ్ విస్కీ అసలే వీల్లేదు రెండో పెళ్ళాం పనికిరాదు. అన్నీ నిషేధాలు. వాక్ స్వాతంత్ర్యము కోసము మిల్టన్ ఎరియోపెజిటికా వ్రాశాడు.[110] రెండో పెళ్ళాం కోసం డైవోర్స్

107. తమిళహాస్య రచయిత యస్. వి. వి. ఒక ఆంగ్ల వ్యాసంలో అట్లా వ్రాశాడు.

108. ఎఫ్. హెచ్. బ్రాడ్లే-తత్వజ్ఞుడు. తర్కశాస్త్ర పండితుడు

109. పానీయం (వైన్) పేర్లు

110. భార్యనుండి ఎడబాటు సమర్థిస్తూ విడాకుల అవశ్యకతని గూర్చి గ్రంథం వ్రాశాడు మిల్టన్ కవి. పార్లమెంటువారు ప్రచురించే అనుమతి ఇవ్వలేదు. వాక్స్వాతంత్ర్యం-అవశ్యకతను—గూర్చి, 'ఎరియో పెజెటికా' అనే గ్రంథంలో వ్రాశాడు.

గురించి వ్రాశాడు. వస్తుంది వస్తాం ఫాకీసీపర్ 'అవ్వాంఛిస్సు' షాలిమార్ బీడీ కాలుస్తూ కండక్టరు ఉగాడు. నా అవసా కిటోక్కుడు ఎక్కువకు సౌందర్యాలకి.

మా అజంతా బౌద్ధత్వం అభిరిస్తూట. షాలీమార్ బీడి క్యాలండర్ బొమ్మయి అవతరించాడు.

ఓహో కొత్త పిట్ట చక్కా వస్తుంది. ఈ ఆలోచనలు మహా పాపం-కాని పాపి కాని వాడెవరు ? "సకర్ద-గుజేదర్జః కీస్తువెగో అంకున్ కేగుజా నకూర్దుచంద్ జీస్తువెగో.[111] ఎక్కడ కెడుతుందో "మీ పేరు" "మీ వయసు" 1857 మే 10, శకజేష్ఠ చిత్రవిశాఖ[112] ఈ పది చపాతీలు తీసుకెళ్లు[113] "శర్మాన్ సింగు" తాంతీయాతోపేకి[114] తెల్లచపాతీ లిష్టం. అమెటో "ఏపియన్ లే" తాలూకు యవ్వనం ప్లస్ మెరిలిన్ మన్రో[115] మాజీక్ అది గుల్లారాంషాప్‌లో జార్జెట్.

---

111. ఒమార్ ఖయ్యామ్ రుబాయత్

112. కొత్త పంచాంగం తపిసీఖ

113. సిపాయిల తిరుగుబాటు, 1857 మే 10న ప్రారంభమైంది. ఆ రోజుల్లోనే, సైనికులు, ఇతరులు కూడ చపాతీలు పంచి పెట్టేవారట-నాలుగు చపాతీలు వొకరి చేతులో పెట్టి, ఫలానా వారి కిమ్మని పంపేవారట-తిరుగుబాటుకి సిద్ధంకండని సంజ్ఞచెయ్యడం అని కొందరిభావం. పది చపాతీలైన, పదవ తేదీనని. చపాతీల లోపల ఏదో చీటి వుంటుందని, మరికొందరు. తిరుగుబాటుకి, చపాతీలకి సంబంధం లేదనీ, అల్లా పంచి పెట్టడం అప్పుడప్పుడు జరుగుతూ వుండేదని ఆర్.సి. మజుందారు వ్రాస్తాడు.

114. తాంతియాతోపే—1857 స్వాతంత్ర్య సమరంలో ప్రముఖపాత్ర వహించిన వారిలో వొకడు

115. ఫిలిం తార

పల్చగా నల్లగా శరీరంలో గీతలు గంతలు, వంకరలు మెలికలు, యిప్స్టీన్ నగ్న శిల్పం[116] లా, హెన్రీమూర్[117] వృద్ధ కన్యలా అన్నీ కన్పిస్తున్నాయి.

[118] [జే స్యూయిస్ రోం లీరాయ్ డూన్ పేన్. 'ప్లూవియోరిచే' మైస్, యింప్యూయిసాన్, జ్యూనే, యెట్ పూర్టాంట్ ట్రావియో క్వీడి సేస్ ప్రిసెప్టూయార్స్ మి ప్రిసాన్ట్లే కూర్బెట్స్. సేన్యూవిలవెక్ సేచీయన్స్ కొం యెవెక్డాత్రెబీత్స్]

ఫ్రెంచి భాషలో నేనాలోచిస్తే మరేం పాపంలేదు. వాడిమీద పగ తీర్చుకోవాలంటె వొకటే మార్గం. వాడి ముందు విషం తాగి చావటం.

వాడే చంపాడని వాడి నరస్టు చేస్తారు. పోలీసు కేసు మార్జెరీ అలింగ్[119] హామ్ మొగుడు భూమి త్రవ్వి ప్రాచీన నాగరికతను బయటపెదుతూంటె ఈమె ఖూనీచేసి పాతేస్తూ వుంటుంది. ఎవడు చంపాడో చివరికి కాని తెలియదు. ఇనుపకడ్డీలు-జైలు-పీదవాడిని ఆకలి దాహం బంధిస్తాయి. ధనికుడ్ని వివిధ స్త్రీల హస్తాలు, అన్నీ కడ్డీలు, ఆ నాజూకు ఆ అమాయకత్వం యెక్కడా చూడలేం గాలిపటంలా

116. ఇన్స్టీన్—శిల్పి 'రాత్రి' అనేది ప్రసిద్ధశిల్పం
117. హెన్రీమూర్—శిల్పి. ఈయన స్త్రీ శిల్పాలలో అన్నీ కంతలే
118. ఛార్లెస్ బాడిలేర్-ఫ్రాన్స్ దేశపు 'కపి' అనే కావ్యంలో వొక భాగం. అర్థం=వర్షసామ్రాజ్యానికి చక్రవర్తిలాంటి వాడిని నేను—ధనం వుంది కాని సత్తువ లేదు; యువకుణ్ణి కాని వార్ధక్యం సంక్రమించింది. పాఠాలు చెప్పే గురువుల్ని కాదని, కుక్కపిల్లలతో ఆడుకుంటాను.
119. మార్జెరి అలింగామ్—అపరాధ పరిశోధక నవలా రచయిత్రి. భూమి త్రవ్వి ప్రాచీన నాగరికతని బయట పెడుతూన్నది ఆమె భర్తకాదు-అగాతా క్రిస్టీ భర్త.

కొట్టుకుపోయి మేఘాలు డీకొన్న వెలుగులో మాయమై విప్పారుకున్న చంచలమైన చూపులు మదుని బారినుండి దూకులు భవభూతి గుండెలు కొట్టుకుంటాడు. దంతపు సీసాలాంటి కంఠం—రవికె కోణంగా మడతద్ద చోట తళతళ పదునయిన మొనమెరుపు. లారెన్సు[120] జుట్టు పీక్కుంటాడు. మానవుడి బుద్ధికి లొంగని ఆ పికాసో[121] పెదవులు రష్యన్ విప్లవంతో వణికిపోతాయి.

క్లెయివ్‌బెల్[122] కేదార రాగంలో యేడవాలి, పెండ్లాం ఒకటి తగులడింది గాని లేకపోతే ఆ వ్యక్తిని హెమింగువే[123] సముద్రంలో ముసలాడిలా [124] పారలెల్ దాటి హిమాలయా పర్వత ప్రాంతాలకి లేవదీసుకుపోదును.

పెండ్లామున్నవాడికి పరస్త్రీ అంటే ఎందుకంత భయం సిగ్గు. చేతకానితనం మర్యాద ? ఏ స్త్రీని చూసినా మొదటవచ్చే ఆలోచన ఇది-ఈమె ఏ దౌర్భాగ్యుడి హస్తాలలో నలిగి హతమౌతుందా-అని వాళ్ళ పెదాలకిపట్టిన తుప్పును రాసి ఉక్కు కడ్డీలక్రింద మార్చి ఎండిపోయిన ఎముకముక్క క్రింద చేస్తారు ఆ గుండ్రని ఎముకలను అర్జించటము ఈ ఎముక ముక్కలను ఏరుకుని చప్పరించడానికి యివే ఆలోచనలు. ఫ్రాయిడ్ ఎలా కనుక్కున్నాడో? అన్యకాంతలు తల్లులు, అని ముఖారి

---

120. లారెన్సు-ఆంగ్ల నవలా రచయిత అంతరంగికమైన 'సెక్స్' అనుభూతులను అతిశక్తివంతమైన శైలిలో చర్చిస్తాడు.
121. పికాసో-ఆధునిక చిత్రకారుడు లావణ్యాన్ని వికృతంగా చిత్రిస్తే గాని, చూసేవారిని ఆకర్షించదంటాడు.
122. క్లైవ్‌బెల్-'నాగరికత' అనే గ్రంథం వ్రాశాడు.
123. హెమింగ్వే-అమెరికా దేశపు నవలా రచయిత-'ది వోల్డ్‌మాన్ ఎండ్ ది సి'-[వృద్ధుడు-సముద్రం] అనే నవల వ్రాశాడు.
124. క్షోరియా విభజనని సూచించే గుర్తు

రాగంలో నాలుగున్నరలో ఏడ్చిన నటుడు[125] దొంగ వస్సుమోరు కొట్టిన ప్రేక్షకులు భగ్గులు[126].

ఈమెని ఇంటర్వ్యూకి పంపిస్తే-అంతరంగికాన్ని కళ్ళతో దర్శిస్తాడు ఉద్యోగానికి-సూయజ్ సమస్య-పై రాజీనామా ఇచ్చి ఈమెకి చాకిరి.

నైలు రాణి. క్లియో పాత్రా ముక్కు మరింత పొడుగు అయివుంటె ప్రపంచ చరిత్ర మరోలా వుండేది[127].

ఆ మెడికా మేన్యువల్ తీసింది. సంచిలోంచి పాయిజన్ గొట్టాలు తీసింది. థర్మామీటరు గుండెలకానించి వినే ధ్వని బైస్కోపు.[128] ఆ, తెలిసింది. మెడికల్ కాలేజిలో చదువుకొంటున్న కన్య రెండువేలు అడ్వాన్సుఇచ్చి సీటు, కానీ జాలి వేస్తుంది. ఏం బ్రతుకు.

ఆ సుకుమార[129] నందలాల్ బోస్ హస్తాంతో జైమినీరాయ్ కళ్ళ అద్దాలతో [130] ఆ కప్పల్ని ఆ మాంసముద్దని ఛ,ఛ— చాగాల్[131] డోకు వస్తుంది.

అదంతా చూసి తన జన్మలో పిల్లల్ని కనదు. కాని త్రయంగాళ్ళ[132] డార్విన్, లామార్క్, బఫూనాగాళ్ల-స్వంతంకాదు షాదీ—

---

125. సక్కుబాయి నాటకంలో పద్యం
126. పందొమ్మిదవ శతాబ్దంలో దారుణాలు చేసిన దుండగీడులు
127. క్లియోపాత్రారాణిని గురించి 'పాస్కల్' అన్నది
128. స్టెతోస్కోప్
129. వంగ చిత్రకారుడు చాగల్
130. జైమినీరాయ్ చిత్రాలలో స్త్రీల కళ్ళు పెద్దవి
131. చిత్రకారుడు చాగల్
132. డార్విన్, లామార్క్, బఫ్ఫన్-జీవశాస్త్రజ్ఞులు, పరిణామవాదాన్ని నిర్వచించారు 'బఫ్ఫన్'ని బెర్నార్డ్షా 'బఫూన్' అన్నాడు ఛలోక్తిగా.

పరిణామవాదం ఊరుకుంటుందా ? ఎక్కడున్నా ఏ పని చేసినా ఏ వికారం చూసినా అన్నీ మాతృత్వం కోసమే 133-134 సంతాలాలు.

నాయనా-అదిగో సెక్రటరియట్. దివాని ఖాసు, దవాఖానా, కప్పుమీద బురుజుగడియారం డజనుమనుష్లు. ఈ భూప్రపంచంలో ఎవడయినా దాన్ని చూసి టైము ఎంతైందో చెప్తే రాకెట్లో చంద్రగోళానికి ఫ్రీరైడ్ మిస్ డీకల్[135] రిస్టువాచి చూసుకుంటుంది నల్లటి నైలాను స్ట్రిప్ గోల్డువాచి. సామ్యుఎల్ గోల్డువిన్ చిత్రకథలు[136] భూకంపముతో ప్రారంభమై పరాకాష్ఠ నందుకొనే చిత్రం కావాలి-

మ్యాటర్‌లింక్, రాసిన ఒక నాటకాన్ని సినిమాకోసం మూడు నెలలు కష్టపడి అనుసరించి వ్రాసి తెప్పించాడు. ఒక గంటలో అంతా చదివి "ఓ నా దేవుడా ఇందులో కథానాయకుడు కందిరీగ[137] మెళ్ళో నల్లటితాడు గొలుసు. నల్లటి దొమ్మజోళ్ళ "షాలిషు వేస్తాము మిస్" స్టడీ ఇన్ బ్లాక్ రాయ చౌదరిని[138] రప్పించి ఈమెను మోడల్‌గా నించో పెట్టి చీకటి అనే చిత్రం చెక్కమంటే బాగుండును.

---

133. హెన్రీబెర్గసన్ ఫ్రెంచితత్వ శాస్త్రజ్ఞుడు అన్నది

134. మధ్యలో సంతాల్ స్త్రీలు జ్ఞప్తికొచ్చారు. సొంతంకాదు లయకోసం కాబోలు

135. మెడికో, మెడికల్-కలసి డీకల్‌గా క్లుప్తీకరణ

136. స్యామ్యుఎల్ గోల్డ్‌విన్-ఫిలిం దర్శకుడు-అతని వింత భావాలా భాషని గురించి ఎన్నోకథలు ప్రచారంలో కొచ్చాయి. వీటిని "గోల్ వినిసమ్" అంటున్నారు.

చిత్రం భూకంపంతో ప్రారంభమైతే క్లైమాక్సు తరవాత రావడం అసంభవం.

137. ఇదొక కథ మాటర్ లింక్-నోబెల్ బహుమానం పొందిన బెల్జియమ్ దేశపురచయిత. కీటకాలను గురించి వ్యాసాలు వ్రాశాడు, వాటిలో ఒకటి కందిరీగను గురించి

138. వంగ చిత్రకారుడు, శిల్పి.

వేదాంతం ఈ మిథ్యాస్వప్నాలు. "ఇరాదుఃస్వప్నలోకంసువ" అన్నాడుగా వేదఋషి[139] అనెరనెరే అన్తే బాయి- డ్రాం-డీం—ట్రూం-ఠంగ్-ఠంగ్-ఠ్లాంగు-గ్రిర్-జెజె-వచ్చాడు.

హాండిల్ బారు ముక్కలయింది.

మడ్‌గార్డు చక్రంలో ఇరుక్కుంది.

లాగండి-ఆస్పత్రిలోకి లాగండి. నెత్తురు.

నననన త్రిత్తురు-పళ్ళూడాయి.

స్త్రీలకి మొగాళ్ళకంటే తక్కువ పళ్ళు వుంటాయన్నాడు. అమాయకుడు అరిస్టాటిల్ 140 మళ్ళీ రెండుసార్లు పెళ్ళిచేసుకొన్నాడు పెళ్ళాంనోరు తెరవమని, లెక్కపెడితే తేలిపోనుగా, ఈ విధంగా మూఢాచారాలు గ్రుడ్డి నమ్మకాలు బయలుదేరాయి. 141

తప్పు. సైకిలువాడిదేనండి కుడివైపుని వెడితే యేమవుతుంది. ఆ! బస్సువాడు హారను వెయ్యొద్దండి ? వేశాడు. అన్ని బస్సులు ఒకే ధ్వనిగా.

ఎదురుగుండా వస్తున్న బస్సు ధనుకుని దీనిక్రింద పడ్డాడు. పాపం యెవడో ? నీపేరు ? "వేలాయుధం" అంటే కత్తి అన్నమాట. 'నేను శాంతి నెలకొల్పటానికి ఈ లోకానికి వచ్చాననుకోకండి. శాంతినివ్వటంకోసం రాలేదు. కత్తిని యివ్వడంకోసం వచ్చాను. 142 హింద్ సైకిల్ ధరెంతండి? యేయ్ కండెక్టర్ ఏ పేరు ? నెంబరు చూసుకో. గెట్‌యిన్‌గెటిన్. క్లింగ్ క్లింగ్.

చిన్నగాయం.

---

139. వేదాలలో ఋషి- వేదఋషి.

140. అరిస్టాటిల్-గ్రీసు తత్త్వశాస్త్రజ్ఞుడు

141. బెర్ట్రాండ్ రసెల్-'సంఘంపై విజ్ఞాన శాస్త్రం యొక్క ప్రభావం' అనే గ్రంథంలోనిది

142. మత్తయి సువార్త—పదవ అధ్యాయంలోనిది

హిందూస్తాన్ బ్యాంకులా చెక్కు[143] చెదరలేదు. సైకిలు మాత్రం ఆటమ్‌క్రింద విడిపోయింది. ఒన్సు పోనివ్వండి ఫర్ బరాబర్.

హాల్డాన్ !

మొనాకో[144] బిస్కట్లు. గ్రేస్ కిల్లీ వెడ్డింగ్ కేక్.

మిస్ మెడికో దిగుతోంది.

మిడ్ వైఫరీ గ్రంథాన్ని బ్యాగ్‌లో ముడిచి హంసలా నడిచి బురదగుంటలోకి ఆస్పత్రిలోకి వెడుతోంది.

వేలాయుధం, వేలాయుధం! నాగరికతకోసం తన సైకిల్‌ను త్యాగం చేశాడు. నాగరికతంటే సౌందర్యంకోసం సాంకర్యాన్ని త్యాగం చెయ్యడం.[145] ఏమిటి సౌందర్యం? సౌందర్యం తన అందమైన నేత్రాలను వుంచుకోలేదు.[146] తారు, క్లోరోఫారం, ఫినైల్, డిడిటి, సిగరెట్‌పొగ, చెమటతో, కలిసిన మాక్సుఫాక్టరీ లిప్‌స్టిక్, పెట్రోల్, ఫాక్టరీనుసి. డ్రైనేజ్ రిపేర్ యివి మా సువాసనలు.

హోటల్‌ప్రక్క పులిస్తరాకులకోసం నలుగురు యువకులు నాలుగు కుక్కలు కొట్లాడుకొని సేట్‌జీ కారుక్రింద పడటం.

ఆపరేషన్ బల్లపై యింజక్షన్ సూదులు.

అమ్మో యింకెప్పుడూ చెయ్యను.

ఎండిన నాలుక.

కాలే నుదురు, పగిలిన పెదవి, జారిన బాడీ.

పొట్ట పెంచటం కోసం జుట్టు పోగొట్టుకొన్న బోడి బుర్రలు.

ప్రపంచంలో డాక్టర్లంతా సమావేశమై, ఊడిన జుట్టు రాదని

---

143. 'చెక్కు'=డబ్బు

144. మొనాకో బిస్కట్ల కంపెనీ-మొనాకో దేశపు రాజు, గ్రేస్‌కెల్లి, (కిల్లీకాదు) ఫిలిం తారని వివాహమాడాడు

145. కళా విమర్శకుడు—హెర్బర్ట్‌రీడ్ అన్నది

146. కీట్సు కవి గేయం లోనిది.

తీర్మానించారు. ఇవి మా కళాపూరితమైన దృశ్యాలు. మిస్ మెడికో 147 మొహింజోదారోలో వంటి స్తంభం ముత్యాల మేడమీద మృదంగం మోతకి నాట్యం చేసింది.

హరప్పా పాలతొట్టిలో స్నానం చేసింది. ఎల్లోరాలో రాళ్ళకి పొతపోసి పవిత్రతతో పొంగిపోయింది. కాళిదాసుకి కలలో కనిపించింది. నేడు మందుల షాపులో విషాలమ్ముతోంది.

దంతం, మంచిగంధం, బంగారం, వజ్రవైడూర్యం, వెన్నెల, గులాబి, అన్నింటికి మించింది మా మెడికో థర్మామీటర్.

మా మేనక మేకప్‌మాన్ సిద్ధహస్తాలతో చంపలు మ్రోగించు కొంటోంది. మా రంభ రిబ్బన్ షాప్‌లోకి రమ్మంటోంది. మా ఊర్వశి మరి చెప్పను. చెప్పకూడదు. చట్ట నిషేధం, నన్ను జైల్లోపెడతారు.

మాసీత రావణాసురుడు సీనయ్యతో లేచొచ్చి డైరక్టర్ సీతా రామయ్యని పెళ్ళి చేసుకొంది. ముసిలాళ్ళ ముళ్ళపొద. యువకుల తడిసినకల. కవులు వ్రాయని మహాకావ్యం. నమూనాలేని ప్రపంచ ప్రణాళిక వకలాల్చి వ్యక్తి 148 సౌందర్యం అని సిరాతో ఏడుస్తున్నాడు. మా సౌందర్యాన్ని హాలీవుడ్ దొంగిలించి అరణాలికి అమ్ముతోంది. మ్యాటనీకి సగంరేట్లు. అంతా భగ్నమైపోయింది 'అతికిస్తాం, అతికిస్తాం పగిలిన ముక్కలైనా మా కివ్వండి' అని సమాజ సంస్కర్తలు. బిగురు బుద్ధికి పైసాలేదు. కుడతాం, కుడతాం, దారంలేదు నారతేవయ్యా నిజంగా· నీకు కావాల్సింది నారి.

ఆఫీసుకెళ్ళాలి 149 బాస్ కూతురు బర్తుడే. చాక్‌లెట్ల పొట్లం

---

147. మిస్ మెడికోను గతంలోకి తీసుకుపోయి, ఊహాగానం హరప్పా, మొహెంజదారోలు—ప్రాచీన నాగరికతలు

148. భావకవని కాటోలు

149. సంస్థలో పై అధికారి

యివ్వాలి, వో నాల్గురూపాయలు చేబదులిద్దు. పెద్దవాడ్నయ్యాక మూలుగుజబ్బు, చీకటికుళ్ళు, ఈగలు, దోమలు, బల్లులు వాడి పెళ్ళాం నదురు 'దాని మొగుడు బజాబు' యింజక్షన్, మృత్యువు, నిప్పు మంత్రాలశాస్త్రి. ఇంత మహానుభావుడులేడు బ్రతుకున్నవాళ్ళు వాళ్ళ మొహం చూసినవాళ్లు లేరు.

ఇది పాత చింతకాయ పచ్చడి 150 స్టేల్ యేల్ 151 జీవితం అంటే భయం. ఏ క్షణాన్ని ఉద్భవించే ఉద్రేకానికి ఆ క్షణాన్న లొంగి సజీవుడు కమ్మంటావా సార్త్రే ? 152 విట్ వేమేన్ 153 లాగా జీవితాన్నుండి పారిపోతాను. బాబోయ్. భయం మిస్ మెడికో నల్లచీరకొంగులో దాక్కొంటాను. ఏదీ కనపడదేం ?

ఎక్కడుంది ? ఎటు పోయితివో నా రాధా 154 ఇంకెక్కడికి వెళ్ళి డాక్టర్ మొదలియారు చుట్టకి అగ్గిపుల్ల ముట్టిస్తాను-పుల్లా అగ్గిపిల్ల 155 గిరీశం కాల్చి పారవేసిన చుట్టముక్క. మైడియర్ హెలెన్156 యస్

---

150. చచ్చినవాడి కళ్ళు చారెడేసి అన్నది పాతచింతకాయ పచ్చడి—
151. పాతబడిన పానీయం....అన్నా కూడా యిదే
152. జీన్ పాల్ సార్త్రే—సార్త్రేకాదు ఫ్రాంస్ దేశపు నవలా రచయిత. 'క్షణికమైన ఉద్రేకాలకి లొంగి ఆ క్షణాన సర్వేంద్రియాల నుండి జనించిన తృష్ణతో సజీవంగా బ్రతకాల'న్న 'ఎగ్జిస్టెన్షియలిస్ట్' వాదాన్ని ప్రచారంలోకి తెచ్చాడు
153. విట్ వేమన్
వాల్ట్ విట్ మన్—వేమన—లాగే సంఘంలోంచి పారిపోయి ఏకాంత జీవితం సాగించాడు. రెండు పేర్ల కుదింపు.
154. గ్రామఫోన్ రికార్డ్, [రాధాకృష్ణ నాటకంలో]
155. "పిల్లా అగ్గిపుల్ల" అని వుండాలి.
156. గ్రీస్ పురాణగాధలలో సౌంధర్యమూర్తి

డాక్టరు రోమియో. 157 పోర్టు న్యూమోనల్‌లో సాయంత్రం మినర్వాకి మైడియర్.

రామస్వామి ఎపెండిక్సు 158 ఎప్పుడు తీద్దాం ? ఎల్లోరాకి ఎలోన్ అయింతర్వాత చలంగారి కారుణ్యం 159లో నాయుడుబావ మిస్ వటీరావు 160 కాళ్లపడుతున్నాడు. క్లిక్, క్లిక్, కెమెరా ముందుకు నడుపు. ముందు బుచ్చమ్మసార్, సారి. వీరేశలింగాన్ని దమ్మనవోయి.

నా లిప్‌స్టిక్ ఏది ?

సత్యభామ దగ్గరుంది.

క్రిర్, కిర్, ర్ ర్ గ్లిర్, గ్రిర్, ర్

హాల్డాన్,

బ్యాంకుదగ్గర ఆపు.

సర్, సర్, జల, జల. గలగల జలగలా వర్షంపడి నదిగా ప్రవహిస్తోంది. వేదాల్లో నదుల్ని బాగా వర్ణించారు. "అతిష్ఠన్తీనాం అనివేశనానాం"

ముక్కు తెఱచిన గాలి లోపలికి వచ్చి తీరును. తలుపు తెఱచిన వెలుగు లోపలికి ప్రవేశించుట తథ్యం.

"ఉఠాకేలో భుజా, కహేప్రభు అజా" 161

ఆ సైకిలు పిల్లాడు.

157. రోమియో—షేక్సుపియర్ నాటకంలో నాయకుడు

158. శరీరంలో నిరుపయోగమైందని డాక్టర్లు భావించే వొక భాగం ఎపెండిక్సును ఆపరేషన్‌వల్ల తీసేస్తారు.

159. చలంగారి కథకాదు, కుటుంబరావుగారిది

160. దీక్షితులుగారి కథలలో నాయిక

161. మరాటీ భక్తిగీతం

హాస్పత్రిలో చచ్చాడే ?

"ప్రమాదో మమ్చనో పదం" అన్నాడు బుద్ధ భగవానుడు.

తల తిరుగుతోంది. వాడి రక్తంచూసి నా రక్తం ఎగిరిపడుతోంది. నా అస్తిపంజరం కదులుతోంది. 'నా' ఏమిటి ? నేనెవర్ని ? ఎక్కడి కెళతాను ?

"మత్కర్మ కృన్మత్పరమో మద్భక్తః సంగవర్జితః॥ నిర్వైరః సర్వ భూతేషుయః సమామేతి పాండవ॥ 162 మినోవన్ నాగరకత163లోకి జారిపోతోంది మెదడు. నేను చైతన్య రాహిత్య విశ్వానికి చక్రవర్తిని.

నాగరికత మత్తుమందు మలిన రక్తం మధుపానం ఎముకలు నా అస్తి కళేబరాలు. నా ప్రియులు అధో లోకములో అమరత్వం.

హోల్డాను.

దిగండి, దిగండి. ఎరుంగో ఎరుంగో, సాబ్, ఎవరయ్యా నువ్వు ? లే బస్సు ఇక వెళ్ళదు దిగుదిగు

"నేనా ?" హాహాహా "నేను, నేనేలే"

ఒరో గెట్ డవున్ మిష్టరు.

పిచ్చోడ్రా. ఒకవేళ ఫిలిం షూటింగు ఏమో, నాడి చూడ ? సోడాకాయ నెత్తిన కొట్టండి. పోతులా వున్నాడు వీడికేమి జబ్బుంది

ఏయ్ ఎక్కడికి వెడతావు ?

"నాకు తెలియదు"

పిచ్చాడేలా, పిచ్చాసుపత్రికి లాగెయ్యండి తల క్రిందికి కాళ్ల పైకి పెట్టి వేలాడదీయండి.

"నే నెవర్ని ? ఎక్కడికెళుతున్నా ?"

---

162. భగవద్గీతలో—గీతాసారంగా శంకరాచార్యులు వుదహరించినది.
163. ప్రాచీన నాగరికత

నీవు పిచ్చాడివి, ఆస్పత్రికెడుతున్నావు పాపం"

"మీరు పిచ్చాళ్ళే, మీరు ఆస్పత్రిలోంచి బయటకు వస్తున్నారు. నేను వెడతున్నాను"

హా, హా, హా. ఓ హో హో

"వీడిది వేదాంతం పిచ్చిరా"

నీ ఇల్లెక్కడ ! మాట్లాడడే.

నాలుగు మొట్టికాయలు వేయండి.

చ ఛా తప్పురా.

ఎక్కణ్ణుంచి వస్తున్నావు ?

నాగరికత నుంచి

అహో, హా, ఓహో, హో

జేబులో టిక్కెట్టులాగి చూడవోయి

ఆఁ తెలిసిందిరా

పెట్రోలు బంకుదగ్గర ఎక్కాడు. తిరిగి మీ బస్సులో అక్కడికి

తీసుకుపోండి ఎరుగున్నవాడు ఎవ్వరైనా వుండొచ్చు

ఓ. కె.

సరిదా అప్పడిదా పేయలాం-

గెట్ ఇన్ టిక్కెట్టు టిక్కెట్లు

క్లిన్ క్లిన్. బుర్రుర్రి, బుర్రుర్రి ప్లార్రు

బ్యాంకు దగ్గర ఆపండి.

సుభాష్ రోడ్డు ఎక్కడట

నేతాజీ హోటలు ప్రక్కండి.

జాగాలేదు, ఫర్లాంగు క్యూ

సెక్రటేరియట్ దగ్గర ఆపవయ్యా

వెళ్ళి గంటయింద్ది

నెక్స్టు స్టాపులో దింపు

అయ్యవారు అరుస్తాడు

వర్షం తగ్గిందిరా, చెత్త మాదేస్తోంది

దుబుక్కు– ఏయ్ డ్రైవరు కళ్లులేవు ?

సడన్‌గా బ్రేకు వేస్తావు ?

డిడిక్కులు కొట్టుకుంటున్నావు ? వచ్చేదేనండి పెట్రోలుబంకు

మరి ఈయనతో ఎవరైనా దిగుతారా ?

అరెరరెరే సైకిల్.

డ్రూం, క్రీం, డ్రాం, ఢబ్ బెల్లాడింది

మడ్‌గార్డులో చిటికినవేలు పడిందయ్యా ర్యాష్ డ్రైవింగ్, వీడ్ని అర్‌స్టుచెయ్యాలి.

ముందు వాళ్ళ మాట చూడండి. గాయం తగిలింది.

లేదు లేదు పళ్లు పూడాయి. అస్పత్రికి తోసెయ్యండి.

ర్యాలి ధర ఎంతండి ? గేరుకేసు, సీటు, చక్రాలు లేకుండా ముప్పై మూడువేల నయాపైసాలు

ఏయి పోలీసు.

మీ రెవరండి !

నా పేరు సులోచన. మెడికల్ కాలేజీలో చదువుకొంటున్నాను

ఏయ్, నీ పేరు ?

అల్లాఉద్దీన్

ఏయ్ కండక్టరు నీ పేరు ?

44 నలభైనాలుగు

మూడో ట్రిప్పు, బంక్ టు బ్యాంకు –

రాసుకో భయమ్మా

రాంగుసైడులో వచ్చాడు. అంతా దిగండయ్యా ఈ బస్సు ఇంక వెళ్ళదు.

మేము దిగం, ముందు ఆయన్ని దింపండి. ఈయన్ని యెవరయినా ఎరుగుదురా !

ఏం ! సులోచనగారు నవ్వుతున్నారు.

అవును, ఏం ?

ఈయన ఎవరో తెలియదు. మాట్లాడడు-దిగడు నా కాలేజీకి టైం అయింది, ఏమయ్యా దిగుతావా, ఎవరు నువ్వు !

"నేనా ?"

మిస్ మెడికో వెళ్ళింది.

అమ్మ ఇప్పుడు తెలిసింది.

ఆమె కనుబొమ్మలు చిట్లించి టైం చూసుకొని వెడుతోంది. పలకరిస్తా ఏం ?

"క్షమించండి మీకేసి చూస్తూ ఆ సైకిలు గుద్దుకున్న గొడవలో నే నెవర్నో మరిచిపోయాను. అప్పుడే మీరు బస్సులోంచి దిగబోయారు కూడా. మళ్ళా మరో సైకిలు గుద్దుకొని ఆ గొడవలో మిమ్మల్ని చూడగానే తెలివొచ్చింది. సెక్రటరియటులో దిగి ఇంటర్వ్యూకి వెళ్ళాల్సింది. గుడ్ బై.

అహా. హా హా ఓహో, హా-

బూటు రిపేర్సువాడు మళ్ళా సిద్ధం. వాడి దుకాణం రోడ్డు లెవల్ కంటే తక్కువ లెవల్లో కట్టాలి లేకపోతే ఇంటర్వ్యూట, ఆ గుండ్రని ఎముకలకోసం అరెరే, ఎంత పొరబాటు.

ఇంటర్వ్యూ రేపు. ఈ ఊళ్ళో నేనెవర్నో మర్చిపోకుండా ఎప్పుడూ జ్ఞాప్తికి తెచ్చుకుంటూ వుండాలి. మనసుని అటూ ఇటూ పరుగెత్తనీయ

కూడదు. ఏం చేయను? వేగం మన నాగరకతకు వెన్నెముక. సర్వ రోగాలు వేగంగా కదలిపోతున్నాయి నది తన గర్భంలో గుంటలుండుట సహించ లేదు. గుంటలు నింపుటకు అది పరుగెడుతూ వస్తుంది. ఈ సృష్టి అనెడి నది వేగముచే పరిశుద్ధమగుచున్నది. నన్ను నేను మరచిపోయి వేగంగా కదలి జీవాత్మలో కలవనా ?

అని జ్ఞాపకముంచుకొని ఇక్కడే వుండి కుళ్ళనా ?

“నదీ వేగేన శుద్యతి” 164

“ఓం తత్సత్”

ఇంటి కప్పుమీద కోలర్ 165 కోతినే నంత చిన్నప్పుడే ఎందుకు పెండ్లిచేసుకోవాలి? ఈమెను కలుసుకుంటానని కలగన్నానా ? అసలు పెళ్ళిచేసుకోకూడదు. టాల్‌స్టాయ్ 166 ఏం సుఖపడ్డాడు! శభాష్! రెడ్డి మామయ్య! 167 ఘనకార్యం చెయ్యదల్చుకున్నవాడు పెళ్ళి చేసుకో కూడదు. పిల్లల్ని కనడమే ఘనకార్యమయితే షా సంతానం 168 పుడతారు. నేను విమానం ఎక్కను, రేపు నడచి వెడతాను. గాంధి షష్టి

---

164. వినోబాభావే గీతా ప్రవచనములనుండి

165. కోహ్లర్-అనే జంతుశాస్త్రజ్ఞుడు 'చింపాంజీ' [కోతుల] పరిశోధనలు చేశాడు.

166. రష్యన్ నవలా రచయిత - టాల్‌స్టాయ్‌ని వార్ధక్యంలో భార్య బాధలు పెట్టింది.

167. శభాష్-సుభాష్ చంద్రబోసు. రెడ్డి-కట్టమంచి రామలింగారెడ్డి మామయ్య—సామర్ సెట్‌మామ్ (ఆంగ్ల నవలా రచయిత) ఈ ముగ్గురూ వివాహం చేసుకోలేదు.

168. షాకి సంతానం లేదు.

క్లాసులో వెళ్ళనివ్వనందుకే స్వరాజ్యం వచ్చేదికాదు. దేముడిచ్చిన కాళ్ళ-తెలివికీ, వేతనాలకీ సంబంధంలేదు. ఆకలితో మంచివాడుగా వుండటం మెరుగు. అదిగో యిల్లు.... అద్దెకున్న స్వర్గం. అరవింద 169 దర్శనం సమాప్తం.

---

169. అరవిందుడు.

స్వర్గానికి—లయ—ఏవో తత్వం అలవర్చుకుని సమాధానపడా లని—అడ్డొకొంపకి, అరవిందునికీ సంబంధం కనపడదు.

## మరో మారు చదివేముందు

క్షణికమైన ఒక అనుభవాన్ని మొత్తం జీవితానుభవంతో ముడెట్టి ఈ రెంటి తారతమ్యాలు విభజన లేకుండ వున్నది వున్నట్లు ప్రదర్శించే యత్నమే చైతన్య ప్రవంతి. గందరగోళంగా కనిపించే ప్రకృతిలోని కొన్ని పురుగులను ఏరటం, అరాజకంగా కనపడేలోకం పోకడనుండి కొన్ని సూత్రాలు విడదీసి కళానుగుణమైన దృక్పథంతో ఒక ఆకృతిలో కేంద్రీకరించి తీక్షణమయిన శైలిలో ప్రదర్శించటం సంప్రదాయబద్ధమైన సారస్వత కళ లక్ష్యం. విభజనలో, వడబోతలో "సత్యం" దెబ్బతింటుంది. గాన వున్న దున్నట్లు మొత్తం అనుభవాన్ని చిత్రించాలి—అన్న ఆదర్శం ఈ ధోరణికి మూలం. ఈ లక్ష్యం ఎవ్వరికి సాధ్యం కాదేమో. ఆదర్శం గానే వుండిపోతుందేమో! అయినా వర్జీనియా వూల్ఫ్, గెర్ ట్రూడ్ స్టైన్, రిచర్డ్సన్ మొదలయినవారు చాలామంది ఈ పద్ధతిలో రచనలు చేశారు కొంతవరకు ఉత్తీర్ణులయిన వారిలో ముఖ్యుడు "జేమ్స్‌జాయిస్" ఈ పద్ధతిలో ఆయన రచించిన గ్రంథం "యులిసిస్" ఇందులో పదునెనిమిది

గంటల వ్యవధిలో మధ్యతరగతి కుటుంబంలోని కొందరి వ్యక్తులు ఏం చేసింది చిత్రితమయింది. రచనకు ఏడు సంవత్సరాలు పట్టింది. ఎనిమిది వందల పేజీల గ్రంథమయింది. ప్రభుత్వంవారు ప్రచురణ నిషేధించటంతో నూతన ఉద్యమాన్ని లేవతీయాలన్న యువక రచయితల విప్లవాత్మకమైన కళాకలాపాలకి బావుటాగా ప్రచారంలోకి వచ్చింది.

ఈ గ్రంథములో దాపరికాలులేవు. బాహ్యజగత్తులో వస్తువుల తాకిడికి జనించిన ఉద్రేకాలు, ఊహలు, వాంఛలు అన్నీ సమయం, స్థలం కలిసి నాలుగో పరిణామంగా మారినట్లు—కలగా పులగం అవుతాయి. ఆ వ్యక్తుల కుటుంబ జీవితంలో అనుపనే ఛలోక్తులు. ఆడుకునే బూతులు, అశ్లీలం నుడికారాలు, కళ్లు, చరిత్రపునాదులు, సౌందర్యం, ఆధ్యాత్మిక చింతన అన్నీ అస్పష్టమైన సంఘర్షణక్రింద గమ్యస్థానంలేని ప్రవాహం లాగా విచిత్రమైన భాషలో కదలిపోతాయి. గ్రంథం అంతా అందరికి అర్థం కాదు. దీని కొకటీకా తాత్పర్యం కూడా వ్రాయవలసి వచ్చింది.

రెండురకాల రచన లుంటాయి: జీవితాన్ని విమర్శించిముఖ్యమయిన వాటిని ఎత్తి చూపటం. చాలామందికి యిది నచ్చుతుంది. వీరికి శ్రమివ్వకుండ యంత్రం పనిచేస్తే చాలు. మరొకరకం వారికి ఆ యంత్రం ఎలా పనిచేస్తుందో యేయే భాగాలున్నాయో అన్నీ ఊడదీసి పరిశీలించాలని కుతూహల పడతారు. ఈ రకం వారికి చైతన్యస్రవంతి నచ్చవచ్చు. పదునెనిమిది గంటల జీవితాన్ని వొక గ్రంథంలో యిమడ్చటములో ఘనత యేమీ లేదు. ప్రపంచములో చిత్తుకాగితాలని చించి వాటన్నినీ క్రమంలేకుండా ప్రచురిస్తే కూడ స్రవంతి పద్ధతి అనిపించుకుంటుంది.

కాని "జాయిస్" ప్రతిభాశాలి. మహాపండితుడు. విజ్ఞాన శాస్త్రాలని మతాలసారాన్ని అవగాహన చేసుకొని జీర్ణించుకొన్న సంస్కృతితో జీవితముగుండెపై చెయ్యి పెట్టాడు. ప్రచండమైన శైలి-అద్భుతమయిన

పాండిత్య ప్రకర్ష. చదువరిలో సంస్కృతి పెరిగినకొద్దీ, విజ్ఞానం విస్తరించినకొద్దీ ఆ రచనలో ప్రత్యేకత బయటపడుతుంటుంది. శైలికి ఒక ఉదాహరణ.

"మురికి చొక్కా విడిచి ఉతికి తాడుమీద ఆరబెట్టాడు శిలపై ఏసుక్రీస్తులా"

సృష్టి రహస్యాన్ని పరిపూర్ణంగా శోధించడం ప్రదర్శించడము, యెవ్వరికీ సాధ్యం కాదు. "జాయిస్" రచనలో నాగరికతను వెక్కిరించడము— హేళన-ప్రధాన రసంగా కనపడుతుంది. జీవితములో చెడుగుని కుళ్లని బయటపెట్టటము, నాగరికత నాక్షేపించడము, సులువు. మరి దానికి బదులేమిటి? అంటే మాత్రము సమాధానము దొరకదు.

అందుచేత ఈ పద్ధతిలోకూడా సూక్ష్మమైన విమర్శ. అనుభూతుల విభజన, క్రమబద్ధమైన అరాజకత్వము, వుండాలేమో అనుకొంటాను. హేళనకి గురైన వొక సంఘటన వస్తువు. సంస్కారముగల వ్యక్తి— అతని రహస్యమైన ఆలోచనలు, వాంఛలు—స్థూల జగత్తులో పదార్థాల ప్రేరణకి ఏ విధముగా చలిస్తాడో చూపే ఈ యత్నం చైతన్యస్రవంతిలో జరిగింది. ఇందులో కథ వుంది. ఒక యువకుడు వుద్యోగానికి దరఖాస్తు పెట్టుకున్నాడు. ఫలానాచోట—ఫలానారోజు, యింటర్వ్యూకి రమ్మన్నారు. అతను ఒక బస్సులో బయలుదేరతాడు. కొంతదూరము వెళ్ళాక వొక మెడికల్ కాలేజీ విద్యార్థిని ఆ బస్సులో ఎక్కుతుంది. ఆమెను చూడగానే యేవో ఆలోచనలతో ఊహలో పడిపోతాడు. ఆమె దిగిపోతుంది. ఇంతలో ఒక సైకిలు బస్సుకి గుద్దుకొని ప్రమాదము జరుగుతుంది. ఆ ప్రమాదం గతంలో విహరిస్తున్న మనస్సుకి వొక "షాక్"లా తగిలి అతని జ్ఞాపకశక్తి పోతుంది చైతన్యరహితుడవుతాడు. బస్సు తిరిగి వస్తూంటే మరో సైకిలు గుద్దుకొని, మరో ప్రమాదము జరుగుతుంది. మట్టుమూగిన జనములో

మెడికల్ కాలేజీ విద్యార్థిని కూడా వుంటుంది. ఈ రెండో ప్రమాదము "షాక్" వల్ల ఆమెను చూడగానే అతనికి మళ్ళా జ్ఞాపకశక్తి వస్తుంది. బస్సు ప్రయాణంలో జరిగిన విషయాలు అతని మనస్సులో మెదిలే అస్పష్టమైన ఊహలు యీ రెండూ కలిసిపోతాయి. ఈ రచనలో, నాయకుడు సంస్కారం కలవాడు. ఇంటర్వ్యూకి సిద్ధపడటంకోసం కాబోలు మళ్ళా పుస్తకాలన్నీ వొకసారి తిరగేశాడు. వల్లెవేసిన యీ విజ్ఞాన భావపరంపరలు నాగరికత గందరగోళానికి చలించి ముక్కలయి అధోలోకపు ఉద్రేకాలతో కలసిపోతాయి. పెద్ద అక్షరాలతో సూచించబడిన భావాలు బాహ్యజగత్తులో జరిగిన సంఘటనలు. మిగతావి చైతన్యస్రవంతి. ఆ ప్రవాహం పోకడని గమనించ దలిచిన వారికి యీ వ్యాఖ్యానం తోడ్పడుతుంది. ఆ భావాలు ఆ ఉదాహరణలు ఆ వ్యక్తికి ఆ సందర్భంలో సమంజసమైనవో కావో పాఠకులే నిర్ణయిస్తారు. మెదడుకి చక్కిలిగింతలు పెట్టడం, పాండిత్య ప్రకర్ష, ఈ రెండు మాత్రమే కాదు ఈ రచన ఉద్దేశ్యం. ఒక పరిస్థితిలో మనవాంఛలు భావాలు, యెలా, యెక్కడ ఉద్భవిస్తాయో, యెందుకు యెక్కడ అంతమొందుతాయో, పరోక్షంగా పరామర్శించినప్పుడు కలిగే వొక అనుభూతిని కలుగజేస్తే దీని కేదయినా కొంత విలువ వుందనుకొంటాను.

# అడవికాచిన వెన్నెల

మొదటినుంచీ అడవిలో సంచారం, జంతువుల్ని వేటాడ్డం అంటే ఎంతో సరదా నాకు ఎలుగా చెట్టుకి మేకని కట్టేసి, చెట్టుమీద తెల్లవార్లూ కాచివుండడం, వొక ముసిలి పులిరావడం, దాన్ని తుపాకితో కాల్చడం, అది గాయపడి కుంటుకుంటూ పోవడం- మామయ్య చెప్పిన యీ అనుభవం నేనెప్పుడూ మరిచిపోను. కొద్దో గొప్పో నాగరిక జీవనానికి అలవాటుపడ్డ అందరికీ, ఈ అడవి జీవితంపై, మోజుంటుందనుకుంటాను. ప్రాచీనత్వం, అనాదివాసుల బ్రతుకుపోకడలు, అడవిజాతులకుండే వేటతృష్ణ- యివన్నీ మనందరిలోనూ జీర్ణించి వుంటాయి కాబోలు: యీ ప్రాచీనత్వాన్ని ప్రకటించే అవకాశం వొస్తే వొదులుకోము: ఆటలపై మోజు దీనికి తార్కాణం. కుస్తీ 'బాక్సింగ్' చూడ్డం సరదానుంచి, యుద్ధంలో పాల్గొనడం వరకూ, రకరకాల అనుభవాల్ని సృష్టించుకుంటాం. పట్నాలలో టార్జాన్ చిత్రాలకి వొచ్చినంత డబ్బు, మరే చిత్రానికీ రాదు.

నా స్నేహితుడు చంద్రారెడ్డికి అటవీశాఖలో పని. మరికొందరు ఆఫీసర్లూ, తనూ కలసి, వొక పెద్ద అడవికి నాలుగైదు మైళ్ళ దూరంలో కాంప్ చేస్తున్నారట: వీలైతే— వేసంగి- సెలవలుగా— తనతో వో వారంరోజులు గడపటానికి రమ్మని వ్రాశాడు. పరిసరాలనీ, వాళ్ళజీవితాన్నీ, విపులంగా వర్ణించాడు: వచ్చేటప్పుడు పెద్దసైజు టార్చ్‌లైటూ, కాలక్షేపానికి వో అరడజను పుస్తకాలూ తీసుకురమ్మంటూ: "నీకు పెళ్ళీపెడాకులూ లేదు. మా అల్లుణ్ణి పులి పొట్టనెట్టుకుందని వాపోయ్యే అత్తగారు లేదు. ఈ చుట్టుప్రక్కల పులులు, చిరతపుల్లు వున్నా, అవి బ్రహ్మచారుల జోలికి పోవుగనక నువ్వు నిర్భయంగా రావొచ్చు— మళ్ళా క్షేమంగా యింటికి పంపించే పూచీ నాది" అని వుత్తరం ముగించాడు రెడ్డి.

రెండు మూడు డిటెక్టివ్ నవల్సు— ఆ రోజుల్లో అవంటే నాకు పిచ్చి— ఆఫ్రికా అడవుల్లో యాత్రికుల అనుభవాల గ్రంథాలు, రెండు

పొడుగాటి టార్చ్‌లైట్స్ తీసుకుని ఫలానా రైల్లో వొస్తున్నానని రెడ్డికి వుత్తరం వ్రాసి ప్రయాణం కట్టాను. రాత్రంతా రైల్లో పెద్దపులుల్ని గురించిన కథలు చదివి, మధ్యలో ఏ పులేనా కంపార్ట్‌మెంట్‌లోకి దూకుతుందేమోనని చూశా కాని, అల్లాగేం జరగలేదు.

ఆ వూరి ప్లాట్‌ఫారంమీద రైలు నిలిచేటప్పటికి తెల్లారింది. నాకు వూరు కనబళ్ళేదు— అన్నీ కొండలు, చెట్లు. మనుషుల అలజడి తక్కువ. చంద్రారెడ్డి వున్నచోటనే బండి నిలిచింది. సామాన్లు బైటకితీసి బంట్రోతు నెత్తిన పెట్టాను. ప్లాట్‌ఫారమ్ మీదకి దిగి అటూ యిటూ పరీక్షగా చూశాను. నేను తప్ప అక్కడ యింకెవ్వరూ దిగినట్లు లేదు- ఐదారుగురు మట్టుకు ఏవో బస్తాలతో రైల్లో కెక్కారు. ఇంజన్‌వైపు నుంచి మాకేసి, వొకాయనా, వొకావిడా రైలుపెట్లని పరకాయిస్తూ నడిచి రావడం చూశాను. ఆయన ఎత్తుగా, లావుగా వున్నాడు; కాకీ ట్రౌజర్, డబుల్ బ్రెస్ట్‌కోటు, కండ్లజోడు, చేతులో హంటర్ వున్నాయి. మధ్య పాపిడి తీసి, పక్కలకి అణిచి దువ్విన పొట్టిక్రాప్, సన్నటి మీసం ఒత్తుగా కనుబొమ్మలు, ఆకృతి కొంచం భీకరంగా కనబడ్డా దగ్గర్నుంచి చూస్తే మొహం లేతగా కనబడింది; వయస్సు పాతికముప్పై లోపుగానే వుండాలనిపించింది. ఆవిడ మరీలేతగా కనిపించింది. ఇరవై లోపు— సన్నంమీద పొడుగ్గా కనిపించినా, అంత పెద్ద పొడుగూ కాదు. చాలా పల్చని మొహంలో- సూర్యుడి కిరణాల్లో, కరుగుతున్న బంగారంలాగ, మెత్తగా మెరిసిపోయ్యే శరీరఛాయ- జీలుగుబెండుతో నిలబెట్టిన ఓడకొయ్యకు వెండిరేకు తెరచాప ఎత్తిన దృశ్యం స్ఫురిస్తుంది. తెల్లచుక్కల ఆకుపచ్చ సిల్కు మఫ్లర్ తలకి చుట్టింది. అందులోంచి సన్నటి వొంకులజుట్టు పుట్టలోపలికి కదుల్తున్న పాముతోకలా నుదిటిమీద జారుతోంది.

కొంతదూరం మాకేసి నడిచి, మళ్ళా యిద్దరూ వెనక్కి తిరిగి ఇంజన్‌వేపు నడుస్తున్నారు. చివరదాకా నడిచి, వెంటనే వెనక్కి తిరిగి మాకేసి నడిచి వొస్తున్నారు. దగ్గర కొస్తుంటే తెల్లటి సిల్కుచీరపై, పసుపుపచ్చ పూలడిజైను; చాక్‌లెట్ కలర్ బోర్డరు, పచ్చటి జాకెట్టు

స్ఫుటంగా కనిపించాయి. సన్నటి నాజూకైన ముక్కు, పైకగుపించే నల్ల రంధ్రాలు, చెవలకి ఆకుపచ్చ గుండ్రటి రాయి- ఆమెలో ఆకర్షణ ఎందులో వుందా అని ఆలోచిస్తుంటే; 'అవిణ్ణి తరవాత చూద్దువుగాని సావకాశంగా ముందు బైటకెడదాం. నడు' అంటూ చంద్రారెడ్డి నా భుజాన్ని నెట్టాడు. నే వులిక్కిపడ్డాను; గేటు తేసి నడుస్తున్నాం.

'ఆయనెవరు రెడ్డీ?' అని అడిగాను.

అతను సమాధానం చెప్పేలోపలే వారిద్దరూ వొచ్చేసి మా ముందు నిలబడ్డారు. రెడ్డి నన్ను ఆయనతో పరిచయం చేశాడు.

'మా ఫారెస్ట్ ఆఫీసర్ ప్రేమానంద్.' ఆయన తల పంకించాడు.

'నా స్నేహితుడు— పట్నంనుంచి వొచ్చాడు-' అన్నాడు రెడ్డి.

నేను నమస్కారం పెట్టాను.

'మా అల్లుడి అన్నగారు బెంగుళూర్‌నుంచి యీ బండిలో వస్తానన్నాడు. ఏదీ, రాలేదే.' అన్నాడు. ప్రేమానంద్ రైలువంక కోపంగా చూస్తూ.

'బెంగుళూర్ కేసి సైక్లోనట- అంచేత రాలేదేమో!' అన్నాడు రెడ్డి.

'అవును మరిచాను. నిన్ననే మనం ఆ విషయం మాట్లాడుకున్నాం కూడాను. సరే, యిహ నెందుకూ- వెళదామా' అని ప్రేమానందం నాకేసి తిరిగి, 'మళ్ళా కలుసుకుందాం బంగ్లాలో- యింకా వుంటారుగా,' అన్నాడు.

'ఏదో రెండుమూడు రోజులుంటాను' అన్నాను.

'ఈసారిగా ఏ పులీ తినకుండా వుంటే వారంవుంటాడు. అవునా?' అని చంద్రారెడ్డి నవ్వాడు. కాని ప్రేమానందం మొహంలో నవ్వులేదు. భీకరంగానో, దిగులుగానో వున్నట్లుంది అతని మొహం. పెద్ద ఆఫీసర్ కనపర్చవలసిన అమానుషత్వపు ధోరణి కాబోలు ననుకున్నాను. ఆయన వెళ్ళబోతూ, వొక్కక్షణం నిలిచిపోయి—

'మరిచాను. మైవైఫ్.' అని, ఆమెని పరిచయం చేశాడు. ఆవిడ,

ముట్టా కప్పుకున్నా చీరకొంగులోంచి చేతులు బైటికి తీసి నమస్కారం లాంటిది చేసి, అగమ్యగోచరంగా నవ్వింది. ట్రీక నమస్కారం పెట్టడం నాకలవాట్లేదు. నేనూ అల్లాంటిదే చేసి, ఆవిడ కళ్ళల్లోకి చూశాను నా కప్పుడర్థమైంది; ఆమె ఆకర్షణ కళ్ళల్లోది. మహారణ్యం మధ్యలో కదలిక లేని లోతు కొలనులాంటి నేత్రాలవి; ఆ చూపు వెనక, అఘాతాల ప్రతిబింబాలు మెదుల్తున్న అలజడివెనక, చూపులోని తీక్షణమైన చాంచల్యం, అన్నింటినీ తాళంతో బిగించిపారేసినట్లు, నిశ్చింతగా బిగించుకొన్న సన్నటి పెదవులు, చీకటి నిండుచంద్రుణ్ణి బంధించినట్లు వెన్నెలని కప్పుకుని ప్రాణాలని రక్షించుకుంటున్న కారడవి- యివన్నీ కలిసి ఆ ఆకర్షణని వ్యక్తపరుస్తాయేమో నాకు తెలీదు.

వారిద్దరూ గేట్‌లోంచి వెళ్ళిపొయ్యారు. ఫర్లాంగవతల నిలిచి వున్న కార్లో ఎక్కారు. కారు కదిలి జువ్వలాగ బైలుదాటి కొండల వెనక అంతర్ధానమైంది.

మాకోసం టావులేని పెట్టెబండి సిద్ధంగా వుంది. ముడివిప్పితే జారిన సిల్కు తెరలా సూర్యుడికాంతిలో మంచుకొండలమీద నుంచి జారుతోంది. పచ్చరిబ్బన్‌లా రోడ్డుమెలికెలు తిరిగింది. చంద్రారెడ్డి ఫ్లాస్కు తీసి మూతలో టీ పోసి తాగడానికిచ్చాడు. బండి కదలింది. వాళ్ళ కాంప్‌దగ్గరకి షుమారు మూడుమైళ్ళ దూరం వుందిట. గుట్టలు, కొండలుదాటి, కాంప్ సమీపంలో కొచ్చాం.

'అదిగో అదే మా అఫీసర్‌గారి బంగాళా' అని చూపించాడు రెడ్డి. రోడ్డుకుకివైపున దూరంగా చెట్లమధ్య బంగాళా కనిపించింది. దాని ముందు రెండుమూడు పాకలున్నాయి; వెనక ఎత్తుకొండకింద, చెఱువు లాంటి దుంది.

'ఆవిడొక్కత్తే ఎల్లా వుండగల్గుతుంది?' అని అడిగాను. చంద్రారెడ్డి కొంటెగా నవ్వాడు. రెడ్డి చిన్నప్పుడు క్లాసులో తెలివైనవాడుగా పేరుపడ లేదు. కాని చమత్కారంగా, హాస్యంగా మాట్లాడేవాడు; అటవీశాఖలో ఐదేళ్ళగా పనిచేస్తున్నాం సంస్కృతి అంతగా దెబ్బతినలేదు.

'వొక్కత్తే వుండే భయమేం- మొగుడున్నాడుగా!' అన్నాడు.
'మీ ఆఫీసర్లందరూ భార్యలతో కాపరం వుంటున్నారా యీ కాంపులో ?'

'లేదు. లేదు- మేం అందరం వొంటిగానే వుంటున్నాం. ఆయన వొక్కడే భార్యని తీసుకొచ్చింది. కొత్త పెళ్ళాం. మరిచాను, ఆవిడ పేరు నిర్మల. ఆ గుడిసెల్లో బంట్రోతు లిద్దరుంటున్నారు. వాళ్ళ ఆడవాళ్ళు ఆవిడకి సాయంగా వుంటున్నారు.'

వాళ్ళంతా కాంప్ ఎందుకు చేశారో చెప్పడం మొదలెట్టాడు రెడ్డి కొంత సర్వేపనుందిట: కొంతభాగం అడివిధ్వంసంచేసి వొక అటవీ పరిశోధనాలయం నిర్మించాలిట: అన్నిటికంటె ముఖ్యం, ఆ అడవిలో రెండు మూడు నెలలుగా నరమాంసాని కలవాటైన ముసిలి పులి తిరుగుతూ నష్టం కలగజేస్తోంది: దూడల్ని, మేకల్ని, కాపుర్ని, యిద్దరు కట్టెలు కొట్టేవాళ్ళను కూడా పొట్టనెట్టుకుందిట దాన్ని వేటాడి పట్టుకోడం కూడా వాళ్ళపన్లలో వొకటిట: ఆ పులికి 'రాయలకేసరి' అని నామకరణం చేశారుట— రాయల సీమలో వుంటోంది గనుక.

'ప్రేమానందం యిదివరలో ఎన్ని పులుల్ని వేటాడాడు ?' అని అడిగాను.

'ఆయన్ని గురించి నన్నేమీ అడగొద్దు: నాకేమి తెలీదు. ఆయన యీ డిపార్ట్‌మెంట్‌లో చేరి వో సంవత్సరమైంది: పైగా యీ డివిజన్‌కి బదిలీ అయి నెలకూడా కాలేదు. ఈ కాంప్‌లో నాలుగురోజుల్నుంచే మా పరిచయం. చాలా మితభాషి: చనవు కనబర్చడు. తగినట్లుగానే మేం అందరం ముభావంగానే వుంటున్నాం' అన్నాడు.

బండి కాంప్ దగ్గర నిలిచింది—అంతా చదునుగా కనబడే పచ్చ గడ్డిబైలు: మధ్య నాలుగైదు పెద్ద చెట్లున్నాయి: వాటి మధ్యలో అక్కడక్కడ టెంట్లు వేశారు. గడ్డితో వో పాకేశారు. అది ఆఫీసుట. చెట్లకింద చల్లటి విశాలమైన నీడలు- అక్కడ రెండు కాంప్‌టేబిల్సు కుర్చీలు వేశారు: ఆరుబైటే వొంటలు, భోజనాలూ.

'ఇవి తప్ప యింకేవీ యిళ్ళు లేవా ?'

'లేకేం. మనం బంగళా చూశామే—దానవతలగా ఫర్లాంగు దూరంలో వో చిన్ని కాలనీ వుంది— వో అరడజను కొంపలుంటాయి. వర్క్‌మెన్, మేస్త్రీ, కంట్రాక్టర్— పొతరిద్దరు ఆఫీసర్లూ వాళ్ళంతా అక్కడుంటారు. మేం నలుగురం మాత్రం సరదాపడి, టెంట్లు వేసుకున్నాం. ఇదుగో రాఘవులు— నిద్రాదేవి కి పూట విడాకులిచ్చి వొస్తున్నాడు—' అంటూ రెడ్డి రాఘవుల్ని పరిచయం చేశాడు.

'గురవా—టీ తగలెట్టరా.' అని కేకేశాడు. గురవడు వొక ట్రేలో గోధుమరొట్టెలదొంతరతెచ్చి బల్లమీద పెట్టాడు. అవితిని, మళ్ళా కొంచెం టీ తాగి, స్నానాలకి బైలుదేరాం. వందగజాలదూరంలో, చిన్నికొలనుంది- లోతులేదు- అడుగున ఎఱ్ఱగా కంకరనొంపు కనబడుతుంది- నీళ్ళు తేటగా మధురంగా వున్నాయి. మేం వెళ్ళేటప్పటికి, అందులో యిద్దరు వ్యక్తులు స్నానాలు చేస్తున్నారు. వాళ్ళని కూడా రెడ్డి పరిచయం చేశాడు. ఒకతను శ్రీహరి, మా రెడ్డి సహాధ్యాయుడు, రెండో అతను మధుసూదనం,- రెడ్డి కంటె కొంచెంతక్కువ గ్రేడుఉద్యోగి-డిపార్టుమెంట్‌లో ప్రవేశించి,ఏడెనిమిది నెలలైంది. యిక్కడికి కొత్తగా బదిలీ అయి రెండువారాలైందిట. మధుసూదనం నాజూకుగాను, తెలివిగాను కనిపించాడు. సన్నటి, పల్చటి కోల మొహం, మెత్తటినుదురు, విశాలంగా, చక్రాలలా కనబడే అందమైన కళ్ళు— వీటికి యవ్వనం కొత్తవెలుగు నిచ్చింది. అతను అందమైన వాడని, పురుషులు కూడా అనుకోవల్సిందే: కాని వొకటిరెండు లోపాలున్నట్లు నాకు తోచింది. పళ్ళువొకటో, రెండో-కొద్దిగా వంకర. మొహం మృదువుగా, కోమలంగా వున్నా, పెదవులు గుండ్రంగా బలంగా వుంటాయి— నవ్వినప్పుడు, మొహం వింతగా ముడతలుపడి, యవ్వనం సిగ్గుతో వొణుకుతున్నట్లు- బుగ్గమీద నొక్కులో దాక్కున్నట్లుగా ఉంటుంది ఆ నవ్వు. నడుం సన్నం మూలాన ఛాతీ వెడల్పుగా కనబడుతుంది- ఛాతీ వెంట్రుకలు లేకుండా, నున్నగా వుంది.

శ్రీహరి మోటుగా కనిపించినా, వయస్సు పాతికలోపే అనుకున్నాను. మోటుతనానికి కొంత కారణం, నెత్తిమీద వెంట్రుకలు పల్చ

బిరటమే; వెడల్పు ముక్కు, చిన్నకళ్ళు, కోపేసినట్లు కనబడే నుదురు- యివన్నీ పెద్దవాడిగా కనబడేటట్లు చేస్తాయి.

'ఇక్కడ నీళ్ళు చూశారా ఎంత నిర్మలంగా వున్నాయో' అన్నాడు శ్రీహరి.

'నిర్మలన్నపదం రోజు కొకసారేనా వాడకుండా వుండలేడండి మావాడు' అన్నాడు మధుసూదనం శ్రీహరిని వుద్దేశించి.

'పెండ్లికావల్సినవాడవు- మేం కాపరాలుచేస్తున్నాం- వేళాకోళం భరించి వూరుకోకూడదు ?' అన్నాడు శ్రీహరి. వాళ్ళ స్నానాలు ముగిసినై. బట్టలు వేసుకుని కాంప్‌లోకి పొయ్యారు. వాళ్ళు వెళ్ళిన తర్వాత చంద్రా రెడ్డి నాతో చెప్పాడు: కుర్రాడు పచ్చపచ్చగా వున్నాడనీ, బ్రహ్మాచారి కావడంవల్లనూ, అందరూ మధుసూదనాన్ని వేళాకోళం చేస్తుంటారుట.

'ప్రేమానందాన్ని గురించి ఏవేవో వింతగా చెబుతుంటారు, వూసి పోక.' అన్నాడు చంద్రారెడ్డి.

కింద వుద్యోగులందరూ కలిసి, పై వుద్యోగిని గురించి కాస్తంత నిరసనగా మాట్లాడడం సహజంగానే వుంది. అతనిలో లోపాలన్నీ తవ్వి తీస్తారు; లేకపోతే సృష్టిస్తారు; శీలంలోనూ నైతిక ప్రవర్తనలోనూ లోటు కనబడకపోతే, అతని తెలివితేట్లకి విలువ కడతారు; అందులోనూ ఏమీ దొరక్కపోతే, అతని భార్యను గురించేనా గుసగుసలకి అవకాశం వుండే కథా వస్తువుని అల్లుకుని తృప్తిపడతారు కాబోలు— అనిపించింది నాకు.

"అతనిలో ఏ మట్టి విశేషం ?" అని అడిగాను.

'నే నేమీ నమ్మననుకో— వాళ్ళనడం, అతను నపుంసకుడని.'

'అల్లా అనుకోడానికి ఆధారం ?'

'నాకేమీ కనబడలేదు. నాలుగైదేళ్ళుగా కాపరం చేస్తున్నా సంతానం లేదుట.'

నాకునవ్వొచ్చింది. సంతాన నిరోధక సాధనాలు యత్నిస్తున్నారనుకో కూడదు ? రెడ్డికి నా వాదను అంత రుచించలేదు.

'ఎందుకు చెయ్యాలి? వాళ్ళు పిల్లల్ని పోషించలేని పేదస్థితిలో లేరు. పైగా ఒకరిద్దరు సంతానం కలిగిన తర్వాత, అరికట్టడం జరుగుతుందేమో' అన్నాడు.

'నిర్మల అందం చెడకుండా వుంచాలని సంకల్పించారేమో' అన్నాడు.

ఈసారి రెడ్డి నవ్వాడు.

'నువ్వంతా ఊహా ప్రపంచంలో విహరిస్తుంటావు: భావకవిత్వం యింకా రాస్తున్నావా?' మా స్నానాలూ ముగిసినై. క్యాంప్ దగ్గరకి చేరుకున్నాం. తొమ్మిదైంది. చెట్లకింద చల్లటి నీడలమధ్య సూర్యరశ్మి తివాచీలో అల్లికగా వెలిగిస్తోంది. చల్లదనానికి స్పృహతప్పినట్లు చెట్లమీదనుంచి ఆకులు కిందికి రాలిపోతున్నాయి. సర్వీచెట్లు దూరంగా రోదిస్తున్నాయి.

'ప్రేమానందాన్ని గురించి మీ అనుమానాలు యీ పూట చర్చించండి, మావాడు విని తీర్పుచేస్తాడు— మానసిక శాస్త్రం అంతా చెవికోసుకుంటాడు, మా వాడు.' అంటూ రెడ్డి నన్ను మళ్ళా వాళ్ళకి పరిచయం చేశాడు. రాఘవులు ప్రారంభించాడు.

'ఆయనలో ఏదో తిరకాసు లేకపోతే, ఆడది ఆ పని ఎందుకు చేస్తుందోయి?'

'ఏ పనీ?' అని అడిగాను ఆతృతతో.

'ఆత్మహత్య తలపెట్టింది, పట్టపగలు- మధ్యాహ్నం మూడింటికి, మాట్లాడవేం శ్రీహరీ- నువ్వు వాళ్ళ చుట్టానివేగా.' అన్నాడు రాఘవులు. శ్రీహరి, ప్రేమానందానికి చాలా దూరపు చుట్టంట. అంచేతే కాబోలు ప్రేమానందాన్ని గురించి మాట్లాడ్డంలో అంత వుత్సాహం కనపర్చడం లేదు. నేను చెబుతానుపట్టు అంటూ రాఘవులు, నిర్మల జీవితంలో వొక ఘట్టం చిత్రించాడు.

నిర్మలతండ్రి స్థితిపరుడు. ఎస్టేట్లలో తాశీల్దారుగా చాలా డబ్బు, పలుకుబడి సంపాదించాడు: ప్రభుత్వోద్యోగులలో పెద్దవాళ్ళందరితో పరిచయం వుంది. తల్చుకుంటే ఏ పనైనా ఎంతటిపనైనా చేయించగల

రాగల్లు; నిర్మలకి అక్కా చెల్లెలు వున్నారు. అప్పగారు మనోరమని-భాగ్యవంతుల కుటుంబంలో యిచ్చి పెండ్లి చేశాడు; భర్తకి బోలెడు వ్యవసాయమే కాకుండా వ్యాపారం కూడా వుంది. వ్యాపారం అతనన్నగారు చూస్తూ, బెంగుళూరులో వుంటాడు. అతన్ని రిసీవ్ చేసుకునేందుకే ఉదయం ప్రేమానందం స్టేషన్ కెళ్ళాడు.

నిర్మల అత్తవారు అంత స్థితిపరులు కాకపోయినా, కుర్రాడి తెలివి, చదువూ చూసి, వివాహం చేశారు. పెండ్లి నాటికి నిర్మలకి పదిహేడేండ్లుంటాయి. స్కూల్ ఫైనల్ కాన్వెంట్‌లో చదివింది. పెండ్లికాగానే అత్తవారింటికొచ్చింది. ప్రేమానందం చదువు ముగిసింది కాని వుద్యోగం లేదు. మామగారి ప్రోద్బలంమీద, ఐదారు నెలలు అటవీశాఖలో తర్ఫీదు పొందాడు. ట్రైనింగ్ ముగిసిన నాలుగు నెల్లలో మామగారి ధర్మమా అంటూ, యిప్పుడు చేస్తున్న పెద్ద వుద్యోగంలో మొదట్లోనే ప్రవేశించాడు.

భర్త ట్రైనింగ్ కెళ్ళిన ఐదారునెలలూ నిర్మల అత్తవారింట్లోనే వుంది. విచిత్రమైన వ్యాధికి గురైంది. భోజనం చెయ్యదు. అందరూ బలవంతం చెయ్యగా ఏదేనా తింటే, డోక్కుంటుంది. మనిషి క్షీణించి పోతోంది; డాక్టర్లు పరీక్షచేశారు. వాళ్ళకేమీ లోటు కనపళ్ళేదు; మందు లిప్పించారు. ఏమీ ఉపయోగించలేదు. భోజనం మట్టుకు లేదు. కాపిని పాలో, ఓవల్టినో, ఎప్పుడేనా బ్రెడ్, బిస్కెట్స్ మాత్రం తీసుకుంటుంది. అసలు ఆకలే లేదంటుంది. అత్తగారు భూతవైద్యం చేయించింది; లాభం లేకపోయింది. హిస్టీరియా అన్నారు, గాలన్నారు. ఎవరో మందెట్టారన్నారు. తండ్రి కూతుర్ని తనతో తీసుకెళ్ళాడు.

ప్రేమానందం, భార్యని చూడ్డంకోసం అత్తవారింటి కెళ్ళాడు. కార్యంచేస్తే వ్యాధికుదురుతుందన్నారు; తాశిల్దారు వీల్లేదన్నాడు: 'కార్యం చెయ్యడ మేమిటి- ఎప్పుడో అయింది' అన్నారుట. భర్త వారంరోజులుండి వెళ్ళిపోయ్యాడు. ఆనాడు ఆదివారం: తాశిల్దారు క్యాంపు కెళ్లాడు; తల్లి పడుకుంది; చెల్లెలు హాల్లో వుయ్యాలవూగుతూ రేడియో వింటూ కూర్చుంది.

మనోరమ బావగారు మట్టుకు ముందుగదిలో పేపర్ చదువుకుంటున్నాడు. టపీమని పెద్దచప్పుడైంది. పక్కింటి కృష్ణయ్యగారు- ఆయనకి టెలిగ్రాఫ్ ఆఫీసులో పని- లేచాడు. నిర్మల నూతులో పడిందని కేకవేశాడు. నలుగురూ పోగయ్యారు. నిచ్చెనలు దింపి ఆమెని పైకి లేవదీశారు. అదీ ఆమె ఆత్మహత్యకి చేసిన మొదటి యత్నం. కారణం ఏమీలేదు. తల్లి తండ్రి, ఎందుకో చెప్పమని రహస్యంగా ఎంతో బ్రతిమలాడారు. నిర్మల సమాధానం చెప్పదు. 'ఊరికినే' అందిట.

ఆ సాయంత్రం యీ వార్త తెలీగానే శ్రీహరి చూడ్డానికి వెళ్ళాడు- అప్పుడు శ్రీహరి ఆ వూళ్లో చదువుకుంటున్నాడు. చీకటిపడింతర్వాత మధుసూదనం కూడా చూడ్డాని కెళ్లాడు— అప్పుడతను, ఆ వూరు స్నేహితుడి పెండ్లి కొచ్చాడుట.

ఈ కథ వింటే ఆశ్చర్యం కలిగింది. అకారణంగా, వృత్తిపుణ్యానికి ఎవరన్నా ఆత్మహత్య తలపెడతారంటే నేను నమ్మలేకుండా వున్నాను, అట్లాగన్నాను.

'మతిభ్రమ కాకూడదా ?' అన్నాడు రాఘవులు.

'మతిభ్రమ కావొచ్చు- దానికేనా ఏదో కారణం వుంటాలి. నిర్మలకి వివాహం యిష్టమేనా ?' అని అడిగాను.

'నిర్మల పెండ్లి నే చూశాను. అయిష్టత వున్నట్లు ఎవ్వరూ అనుకో లేదు. మహావైభవంగా జరిగింది పెండ్లి. నిర్మల సంతోషంగా, సరదాగా వుందనే మేం అనుకున్నాం. ఏం మధూ నువ్వూ చూశావుగా ?' అన్నాడు శ్రీహరి.

'ఏమోస్మి- పీటమీద కూర్చున్న వ్యక్తులు దిగులుగా వున్నారా, హుషారుగావున్నారా కనుక్కుందామన్నంత పరీక్షగా చూళ్లేదు. నా కళ్ళ కది అన్ని పెళ్లిళ్ళమాదిరిగానే వుంది. పైగా పెండ్లినాటి సాయంత్రమే నే వెళ్ళిపొయ్యాము. తరవాత రెండుమూడురోజులు దాకా అక్కడ నువ్వున్నావుగా- నీకే బాగా తెలియాలి.' అన్నాడు మధు.

'అవును వున్నాను: ఎక్కడా పేచీలు, మాటపట్టింపులూ వొచ్చి

నట్టులేదు. ఆరువేలు కట్నం చదివించారు; అమ్మాయికి నాలుగైదువేల ఖరీదైన వెండి బహుమతు లొచ్చాయి. ఊరేగింపునాడు, ముత్యాల ఓడ కట్టించారు. ఆ దీపాల్లో నిర్మల బంగారు జరీచీర— ఎఱ్ఱరంగుది....' శ్రీహరి వర్ణన పూర్తికాకుండానే మా చంద్రారెడ్డి అడ్డుకున్నాడు. 'బాబూ, యీ వర్ణన మాకక్కర్లేదు- ఓ యిరవైసార్లు విన్నాం. అసలు విషయానికి రండి' అన్నాడు.

నేనుఊరేగింపునాటి నిర్మలను వూహించుకుంటూ మౌనంలోపడ్డాను. నా కొకటి రెండు అనుమానాలు కలిగాయి.

'ఆ ఆదివారంనాడు తాశీల్దారుగారింట్లో ఎవరెవరున్నదీ ఉదయం నుంచి, నూతిలో పడేవరకూ ఏమేమి జరిగిందీ, విపులంగా ఎవరేనా చెప్పగలరా ?' అని అడిగేశాను, ఏ ఒక్కర్నీ ఉద్దేశించకుండా.

శ్రీహరి సమాధానం చెప్పాడు. 'నేనంతా ఆ పూటే అరాతీశాను. నిర్మల ఉదయం లేచింది. తల్లితోకలిసి కాఫీలు అవీ యిచ్చింది. బావగారు అన్నగారు- ఆయన పేరు కుటుంబరావు- కాఫీతాగి వూళ్ళోకెళ్లాడు. నిర్మల కాస్సేపు రేడియో పెట్టుకుందిట. తర్వాత స్నానంచేసి వంటింట్లో పని చేసింది. మధ్యాహ్నం భోజనాలైంతర్వాత ఓ గంట నిద్రపోయింది. లేచేప్పటికి రెండైంది. అప్పుడు నేవెళ్ళాను- ఏమీతోచక కాసేపు రేడియో విందామని—'

'తొయ్యకోయ్— కాసేపు నిర్మలని చూద్దామని వెళ్లావ్' అన్నాడు రాఘవులు.

శ్రీహరికి కోపం వచ్చింది కాని దిగమింగుకున్నాడు- మొహం వుద్రేకంతో వుబికింది.

'తప్పా ? అదీ వో ఉద్దేశమే. నాకేమీ దురుద్దేశంలేదు. పైగా ఆమె భర్తతో కాపరం చేస్తోంది.'

'దురుద్దేశం ఉందని మేం అనలేదు. నీ కెందుకంత భయం.... ?' అన్నాడు రాఘవులు.

'అసలు విషయం చెబుదురూ- మధ్యలో యివన్నీ ఎందుకు....' అని మా రెడ్డి సణిగాడు.

మళ్ళా శ్రీహరి ప్రారంభించాడు.

'కాసేపు నిర్మల నాతో మాట్లాడింది. చెల్లెలు తనూ కాఫీలకోసం వంటింట్లోకెళ్లారు. కాసేపు ముందుగదిలో పేపర్ చూసి, కాఫీ తాగి, నేను వెళ్ళిపోయాను. ముందుగదిలో కుటుంబం నిద్రపోతున్నాడు. నిర్మల అతన్నిలేపి కాఫీ యిచ్చింది. నేను రోడ్డుమీద ఫర్లాంగుదాకా వెళ్లిపోయి వెనక్కి తిరిగాను. కుటుంబం గబగబ నడిచిరావడం చూశాను. అంతే, నాకింకేమీ తెలీదు. ఆరింటికి, నిర్మలని నూతులోంచి తీశారన్న వార్త మధుసూదనం చెప్పాడు. మధుసూదనం తన విషయం మొదలెట్టాడు.

'నేనా ఉదయం తొమ్మిదింటికి వాళ్ళింటి కెళ్ళాను. బి.ఎ. పూర్తిచేసి ఉద్యోగంలేని రోజులవి. తాశీల్దారుగారు, మా నాన్నగారు స్నేహితులట— దూరపుచుట్టరికం వున్నా, కలిసిమెలిసి ఉండటం పడలేదు. అబ్బాయిని నా దగ్గరకు పంపు, ఎందులోనేనా ఉద్యోగం చూస్తానని, తాశీల్దారు మా నాన్నకి వ్రాశారు. ఆ విషయమై, తాశీల్దారుగార్ని చూడ్డానికెళ్ళాను. ఆయన ఆ రోజున లేడు. క్యాంప్ కెళ్ళాడుట. ఆ సంగతి నిర్మల చెల్లెలు చెప్పింది. వెళ్ళిపోబోతుంటే, నిర్మలప్పుడే వొచ్చింది. స్నానంచేసి భోజనానికుండమంది. తాశీల్దారొచ్చింతర్వాత వస్తానని వచ్చేశాను. నేనక్కడ మొత్తం నలభై నిమిషాలు గడిపుంటాను. ఐదుగంటలకి కాఫీ హోటల్లో నిర్మల ఆత్మహత్య విషయం ఎవరో అనుకుంటుంటే విని, చూడ్డాని కెళ్ళాను. దోవలో శ్రీహరితో చెప్పాను. అప్పటికి జనం చుట్టా మూగేశారు. నేను నిర్మలని చూళ్లేదు. ఎవ్వరితో మాట్లాడలేదు.'

నిర్మలచేసిన ఆత్మహత్య విషయం ఆలోచించినకొద్దీ చిత్రంగా కనబడుతోంది. కారణం ఏదో వుండాలి. అది తెల్సుకోవాలన్న నిశ్చయం నాలో అప్పటికి బలపడింది.

'మరొక ప్రశ్న. ఆ రోజున పోస్టు జవానొచ్చి వుత్తరాలేవన్నా యిచ్చాడా ?'

శ్రీహరి జవాబిచ్చాడు.

పాలిపోయి గుడిసెలు, వాటిపక్క గొంతుక పడిపోయాయి. వెలుపలికి ఉవతల గట్టున, ప్రేమానందం అగ్గిపాతాళంలోంచి వంపుగా వొంకర్లు తిరిగి కొంతదూరం వెళ్ళాక చిన్నబిడ్డ జుట్టులో పాపిడిలాగ మెరుపైన ఎర్రకోట్లు—అక్కి అగుపడుతున్నాయి. ప్రేమానందం అగ్గిపాతాళంలో పెద్దపెద్దచెట్లు వాలుగ్గా వున్నాయి. వాటిల్లో వొంటరిగా పుష్పాల ప్రేమ్యటుంది. ఆ పుష్పాలపై నిర్మల కూర్చుంది. ఏవో ముసిల్ది పుష్పాల వాసనతోంది.

నిర్మలను గురించి అక్కడ జనం వింతగా చెప్పుకుంటున్నారంటే ఆశ్చర్యమేముంది! అక్కడందరూ పొగాకు—పైగా బ్రహ్మాచారులుగా వుంటున్నారు. నిర్మల ఎంతో అందమైనది శరీరం పచ్చగా, నీరసంగా కనబడ్డా, అందులో యవ్వనం అపాదించిన వికాసం, బలంకూడా వున్నాయి. బలుపుతో స్ఫుటంగా కనబడనివి రొమ్ములొక్కటే. ముఖంలో—ముఖ్యంగా కళ్ళల్లో—అలుముకున్న విషాదచ్ఛాయలు యవ్వనాన్ని కొంతవరకూ కప్పిపుచ్చాయనక తప్పదు. సంధ్యాకోసం వేచివున్న శరీర ఛాయ నిర్మలది. వెన్నెలని కాముంచి ఆలిసిపోయిన వెర్రితృష్ణ: అడివంతా అల్లుకుపోయిన జీవజ్వాల: ఆమె కనువిప్పితే జ్వాల నిల్చిపోతుంది; వెన్నెల నక్షత్రాలని ప్రదర్శించి బురఖా వేసుకుంటుంది. నిర్మల వొంటిదై ఆకలిదప్పులు తీరక ఆలల్లాడిపోయి, వెన్నెల వెలుగు, అడివిబలం తనే శరీరంలో సృష్టించి, పెంగించి, ఎదుర్కొనేశక్తి సృష్టిలోలేక తనే హతమౌతుంది అడివిరాచిన వెన్నెల. వెన్నెలనే కాల్చిన అడివిచుంట నిర్మల.

నా మనస్సు ఎల్లాగో ఐపోయింది. తన సౌందర్యం ధ్వంసంచేసి, హరించవేసేవారు లేక తను ఆత్మహత్య తలపెట్టిందా అనిపించింది. సౌందర్యం తన మెరిసిపొయ్యే నేత్రాలని వుంచుకోలేదా? ఇవన్నీ భ్రాంతులని తెలుస్తోంది మానవుడి ప్రవర్తనకిమల్లేనే, మానవుడి వూహ కూడా చిత్రమైంది. వూహలే యథార్థాలైతే మానవుడి హృదయం, ఆశ్చర్యంతో పగుల్తుంది. సౌందర్యం నిర్మలలో యథార్థమైంది. తన శరీరం పగలగొట్టుకుంటోంది—ఆమె శరీరమే హృదయం గనక.

ఈ భావాలతో నా కళ్లు చెమ్మగిల్లినై. అది ఏడ్పురాని బాధ. కన్నీరు లేని కారుణ్యం; సజీవమైన జాలి ఇది మా వాళ్ళతో చెబితే నవ్వుతారు నన్ను పిచ్చివాడికింద కడతారు. నామీద గురి తప్పుతుంది; నన్ను గౌరవించరు; హేళనచేస్తారు. ఒక విషయం తేలిపోయింది. నిర్మలెప్పుడూ మరణించదని. ఆమె వొక్క సంవత్సరమో, నెలో, వారమో, గంటో, క్షణమో, ప్రజ్వరిల్లి జీవించడానికి సంకల్పించింది. ఒక్కసారి ఆవేదనలో సర్వశక్తులు ధారపోసి, అందంలో హతమౌతుంది. నిర్మల జీవించడం అంటే మరణించడం. ఆత్మహత్యయత్నాలు అల్లా జీవించడానికి ఆమె చేసే యత్నాల చిహ్నాలు.

కొండదిగి కాంప్ వేపు నడవడం సాగించాను. ప్రేమానందం, బంట్రోతు వెడుతున్నారు. మావాళ్లు అలిసిపోయి, రెండోసారి స్నానాలకి సంసిద్ధులౌతున్నారు. అందరం చెఱువుకెళ్ళి స్నానాలు చేశాం. చెట్ల నీడల మధ్య నీళ్ళు చల్లగా వున్నాయి; శరీరాల్ని కడిగి పవిత్రంచేసే నిర్మలజలం. మళ్ళా నిర్మల!

భోజనాలదగ్గరే, నిర్మల చేసిన రెండో యత్నం గురించి రాఘవులు ప్రారంభించాడు. కాని నాకు తప్ప, యితరులెవ్వరికీ వినేటందుకు వోపిక లేదు. కాసేపు పడుకుని లేద్దామన్నారు. సరేనన్నాను. టెంట్ లో హోల్డాల్ విప్పుకుని పరున్నాను.

నేను లేచేటప్పటికి నాలుగైంది. అప్పటికప్పుడే మా మిత్రులందరూ ఆఫీసుపనిలో పడ్డారు ఆ చెట్లకిందే ఆఫీసు కాగితాల కట్టలు, ఫైల్సు, ట్రేలు, దవాలి బంట్రోతులు అటూ ఇటూ తిరగడం-నాకు నవ్వొచ్చింది. ఆ వుద్యోగిబృందాన్ని చూస్తూ కూర్చున్నాను ఇంతలో పెట్టిబండిరావడం, టపాల్ అందుకోడం-వారిజీవితంలో అదొక చరిత్రాత్మకఘట్టం. వార్తా పత్రికలు, మాగజీన్స్ వొచ్చాయి. నాముందు వో పత్రిక పడేశారు. గురవడు బ్రెడ్, సైసెన్ కింద తరిగిపెడుతుంటే, నేను వొక్కొక్కటే టీలో ముంచుకుని తింటూ చదువుకుంటున్నాను. గంట జరిగింది. ప్రేమానందంతో బాటు మిగతా వారందరూ లేచారు.

'ఏమండీ, మీకిక్కడెట్లా వుంది?' అని అడిగాడు ప్రేమానందం.

'చాలా బాగుందండీ-అప్పుడప్పుడు నాగరికతలోంచి యిట్లా పారిపోకపోతే, జీవితంపై విరక్తి కలుగుతుంది.' అన్నాను.

'మీ విషయంలో అంతే అనుకోండి. మేం మట్టుకు అప్పుడప్పుడు యీ అడివిలోంచి నాగరికతలోకి పారిపోవాలి.' అని నవ్వాడు. మిగతా వుద్యోగులందరూ అతని 'జోక్'కి నవ్వడం సాగించారు.

'పులివేటకోసం యిక్కడ మేమందరమూ మకాం చేశారుటగా. మీరిదివరలో, పులుల్ని వేటాడారా?' అని అడిగాను.

నేను నీలగిరి ప్రాంతంలో కొత్తగా పనిలో ప్రవేశించిన రోజుల్లో వేటకి వెళ్ళాముగాని, పులిని ఎదుర్కొనడం జరగలేదు' ఆయన యింకా చెప్పబోతుంటే మధ్యలో రాఘవులు అందుకున్నాడు—

'అవును, మధుసూదనంగారూ అప్పుడు అక్కడ వారివద్దే ట్రైనింగ్ అయ్యాడు. మధుసూదనం పులిని పొదల్లో నిద్రపోతుంటే చూశాట్ట. నిద్రపోతున్న పులిని చంపడం న్యాయం కాదని, వొదిలేశాడు అవునా మధూ?'

'అవుతే మధుసూదనం అసాధ్యుడన్నమాటే!' అన్నాను; మధుసూదనం అవన్నీ జ్ఞాపకం తెచ్చుకుంటున్నట్టు మౌనంలో పడ్డాడు.

అప్పుడు అతన్ని వుద్దేశించి శ్రీహరి యిల్లా అన్నాడు.

'మధుకేం-మధు ఎంతకేనా తెగించగల్డు పెళ్ళాం పెడాపులు లేదు గనుక.'

అందరూ నవ్వారు. మధుసూదనంపై ఛలోక్తులు ప్రయోగించి వినోదించడం, వారందరికీ పరిపాటైపోయింది.

'అదేంవన్నముక్క, పెండ్లిండ్లు జరిగిన మేం అందరం సాహసులం కామంటావా? సంసారం అంటే పులినోట్లో తలదూర్చడం కాదూ?' అన్నాడు మా రెడ్డి.

అందరూ బిగ్గరగా నవ్వారు. ప్రేమానందం నవ్వడానికి యత్నం మాత్రం చేసి విఫలుడయ్యాడని నా అనుమానం.

'చీకటి పడకముందే మా యిల్లు చూద్దురుగాని రండి.' అని ప్రేమానందం నన్ను ఆహ్వానించాడు.

నేనంగీకరించాను. రెడ్డి, నేను ఆయన, వారి బంగళావేపి నడవడం సాగించాం. మిగతావాళ్లు వెనుదిరిగారు.

'మధుసూదనం పులిని చూసినట్లు నాతో చెప్పలేదు. చిత్రం, ఇప్పుడు మీరందరూ అంటుంటే వినడమే' అన్నాడు ప్రేమానందం.

'దెబ్బతో అదిరిపోయి, మరిచిపోయుంటాడు. పైగా తరువాత కొద్ది రోజుల్లోనే, అతనికి బదిలీ అయిందిగా' అన్నాడు రెడ్డి.

"అవునవును"

'అవుతే, మీతో నన్నూ కూడా వేటకి తీసికెళ్ళాలి. నేను రెండు రోజుల్లో వెళ్ళిపోతున్నాను' అన్నాను.

'మీకిక్కడ కాలక్షేపం అవనట్లుంది. ఏదో యీ చుట్టుపక్కల వో ముసలిపులి వుండి, చాలా నష్టం కలిగిస్తోందంటారు యిక్కడివాళ్లు. వాళ్ళమాట పూర్తిగా విశ్వసించలేం; కాస్తుంటే గంపంతచేస్తారు. ఇదిగో తోకంటే, అదిగో పులంటారు తీరా వెళ్ళి చూస్తే, ఏమీ వుండదు నేనింత వరకూ, ఏడుమైళ్ళదాకా అడవిలో పర్యటనం చేశాను. రెండుగేదెల కళేబరాలు చూశాను గాని, పులి నాకంట బడ్లేదు. పైగా యిక్కడ మేం యీ పులికోసం కాంపెయిన్ చెయ్యలేము. ఈ అడవుంది చూశారూ, యిందులో సగంభాగం సంస్థానానికి చెందింది. దాని నిర్వహణ మన ఇండియా ప్రభుత్వం యాజమాన్యంలోకి తీసుకురావడానికి, కావల్సిన యేర్పాట్లు అంచనా వెయ్యమని మమ్మల్ని, యిక్కడికి పంపించారు.'

ఇంతలో బంగళాదగ్గరకి చేరుకున్నాం. రెండు కాంప్ కుర్చీలు బైట వడేశాడు. బంట్రోతు టీ తెచ్చాడు. ప్రేమానందం నీలగిరి అడవి అధికారుల తెలివితక్కువతనం గురించీ, ప్రస్తుతం అతను తలపెట్టిన కార్యకలాపం గురించీ చెప్పసాగాడు. సూర్యుడు దూరంగా చెట్లమాటుల్లో మరుగుపడ్డాడు. పక్షులు గీతరంగా రోదిస్తూ చెలరేగాయి. మేం లేచి సెలవు తీసుకున్నాం.

'మీరు వెళ్ళేలోగా వేటకి ఏర్పాటు చేస్తాను. రెండు మూడురోజులు ఓపికపట్టండి' అన్నాడు ప్రేమానందం.

నేను, రెడ్డి వెనక్కి తిరిగాం దూరంగా నాలుగైదు మేకలు రావడం చూశాం. వాటివెనక యిద్దరు స్త్రీలు-పనివాళ్ళు తాలూకు కాబోలు- నడుస్తున్నారు. వారి వెనక నిర్మలుండి—సూర్యుడు మరచిపోయి దిగవిడిచిన కిరణంలా, సంధ్యలో శరీరం ఎఱ్ఱబడి, ఆ ఎఱ్ఱదనం చీరని ఆక్రమించినట్లుగా వుంది. మాకు నలభై గజాల దూరంలోకొచ్చింది. ఎంత పీలగా బలహీనంగా వుంది! చీరమడతలకి లొంగిపోయిన పల్చటి రొమ్ములు! కాని, అది సమయంకోసం వేచివున్న సింహాపు నడుంలో యిమిడిన శక్తిలాంటి సన్నదనం! మాకు దూరమైపోయింది. రెడ్డి నన్ను వెనక్కి తిరిగి చూడనివ్వలేదు. మరుక్షణంలో మా ఎదురుగా మధుసూదనం, శ్రీహరి, మరిద్దరు బంట్రోతులు వొస్తున్నారు.

'ఇళ్ళకి పోతున్నాం. మళ్ళా వుదయం కల్సుకుందాం.' అన్నాడు శ్రీహరి.

'ఈ పూట మా టెంట్సులో పడుకుందాం రాకూడదూ? నా స్నేహితుడుకూడా వున్నాడు. పైగా యింటిదగ్గర ఎవ్వరూ లేరుగా' అన్నాడు మా రెడ్డి.

'నాకు తలనొప్పిగా వుంది. జ్వరంవొస్తుంది, నిద్రపోకుంటే' అన్నాడు శ్రీహరి.

'భోజనంచేసి నే వొచ్చివుంటాలెండి' అన్నాడు మధుసూదనం. మేం కాంపు దగ్గరకు చేరుకున్నాం.

భోజనాలయ్యాయి. గురవడు పెద్దకట్టెలు పేర్చి మంటచేశాడు. చెట్లమధ్య అందంగా వెన్నెలనీడలు పడుతున్నాయి. అక్కడ వెన్నెల మరింత నిండుగా స్వచ్ఛంగా వున్నట్లనిపించింది. అందులో నిశ్చలత్వం వుంది. ఫ్యాక్టరీపొగలు సిగరెట్టుపొగలు, మేఘాలు, దుమ్ము, ప్రేమతో అలసిన నిట్టూర్పులు—వీటివల్ల భంగంగాని ప్రశాంతత. ఆకుల రెపరెప నిలిచిపోయినప్పుడు, వెన్నెల ధ్వనిస్తే వింటున్నట్లుంటుంది. సర్వీచెట్ల సంగీతం జోలపాటలా అడివిని నిద్రపుచ్చుతోంది. ఎక్కడో ఏదో కీటకం రోదనతో పాటవేస్తూంది. ఏవో దూరంగా మృగాల అమోమయపు అరుపులు-అడివిజీవితంలో ఐక్యమయ్యాయి మా ప్రాణాలు.

అరగంటలో మధుసూదనం, శ్రీహరికూడా వో బంట్రోతు పెట్రోమాక్స్‌లైటుతో సహా వచ్చారు-మహారణ్యంలో అగ్గిపుల్ల వదేస్తే వెలిగినట్లుగా వెన్నెట్లో పెట్రోమాక్స్ లైటొకటి!

శ్రీహరి వొంట్లో అస్వస్థత కాస్త సర్దుకుందన్నాడు.

అందరం పక్కలు పరుచుకున్నాం.

'ఈ మధ్య వో చిత్రం జరిగిందండోయ్!' అని మొదలెట్టాడు రాఘవులు.

చెప్పమన్నాను.

'వో వారం క్రితం ప్రేమానందానికి వో ఆకాశరామన్న వుత్తరం వొచ్చింది—పోస్టులో'

'నీకెట్లా తెలుసు?' అన్నాడు రెడ్డి.

నేను వారింటివైపు వెడుతుంటే చెత్తకాగితాల కట్ట చెట్లవెనక పడి వుంది. నేను ఏమీ తోచక కెలికాను. అందులో మూడు కాగితపుముక్కలు నన్నాకర్షించినై. వాటిని సరిచేసి చదివాను. అందులో ఏముందో ఎరుగుదురా! 'నిర్మల ఆత్మహత్య ఎందుకు చేసుకుంటుందో కనుక్కున్నావా?' అని.

ఆ వుత్తరాన్ని విమర్శించి, తర్కించడం ప్రారంభించారు.

మా రెడ్డి అన్నాడు—

'నువ్వే వ్రాసివుంటావు. కొంటెపనులు నీకలవాటేగా!'

'ఛ ఛ—భలేవాడివే. మరెవరేనా అయితే అట్లాంటివి చేద్దురు. తెల్లారిలేస్తే, మన కాపునవాసన. ఆయన దగ్గర చేస్తానా, తప్పుకాదు?' అన్నాడు రాఘవులు.

'ఆ పని నిర్మలని ఎరుగున్న వాళ్ళెవరో చేసివుంటారు.' అన్నాడు రెడ్డి.

'ఇక్కడున్నవాళ్ళల్లో, ఎరుగున్నవాడు శ్రీహరి, మధుసూదనం' అన్నాడు రాఘవులు.

శ్రీహరి చెప్పాడు, సమాధానం.

'నేనెప్పుడు ఆ వూళ్ళోనే వున్నాను. కోర్టుకో సాక్ష్యానికెళ్ళాను. నిర్మల అత్తవారింటికి పదకొండుగంటల కెళ్లాను. ఆమె బావగారితో కాసేపు కబుర్లు చెప్పాను. భోజనాలు చేశాం. జట్కా తెప్పించి, నేనూ, మరిదీవూళ్ళోకి వెళ్ళాం. మరిది స్కూలుదగ్గ దిగిపోయ్యాడు. అప్పటికి పన్నెండున్నరైంది. కోర్టుపని చూసుకుని, సాయంత్రం ఐదున్నరకి స్టేషనుకు చేరుకున్నాను. ప్లాట్‌ఫారంమీద మధు కనిపించాడు- అప్పుడు అతనికి ఆ వూళ్ళోనే వుద్యోగం— రోడ్లయిలాకాలో —బుక్‌స్టాల్ చూడ్డాని కొచ్చాడట. మేం యిద్దరముండగా, మరికితో చదువుకునే కుర్రాడొక డొచ్చి, మాకీవార్త చెప్పాడు. నేను రైల్లో వెళ్ళిపొయ్యాను. మధు వెళ్ళి చూశాడనుకుంటా.'

'లేదు, లేదు- నీతో చెప్పలేదనుకో— నేనూ నీతోబాటే, ఆ రైల్లోనే ప్రయాణం చేశాను. మా పినతల్లి కూతురుకి ఏదో సంబంధం వొచ్చింది, రావాల్సిందని మా నాన్న వైరిస్తే వెళ్ళాను' అన్నాడు మధుసూదనం.

'మీరు అక్క డెంతకాలం వుద్యోగం చేశారు?' అనడిగాను.

'అబ్బే, చిన్న వుద్యోగం. తాశీల్దార్‌గారి ప్రోద్బలం మీద అంగీక రించి, నాలుగునెల్లు చేశాను. తరవాత అటవీశాఖలో ఈ వుద్యోగాని కొచ్చేశాను.

'ఆ నాలుగునెలల్లో మీకు ప్రేమానందంతో పరిచయం వుందా?' అనడిగాను.

'నా కంత పరిచయం లేదు. అతను మితభాషి. ఒకటి రెండుసార్లు, అతను సెలవుమీదొచ్చినప్పుడు, క్లబ్బులోనూ, సినిమాహాల్లోనూ చూశాను.'

'సినిమాకి భార్యాసమేతుడై వొచ్చేవాడా?'

'నేను చూడగా ఎప్పుడూ లేదు పైగా నేనక్కడున్న నాలుగు నెలల్లో రెండునెల్లు అతను అత్తవారింట్లోనే వుండేవాడు కాదోయ్. రెండు

మూడుసార్లు వాళ్ళింటికి వెళ్ళినప్పుడు, నిర్మలని కాని, ప్రేమానందాన్ని కాని ఎప్పుడూ చూళ్ళేదు.'

'పాపం!' అన్నాడు రాఘవులు.

'ఆ జోక్ నేను రెలిష్‌చెయ్యను రాఘవులు' అని మధుసూదనం కోపం సూచించాడు.

'మరవుతే, నువ్వు వాళ్ళింటికి వెళ్ళే అవసరం ఏమొచ్చిందోయ్ ?' అన్నాడు ధీమాగా రాఘవులు.

'నేను నీకు సమాధానం యివ్వక్కర్లేదు. వీరడుగుతున్నారు గనక చెబుతున్నాను. నేను ప్రేమానందంతో మాట్లాడదామనే వెళ్ళేవాణ్ణి. అతనొచ్చినప్పుడు కబురు చెయ్యమని, నిర్మలనరిదిని అడిగాను. అతనితో సంప్రదించి అడివిశాఖలో ట్రైనింగ్ పొందితే, వుద్యోగం దొరుకుతుందని శాస్త్రులు వ్రాశాడు ఆ విషయం ముచ్చటించడంకోసం వెళ్లేవాణ్ణి.'

'మొత్తం ఎన్నిసార్లు వెళ్ళుంటావు ?' అన్నాడు రెడ్డి.

'నేనా ?— నేను అరడజనుసార్లన్నా వెళ్ళుంటాను' అన్నాడు శ్రీహరి, తనని వుద్దేశించి ఈ ప్రశ్న అడిగారనుకుని.

'నిన్నెవ్వరూ అడగలేదు.' అన్నాడు రాఘవులు.

'అడక్కపోయినా చెబితే ప్రమాదం లేదు. సందేహం తీరి పోతుంది. నేను నిజం చెప్పేస్తున్నా. ఏదో సాకు వున్నా నేను నిర్మలని చూడాలన్న వుద్దేశంతో వెళ్లేవాణ్ణని ఒప్పుకోవాలి.' అన్నాడు శ్రీహరి. దీనితో అందరూ మౌనంలో పడ్డారు కాసేపు.

నేనే మొదట మాట్లాడాను.

'మీరు నిర్మలతో మాట్లాడేవారా ?'

'ఓ' అన్నాడు శ్రీహరి.

'ఆమెని గురించి మీ అభిప్రాయం ఏమిటి ?'

'నా అభిప్రాయం నిర్మలకి భర్తంటే యిష్టంలేదని.'

'అల్లా అనుకోడానికి ఆధారం ?'

'మనిషి వైఖరినిబట్టి. సరదాగా వుండేదీ కాదు, దిగులుగా కన బడేదీ. పేరంటాలు, స్నేహితులు, సినిమాలు ఏవీ వుండేవి కావు.'

'అత్తగా రెట్లాంటిది ?'

'అత్తగారు చాలా మంచిది. తల్లికంటె ప్రేమతో కోడళ్ళను చూచేది.'

'మామగారు ?'

'మామగారివల్ల కోడలి కేం బాధ కల్గుతుంది ? ఆఫీసుకు పొయ్యే వాడు, యింత గడించి పారేసేవాడు.'

'నిర్మల వ్యాధి లక్షణా లేమిటో డాక్టర్లు చెప్పారా ?'

'హిస్టీరియా. మందులు పనిచెయ్యలేదు. హిస్టీరియాకు కారణం భర్తలో ఏదో లోపం వుండటమేనని నా థియరీ,' అన్నాడు శ్రీహరి.

ఇది నాకు సబబుగానే తోచింది.

కాని మా రెడ్డి ఖండించాడు.

'అట్లాంటివాడు పెండ్లెందుకు చేసుకుంటాడు. పైగా యితను, కాలేజీలో చదువుకునేరోజుల్లో కొంత గ్రంథం జరిపి కథానాయకుడుగా వుండేవాడని విన్నాడి'

అట్లాంటివాళ్లే తమ లోపాన్ని కప్పిపుచ్చేటందుకు వన్నాగంపన్ని, పెండ్లి చేసుకుంటారు. ప్రపంచానికి తమలో లోపంలేదని చాటొద్దు మరి!' అన్నాడు రాఘవులు.

'నిర్మల భర్తను గురించి తనవాళ్ళకో చెప్పిందా ?' అని అడిగాను.

'ఏమో ! తల్లితో చెప్పివుండాలి. వాళ్ళు మాత్రం ఏం చేస్తారు. వివాహం రద్దు చేసుకున్నా, తనకి మళ్లా పెండ్లి చేసుకునే హక్కులేదు. మరొకర్ని చూసుకుని రహస్యంగా ఏడవాలి.' అన్నాడు శ్రీహరి.

'అట్లాంటి వ్యక్తి నీ ఎఱికలో ఎవరేనా వున్నారా !' అని అడిగాడు మా చంద్రారెడ్డి. అది నే నడగాలనుకున్న ప్రశ్న. కాని ధైర్యంలేక మానేశాను.

'ఏమో, వుండి వుండొచ్చు. లేకపోతే ముందుముందు దొరకొచ్చు.' అన్నాడు శ్రీహరి.

'అనాడు మధుసూదనం కూడా నిర్మలని చూశాడు.' అన్నాడు రాఘవులు.

'అవును. నే నారోజున అక్కడే వున్నాను. రేపోమాపో ప్రేమానందం వస్తాడు, సెలవలేగనక, అక్కడే వుండమంది నిర్మల అత్తగారు.' అన్నాడు మధుసూదనం.

'నిర్మల మీతో మాట్లాడేదా ?'

'అల్లాకాదు అడగవల్సింది. నువ్వు నిర్మలతో మాట్లాడేవాడివా ?' అని రాఘవు లడిగాడు.

'తెలివిగా అడిగాననుకుంటున్నావు కాబోలు. పరీక్షచేసి, నేనేదీ డైరీలో వ్రాసుకోలేదు. మొత్తంమీద మాట్లాడటం జరిగేది- తన ఆరోగ్యం గురించీ, పుట్టింట జీవితం గురించీ, తను స్కూలు కెళ్ళిన రోజుల్లో వేసిన నాటకాలు- ఈ విషయాలు' అన్నాడు మధు.

'సరే ఆనాటి విశేషాలు చెప్పండి' అని కోరాను.

'ఉదయం లేచి కాఫీలు త్రాగింతర్వాత....' అని మొదలెట్టాడు మధుసూదనం.

'క్షమించాలి— కాఫీ ఎవరు కలిపారు ?' అన్నాడు రెడ్డి.

'నాకు గుర్తులేదు. అందరికి కాఫీలు యివ్వడం నిర్మలే యిచ్చేది. తర్వాత కాసేపు నేనూ, ఆమె మరిదీ- అతనిపేరు కోటీశ్వరరావు- కాసేపు కేరమ్సాడాం- తొమ్మిదింటికి కాలవకి స్నానానికెళ్ళాను. పదింటికి భోజనంచేసి, స్నేహితుడింటికెళ్ళి ఒంటిగంటకొచ్చాను.'

'ఓహో, అందుచేత, శ్రీహరి వొచ్చినప్పుడు నువ్వు యింట్లో లేవన్నమాట. నువ్వు రాగానే అతను వెళ్ళిపొయ్యాడన్నమాట.'

'అవును. వొంటిగంటన్నరకి రేడియోలో ఇంగ్లీషు వార్తలు విని, నేను నిద్రపొయ్యాను. అరగంటలోనే లేచిపోయాను. రెండుంపావుకి కాఫీ త్రాగాను. మా నాన్నగారి టెలిగ్రాం చూసుకున్నాను- యింటికి రమ్మని. నా బాగ్ తీసుకుని, రెండున్నరకి వెళ్ళిపొయ్యాను. స్టేషన్‌కి వెళ్లేటప్పటికి రైలు వెళ్ళిపోయింది. పుస్తకాలు చూస్తూ ప్లాట్‌ఫారమ్‌మీద వుండి ఆరుగంటల రైల్లో మా వూరెళ్ళిపొయ్యాను.'

'మరో విషయం అడుగుతున్నాను ఏమీ అనుకోకపోతే. నిర్మల

ఆత్మహత్య విషయం, ఐదుగంటలకు మీరు స్టేషన్‌లో వుండగా తెలిసింది. చూడ్డాని కెందుకు వెళ్ళలేదు ?' అనడిగాను.

'చూసేటందు కేముంది. నిర్మల అప్పటికే తేరుకుంది. పైగా, నేనింటికి వెళ్ళటం జరుగదు టెలిగ్రాం' అన్నాడు మధు.

శ్రీహరి మరో ప్రశ్న వేశాడు.

'నేను, స్టేషన్ కెందుకొచ్చావు?' అనడిగినప్పుడు, వూరికెడుతున్నానని చెప్పక, పుస్తకాలకోసం అని ఎందుకు అబద్ధమాడావు ?'

'రైలు తప్పగానే, కూర్చుని విసుగెత్తి, ఒక సమయంలో యింటికెళ్ళి, తెల్లరగట్ల రైలు కెడదా మనుకున్నాను. ఆ విసుగుదల సమయంలో నువ్వు ప్రశ్నించావు. సాయంత్రం పాసెంజరు ఆ రోజున టైమ్ కొచ్చింది. ప్రయాణమయ్యాను.

'పుస్తకాలషాపులో గంట చూశారుకదా, ఏదేనా పుస్తకం కొన్నారా?' అనడిగాను.

'లేదు, నా దగ్గర డబ్బులేదు, ఐదులు, ఆరులు ఖర్చుపెట్టి పుస్తకాలు కొనేటందుకు' అన్నాడు.

'పోనీ, యీ పుస్తకంకొంటే బాగుండునే అనిపించింది. అనిపిస్తే, ఏ పుస్తకం ?' అనడిగాను.

'నాకు నిజంగా జ్ఞాపకంలేదు. ఎవరికి కనిపించదు ? విల్కీ కాలిన్స్ నవల 'దీ వుమణ్ ఇన్ వైట్' కొనాలని వుండేది' అన్నాడు మధు.

పదినిమిషాలు, మా వాళ్ళందరూ నవల్ని గురించి తర్కించారు. నాకు మరో సందేహం వొచ్చి, మధుని అడిగేశాను. 'ఆ రోజున పోస్టుమాన్ ఎప్పుడొచ్చాడు ?'

'మామూలుగా. పదిన్నరకొస్తాడు. ఆ సమయంలో నే నింట్లో లేను రెండున్నరకి, పోస్ట్‌మాన్ టెలిగ్రాం యిచ్చాడని యిందాకనే చెప్పాగా.'

మా రెడ్డి నిద్రొస్తోందని అవలించి, నిద్రపొయ్యే సంకల్పంతో శరీరాన్ని పక్కమీద వాలేశాడు. మధుని ఆఖరు ప్రశ్న అడిగేశాను.

'అవుతే, నిర్మ లట్లాగెందుకు చేసిందో మీ కేమన్నా తెలుసా ?'

'నాకు తెలీదు. కారణం ఏమీ కనిపించలేదు.'

'కారణం లేకుండా ఎవరన్నా అట్లాంటిపన్లు చేస్తారా ?'

'స్త్రీలు ఎంతకేనా తెగిస్తారు.' అన్నాడు మధు.

'ఏమోయ్, స్త్రీలు అని బహువచనం వాడుతున్నావు, ఎందరు స్త్రీలతో పరిచయముంది నీకు ?' అన్నాడు రాఘవులు, నవ్వుతూ.

'అకారణంగా తెగిస్తారా ?'

'ఏమో నాకేమీ తెలీదు.'

మిగతా అందరూ నిద్రలో పడుతున్నట్లనిపించింది నాకు ఈ విషయం ఆరాతియ్యడానికి వారేమీ కుతూహలం కనపర్చడంలేదు. మధ్య నా కెందుకు ? నేనూ, ఆలోచిస్తూ పడుకున్నాను. స్త్రీలు ఎంతకేనా తెగిస్తారు ! స్త్రీలని గురించి ఆలోచించడం మొదలెట్టాను. నిర్మలకథ విని, డిటెక్టివ్ నవలా రచయిత ఎట్లాంటికథ అల్లుతాడా అని వూహించాను. డిటెక్టివ్ నవల్సు వ్రాయడంలో స్త్రీ రచయితలు కనపర్చిన చమత్కారం, ప్రతిభ, ఏ పురుషుడూ కనబర్చలేదు ప్రథమశ్రేణికి చెందిన రచయిత లందరూ స్త్రీలే- డొరోతిసేయర్స్, మార్జెరీ అలింగామ్, గేయొమార్ష్, అగాతాక్రిస్టీ వీరందరూ నిర్మలతో ఎట్లాంటి కథ వ్రాద్దురో ! ఆ ఫక్కీలో ఏదోకథ ఊహలో అల్లుతుంటే నిద్రపట్టేసింది. దూరంగా, ఏవో అడివి మృగాల అరుపులు వినబడుతున్నాయి. మానవుడి హృదయంలో అధో లోకం వుంది. అందులో బంధించబడ్డ, తీరని వాంఛలనే క్రూరమృగాల అరుపులూ అట్లాగే వుంటాయి. గర్జించి, బైటపడి, స్వప్నంలో విహరిస్తాయి; అవకాశం చిక్కితే, మేలుకుని వున్నప్పుడే, చైతన్యాన్ని చీల్చుకుని పైనపడి మింగేస్తాయి. అవి బైటపడకుండా వుండేందుకా అన్నట్లు చాలామంది శాలువాలని పైకిలాక్కుని, ముసుగు బిగతన్ని పరుంటారు !

తెల్లవారింది. ఆ చంద్రుడే సూర్యుడైనట్లు, మెత్తటి కాంతి ఆకుల మధ్యనుంచి, నా శాలువలో ధూరింది. ఉలిక్కిపడి లేచాను. చంద్రుడు

కాడు, సూర్యుడే ప్రకాశిస్తున్నాడు. కాలకృత్యాలు తీర్చుకుని రొట్టెలు, టీ తీసుకున్నాం: స్నానాలు చేసేటప్పటికి తొమ్మిదైంది. వాళ్ళందరూ ఆఫీసు పని చూసుకుంటాం అన్నారు. నేనూ, గురవయ్యా అల్లా బైలుదేరాము. రెండుమైళ్ళదాకా నడిచివెళ్లాం. మాకు ఒక్క అడవిమృగం కూడా కనబళ్ళేదు. గురవయ్య ఆ చుట్టుపక్కల మసలిపులి చేస్తున్న దురంతాలు వర్ణించాడు. మేం తిరిగి వచ్చేటప్పటికి పన్నెండు కావచ్చింది: అప్పటికి ప్రేమానందం వెళ్లిపొయ్యాడు. భోజనాలుచేసి, మళ్ళా కబుర్లు మొదలెట్టారు.

'మీరంతా ఒకచోట కూర్చుని కాగితాలపని చేసుకోడం అయితే, యీ కాంప్ చెయ్యడం ఎందుకు ?' అని అడిగాను.

రెడ్డి సమాధానం యిచ్చాడు.

'రంగనాథన్ అని మరొక పెద్ద ఆఫీసరు కూడా రావాలి. ఈ ఉదయం వొచ్చి, కాంప్‌వేశాడుట- ఇక్కడికి ఎనిమిదీ మైళ్ళల్లో మరో బంగళా వుందిలే. ఆయనా, మేమూ కలసి, రేపో, మాపో పర్యటనం సాగిస్తాం. ఆయన్ని కలుసుకోడానికి ప్రేమానందం సాయంత్రం వెడతాడుట.

'చూడండి- ఈ రెండురోజులూ మేం చెప్పినవన్నీ విన్నారు, ఆలోచించారు. నిర్మల విషయం ఏమన్నా తేలిందా ? అని అడిగాడు రాఘవులు.

'ఆఁ' అన్నాను.

అతను ఆశ్చర్యం ప్రకటించాడు. శ్రీహరి నా దగ్గరగా జరిగాడు. ఆఖరికి రెడ్డి కూడా లేచి కూర్చుని, నాకేసి ప్రశ్నార్థకంగా చూశాడు.

'చెప్పాలి' అన్నారు ముగ్గురూ.

'రాత్రంతా ఆలోచించాను ఒకరకమైన కథ ఊహలో రచించుకున్నాను. కాని ఋజువు చెయ్యమంటే చెయ్యలేను' అన్నాను.

'మాకు ఋజువులు, ప్రమాణాలు అక్కర్లేదు. చెప్పండి- ఒరే, గుంపా, రెండు చుట్టలు కట్టి, టీ పెట్టరా.' అని కేకేశాడు రాఘవులు.

'చెప్తాను వినండి నా కథ మొదట్లోనే ప్రారంభమైంది. నిర్మలని ప్రేమానందాని కివ్వడం స్థిరపడింది. తాంబూలాలుచ్చుకున్నారు. ఇది జరిగింతర్వాత- ఎప్పుడో చెప్పలేను- ఆమె జీవితంలోకి మరో వ్యక్తి ప్రవేశించాడు- అతన్ని 'ఎక్స్' అని వ్యవహరిద్దాం- నిర్మల అతన్ని చూడ్డం, ప్రేమించటం ఒకసారి జరిగింది. నిర్మలని తీవ్రమైన వుద్రేకాలు. ప్రేమించినా ద్వేషించినా, క్రమం, పద్ధతి, కారణం, ఔచిత్యం, సహజం, న్యాయం- యివేవీ పాటించదు ఆమెకి 'ఎక్స్' పరిచయం కలిగింపే. మాటలు జరిగాయి. కాని తలిదండ్రులకి, పెండ్లికి మాటిచ్చేసింది ఏం చెయ్యడం ? ఆ పెండ్లి వద్దంటే ఏవో కుతంత్రం జరుగుతోందని నలుగురూ పసికడతారు. తన శీలాన్ని శంకిస్తారు.... మరీ ఘోషాలో వుంచేస్తారు. తను స్వేచ్ఛ పోగొట్టుకుంటుంది. 'పెండ్లివల్ల మన ప్రేమకి అంతరాయం ఎందుకుండాలి ? అంతరాయంవల్ల మన ప్రేమ మరింత పదునెక్కుతుంది' అన్నాడు 'ఎక్స్'. ఇంకేంకావాలి ?

ప్రేమానందాన్ని పెండ్లాడింది. నాలుగునెలల్లో కార్యం అన్నారు. ఏంచెయ్యాలి ? ఎక్స్‌ని కలుసుకుని చెప్పింది. ఎక్స్ బాధపడ్డాడు. అతను చిన్నవాడు. ఉద్యోగం లేదు. ఎవర్నీ సలహా అడిగే వ్యవహారం కాదు. 'ఇంతేనా మన ప్రేమ' అన్నాడు. నిర్మల వాగ్దానం చేసింది. చేతిలో చెయ్యేసింది. భర్తను తాకనివ్వనంది. సరా? ఎట్లా సాధ్యం అని అడిగాడు. నీ కెందుకు నేను చూస్తాగా. నన్ను నమ్ము, అంది నిర్మల. ఎక్స్ తన హృదయాన్ని ఉత్తరం ద్వారా బైటపెట్టి, ఆమె కందిచ్చాడు సంతోషంతో నిర్మల సమాధానం పంపింది.

కార్యం రాత్రొచ్చింది. నా ఆరోగ్యం బాగాలేదంది. కొంతకాలం వరకూ ఆమెని విడిచిపెట్టమని, ప్రేమానందాన్ని బ్రతిమలాడింది. అతనికి కోపం వొచ్చింది. చదువుకున్నవాడు- బలాత్కరించగలడా ? జబ్బుంటోంది, ఏదన్నా జరిగితే, నలుగురూ అతనికి గెడ్డెడతారు. ఏవో సణిగాడు. నిర్మల లాలించింది; మాటలతో మంచి చేసుకుంది. పెద్దలందరికోసం కార్యం, ఎవళ్ళకీ తెలీనక్కర్లేదు- తృప్తిపరిచింది. పక్కకి తిరిగి ముసుగెట్టుకుని పడుకున్నాడు.

'మందిప్పించడం లేదా మీ వాళ్ళు?' అనుంటాడు రెండో రాత్రి.

'మావాళ్ళు కార్య వొద్దన్నారు. మీ వాళ్ళు నిర్బంధం పెడితేనేగా యీ తంతు ఏర్పాటుచేశారు?' అనుంటుంది.

అలాగే మూడురాత్రుళ్ళూ గడిచిపొయ్యాయి. భర్త వెళ్ళిపొయ్యాడు. నిర్మల ఎక్స్‌తో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతోంది. ఒక ఉత్తరంలో 'ఎక్స్' అసూయ ప్రకటించాడు. ఆడదాన్ని నమ్మకూడదన్నాడు. 'తను హాయిగా భర్తతో గడుపుతోంది— అతనుపడేవిరహం ఆమెకేం తెలుసు' అనుంటాడు. శెలవల్లో భర్త వొచ్చాడు. జబ్బు— పిల్లోదంది- అతనికే జబ్బు కనబళ్ళేదు విసుక్కున్నాడు. 'ఏంకథ?' అన్నట్లుగా, అస్పష్టమైన ఆరోపణలు సాగించాడు ఎట్లాగనుకున్నా ఫరవాలేదంది. భర్త వెళ్ళిపోయాడు.

ఎక్స్‌ని కలుసుకుని, జరిగిందంతా చెప్పింది, నిర్మల. వారిద్దరూ, వొక్కరాత్రేనా గడిపే అవకాశంలేదు. ఏం చెయ్యటం? నీ కెందుకు, నీవు హాయిగా భర్తున్నాడు. ఏదో తమాషాకి ప్రేమిస్తున్నావనీ, నన్ను ఏడిపిస్తున్నావనీ అన్నాడు. మళ్లా ప్రమాణాలు, వొట్లు నువ్వు తప్పుకుంటే మనం కలుసుకోలేమా! అన్నాడు. ఏం చేస్తుంది? అతనికి నమ్మకం కలగడం ఎట్లా? తెగించింది. నిర్ధారణ కొచ్చింది. నాన్న క్యాంప్ కెళ్లాడు అమ్మ పడుకుంటుంది. మధ్యాహ్నం. ఏం? ఏర్పాటుచేసి రమ్మంది. అతను వెళ్ళాడు. అంతా అనుకున్నట్లే జరిగింది. గదిలో ఏకాంతంగా కూర్చుని గుసగుసలు సాగించారు. ఏం జరిగిందో, ఎంతవరకూ జరిగిందో వూహించలేం- ఏం జరిగినా అట్టే సేపు జరగలేదు. పోస్టుమన్ పిలిచాడు. లేచి వెళ్ళింది. భర్త దగ్గరనుంచి కవరు. ఆమెకి ఎవరో వున్నారనీ, ఆ విషయం తను తెలుసుకున్నాడనీ, అందుచేత ఆమెని వొదలెయ్యడం తప్ప గత్యంతరం లేదనీ, భర్త వ్రాశాడు. నిర్మల దిగులుపడింది; భయపడింది. గదిలోకెళ్ళి, తలుపుజేరవేసింది. రెండు క్షణాలలో ఎవరో తలుపు తోశారు. ఎవరంది. 'నేనే, పేపరొచ్చిం

దేమో చూద్దామని-పోస్టుమన్ వొచ్చాడుగా’ అన్నాడు మనోరమ బావగారు అవును పోస్టుమన్ పేరు కూడా తెచ్చాడు. హాల్లోబల్లమీద పెట్టాన తీసుకోమంది. ఇంతలో చెల్లెలు లేచినట్లు’ వంటింట్లో చప్పుడైంది. హాల్లో కెళ్లి, వంటింటి తలుపు జార్లేసి, సందుగదిలోంచి, ఎక్స్‌ని బైటకి పంపించి వేసింది. అతను వెళ్ళగానే నిర్మల భయపడింది. మనోరమ బావగారు, వారిద్దర్నీ చూశాడేమో- భర్త ఉత్తరం వొకటి- వొదిలేస్తానని బెదరించాడు. ఏం చెయ్యడం ? మతిపోయి, నూతులో కురికింది.

ఇంక రెండో యత్నం

మధ్యలో శ్రీహరి ఆపుచేశాడు.

‘ఆగండి, ఆ రోజు మధ్యాహ్నం రెండింటికి నేవెళ్ళాను. ఆ సమయంలో ‘ఎక్స్’ ఇంట్లోనే వున్నాడంటారా! నేను నమ్మలేను. నేను రేడియో విన్నాను. పేపర్ చదివాను. తర్వాత నిర్మల మనోరమ బావ గార్ని లేపి కాఫీ యిచ్చింది. నేను వెళ్లిపొయ్యాను. నా వెనకాలే అతనూ వొచ్చాడు’ అన్నాడు శ్రీహరి.

‘ఆ తలుపుతట్టి పేపర్ అడిగింది మీరే కావొచ్చు. నిర్మల, అడిగిన వారు మనోరమబావగా రనుకుని వుండొచ్చు. తీరా తను ముందుగదిలో కెళ్ళనప్పుడు, అతను నిద్రనటించకూడదూ ? అతను కాఫీతాగి వెళ్లిపోయిన సంగతి ఆమెకేం తెలుసు ?

‘సరే— రెండోయత్నం పూర్తిచెయ్యి’ అన్నాడు చంద్రారెడ్డి.

‘నిర్మల అత్తవారింటి కెళ్లింది. అక్కడ బాగానేవుంది. అత్తగారి కోడరికం లేదు: తోటికోడలు సరదా అయిన మనిషి. భర్తా, తనూ వున్నా, ఆ రోజుల్లో కూడా అంతరంగికంగా కలుసుకోలేదని నా నమ్మకం.

భర్త ఆమెని విశ్వసించేటట్లు చేసుకుంది మాటలవల్ల. ఉద్యోగంలో కెళ్ళిపొయ్యాడు. ‘ఎక్స్’ ఆ వూళ్ళో వున్నాడు. తరుచుకలుస్తుండేవాడు: కలుసుకున్నప్పుడు, ఉత్తరాలు వ్రాసి అందిపుచ్చుకోటం జరిగేది. ఉత్తరాళ్లలో వారి ప్రేమనంతా వెళ్ళబుచ్చుకుని తృప్తిపడేవారు. అనాడు,

ఉదయమో, మధ్యాహ్నమో, 'ఎక్స్' ఆమెకివో ఉత్తరం యిచ్చాడు మధ్యాహ్నం నిశ్శబ్దంగావుంది— తనూ గదిలోకెళ్ళి పడుకుని, ఆ ఉత్తరం చదువుకుంది. గది తలుపులుమూసి, ఆ ఉత్తరానికి ప్రత్యుత్తరం వ్రాసింది. వ్రాస్తుంటే ఆ గదిలోకి మరిది— కోటేశ్వరరావు- గభాలున వొచ్చి 'ఏమిటని' అడిగాడు. ఆమె వులిక్కిపడి, ఉత్తరం దాచేసింది. అతను వెళ్ళిపొయ్యాడు. ఆ ఉత్తరం తన ట్రంక్‌పెట్టెలో దాచేసి, వంటింట్లోకెళ్లి పనిచూసుకుంటోంది. రెండున్నర దాటింది. కొంటె మరిది, తాళాలు ఎల్లాగో పెల్లగించి, ట్రంకుతెరచి, ఆమె వ్రాసిన ఉత్తరం సంగ్రహించాడు నిర్మల చప్పుడు విని పసికట్టి గదిలోకొచ్చి చూసుకుంది. ఉత్తరం లేదు. కొంప మునిగిందనుకుంది. మరిదికోసం యిల్లంతా వెదికింది. ఎక్కడా లేడు. ఏం చెయ్యడం? మరిది అసాధ్యుడు. ఆ వుత్తరం అన్నగారికి చూపిస్తాడు. తనకి తలవొంపు, పరిత్యాగం, నింద తప్పవు. తాత్కాలిక పౌరుషం, వుద్రేకం, ఆమెని వొక నిర్ణయానికి తీసుకొచ్చాయి. గబగబ దొడ్లోకెళ్ళి నూతులో పడింది.

నిర్మల యింకెన్నడూ ఆత్మహత్య తలపెట్టదు' అని నా గాథ ముగించాను.

మొదట మాట్లాడింది రెడ్డి.

'నాకంతా బాగానే కనపడుతోంది. కాని వొకటి నచ్చలేదు. 'ఎక్స్'ని కలవడంకోసం, భర్తని దూరంగా వుంచడం, వాగ్దానాలు— అవన్నీ అసహజంగా కనబడుతున్నాయి. నా చిన్నప్పుడు, మా అమ్మమ్మ రాజకుమార్తెలను గురించి చెప్పే కథమాదిరిగా వుంది.'

గురవయ్య టీ తెచ్చాడు. అందరం మాట్లాడకుండా త్రాగాం. తరువాతి వ్యాఖ్యానం రాఘవులు చేశాడు.

'మీరు చెప్పిన గాథలో నిర్మల భర్తతో కూడక, ఎక్స్‌ముందు పాతివ్రత్యం ప్రకటించడం తప్ప— యింకేమీ హర్షించదగ్గ వివరాలు లేవు. మామూలుగా మనం పత్రికలో చదివే వ్యభిచారుల గాథలా వుంది. నిర్మల అందమైంది కావొచ్చు. ఆమె చర్యలో కవిత్వంగాని, కళానుగుణ్యమైన సౌందర్యంగాని గోచరించలేదు.'

అందమైన స్త్రీ శరీరాలకు అందమైన ఆత్మలను కలిగించడం, పురుషుడి దౌర్బల్యానికి చిహ్నం' అన్నాను నేను.

అందరికంటే ఎక్కువ ఆశ్చర్యం ప్రకటించింది శ్రీహరి.

'అయితే, హంతకు డెవరండీ ?' అనడిగా డతను.

'అది మీరు నిర్ణయించాలి' అన్నాను.

'నే ననా మీ వూహ !'

నేనల్లాగనలేదు ? డిటెక్టివ్ నవలాకారుడు కథ చెప్తాడు: హంతకుల్ని పాఠకులు పట్టుకోడంలోనే వుంది, ఆనవల్స్‌లోని మజా' అన్నా.

'నన్ను నిర్మల ప్రేమించటం సంభవమా ?' అని అడిగాడు శ్రీహరి.

'స్త్రీలు ఎవర్ని ప్రేమించరో, ఎందుకు ప్రేమిస్తారో, ఎందుకు ప్రేమించరో సృష్టించిన బ్రహ్మదేవుడు కూడా నిర్ణయించలేడు' అన్నాను కచ్చితంగా.

ఇంతలో పెట్టిబండి వొచ్చింది. పత్రికలు, టపా చూసుకున్నారు. చంద్రారెడ్డి, ఆఫీసుకవర్లు చింపి చదివాడు.

'నాకేమన్నా వుత్తరాలున్నయ్యా ?' అంటూ ముగ్గురూ ఎగడ్డారు.

'ఉంది. మధుసూదనానికి, ట్రాన్స్‌ఫర్ ఆర్డ రొచ్చింది' అన్నాడు రెడ్డి. ఆర్డర్ చేతి కిచ్చాడు. అవును, మధుసూదనాన్ని, ఉత్తర జిల్లాలకి—పర్లాకిమిడికేసి బదిలీచేశారు. అతని స్థానంలో 'ఉన్నిథన్' అనే మళయాళీని వేశారు తక్షణం చార్జీ యిచ్చి: కొత్త చోటులో ప్రవేశించాలని వుత్తరువైంది.

'ఇదేమిటి, యిక్కడికొచ్చి, నెలేనా కాలేదు— పోదురూ, గవర్నమెంటు సర్వీసు యిల్లాగే ఏడుస్తుంది. అర్థం పర్థం లేదు. బదిలీలకి—' అని రాఘవులు, శ్రీహరి విసుక్కుని, మధుని బుజ్జగించి, సానుభూతి ప్రకటించడం సాగించారు. సంభాషణంతా బదిలీని గురించి. ఆ గొడవలో హంతకు డెవరో తెలుసుకోవాలన్న బాధ్యత నాకు తప్పింది ఆ విషయం ఎవరూ ఎత్తలేదు.

మధుసూదనం, ఛార్జీ వొప్పగించేటప్పటికి మూడు దాటింది. మళ్ళా మేం మొహాలు కడుక్కుని, మంచి దుస్తులు వేసుకుని, మధుసూదనాన్ని యింటిదాకా సాగనంపటానికి ప్రయాణమయ్యాం. మధు 'తలనొప్పిగా వుంది, కాసేపు యింటికెళ్ళి విశ్రమిస్తా' నన్నాడు. మర్నాడే అతను సామాన్లూ అవీ సర్దుకుని వెళ్ళటానికి నిశ్చయించుకున్నాడు. కొత్త స్థలంలో చేరేటందుకు, యింకా ఆరురోజులు వ్యవధుంది. ఈలోగా, యింటికెళ్ళి, నాగుర్నీ చూసి, డబ్బూ గట్రా తీసుకుని వెడతాడుట. అతన్ని ఇంట్లో దిగవిడిచేటప్పటికి నాలుగు దాటింది. ఆ ట్రాన్స్‌ఫర్‌తో వాతావరణంలో దిలాసా తగ్గింది. నాకూ మొన్నాడు బైలుదేరి వెడదామా అనిపిస్తోంది. ప్రేమానందాన్ని వేట విషయం అడిగి, తొందర్లో ఏర్పాటు చెయ్యించ మని కోరడం మంచిదనుకున్నాను. మా రెడ్డి సలహా అడిగాను.

'రామనాథాన్ని చూసి, ఆయన సాయంత్రానికి వొచ్చేస్తాడు. కావా లంటే సాయంత్రం అడుగుదుగ్గాని' అన్నాడు రెడ్డి అల్లా కొండదాటి, చెరువుదాటి, లోయలో నడుస్తూ వొస్తున్నాం. ఇంతలో వో ముసిలాయన వొగర్చుకుంటూ మా దగ్గరకొచ్చాడు.

'ఈ ప్రొద్దుటే పులి, బర్రెపోతుని పొట్టనెట్టుకుందండీ స్వాము లోరూ!' అన్నాడు. వివరా లడిగాడు రెడ్డి.

'కట్టెలు కొట్టటానికి పోయుండాం మా ఆడోళ్ళు, నేనూ. మేకల కుర్రాడు— మస్తాన్‌గాడు మాతో వుండాడు. బర్రెలని ఆడే తోలు తుండాడు. పొదల ఎనక్కి బర్రెపోతు ఎళ్ళిందట. ఆడు వెదుకుతుండగా, పొదల్లో సప్పుడైంది. మస్తాన్ లగెత్తుకొచ్చాడు. మేం గొడ్డళ్ళూ అవీ తీసుకుని పరుగెత్తాం బర్రె పోయింది పులి జాడేలేదండి, యిసిత్రం— అడుగులు గుర్తులుండైతేండి —'

'ఎంత దూరంలో ?'

'అడవి మొగలోనేనండి — రెండు కోసులు దూరం.'

అప్పటికి సూర్యు డస్తమిస్తున్నాడు ఈ వార్త పురస్కరించుకుని, ఆ రాత్రే వేట ఏర్పాటు చెయ్యమని ప్రేమానందాన్ని అడుగుదామని,

అతని బంగళాకి వెళ్ళాం. పనిచేసే వాళ్ళపిల్లలు ఆడుకుంటున్నారు. ఇంకా అయ్యగారు యింటికి రాలేదన్నారు.

'పోనీ, వో వుత్తరం రాసిచ్చిపోదాం' అన్నాను. రెడ్డి సరేనన్నాడు.

'ఒరే, కుర్రాడా, అమ్మగార్ని పిలుస్తావా ?'

'ఓ, చెబువుకా దుండారు' అని వాడు వెళ్ళాడు. పది నిమిషాల్లో నిర్మల చక్కావొచ్చింది. నన్నుచూసి మందహాసం చేసింది.

'ఇంకా రాలేదు' అంది. నిర్మల కంఠం అదే మొదటిసారి వినడం నేను. కంఠం వినకపోయినా బాగుండునే అనిపించింది. అందులో మార్దవం లేదు; మాధుర్యం లేదు. కోకిల కంఠంకాదు. ఓ విధంగా నెమలి కంఠంలా వినిపించింది. అందులో కొంత బొంగురుతనం; మసీదులో డోలు వాయిస్తే మారుమ్రోతలాగా— జీర వున్నాయి. సౌందర్యానికి వోర్వలేక, సరస్వతి ప్రాధేయపడి ఆ కంఠాన్ని పాడుచెయ్యమని కోరి నట్లు.... లేక అతృతతో, కొత్తదనంతో, సిగ్గుతో పగిలిన కంఠమా ? కుర్రాడికి సంజ్ఞచేసి, కుర్చీలు, బల్ల బైట వేయించింది.

నల్లరంగు, పల్చటిచీర నిండుగా కప్పుకుంది. చేతికి రెండే గాజులు— వొకటి బంగారంది; రెండోది ఎర్ర ప్లాస్టిక్‌ది. విషాదంతో వొణికే పెదవులు తీవ్రంగా లోకాన్ని శాసించే నాసాపుటాలు. కామాన్ని జుట్టుముంగురుల్లో మెలితిప్పి బంధించినట్లు కనబడని పాపిడ. నే నెప్పుడూ మరిచిపోని, ఇంద్రజాలంతో తళుక్కుమనే ఆమె నేత్రాలు— అన్నీ సంధ్యలో అసహజంగా స్వప్నంలోలాగా, మాయగా కనిపించాయి.

'వొస్తుంటారు. కూర్చోండి; టీ పెడతాను' అంది.

'అప్పుడే రెండుసార్లయింది. శ్రమ పడకండి' అన్నాను.

నిర్మల కళ్ళల్లో నవ్వు చెక్కిళ్ళమీదికి జారింది. ఈ అల్పమైన శరీరంలో, యీ లేత జీవిలో, యింతశక్తి, యింత బలం, యింత తృష్ణ, అడివిని దహించివేసే ప్రేమజ్వాలా !

'కాగితం, కలం యిప్పిస్తారా ?' అన్నాడు రెడ్డి. ఆవిడ యింట్లోంచి లెటర్‌పాడ్, పెన్ తీసుకొచ్చి బల్లమీద పెట్టి, లోపల గుమ్మంలో కెళ్ళి నిలబడింది.

'మీ కిక్కడ వాళ్ళకిరికీ భయంగా వుండదూ?' అని లోపల ప్రశ్న నిర్మాణం చేసుకున్నా కాని, బైటకి అడగలేకపోయ్యాను. ఉత్తరం వ్రాశాను—

అమ్మా,

ఈ వుదయం పులి అడివిలో బర్రెను చంపి తీసుకుపోవడం చూసినవాళ్ళు నాతో చెప్పారు. ఈ రాత్రి, అది మన అడవిలోనే వుండొచ్చు. అంచేత, యీ వుత్తరం చూసుకున్న తక్షణం మీరు వేటసన్నాహం చేస్తారని ఆశిస్తున్నాను. మధుసూదనానికి ట్రాన్స్‌ఫరైంది; తన వొంట్లో కూడా బాగాలేదన్నాడు; ఛార్జీ యిచ్చేశాడు. రేపే ప్రయాణం అవుతాడుట. అంచేత సర్దుకొని రెస్టు తీసుకుంటాడు. కాబట్టి యీ రాత్రి వేటకి చంద్రారెడ్డి, నేను, రాఘవులు, శ్రీహరి సిద్ధంగా వుంటాము. మిగతా ఏర్పాట్లన్నీ రెడ్డి స్వయంగా చేస్తానని హామీయిచ్చాడు. నేను కూడా, వేటముగిస్తే, రేపోమాపో వెడదామనుకుంటున్నాను. ఈ ఉత్తరానికి అన్యథా ఎంచరనుకుంటాను.'

ఉత్తరం మడిచి, కలంమూసి బల్లమీద పెట్టాను. సూర్యుడు అస్తమించినట్లు, పడమటి ఆకాశంలో మేఘాలు బాణసంచా కాలుస్తున్నాయి. పవిత్రమైన రక్తంతో సంధ్యాదేవి బొట్టుపెట్టుకుంది. ఆకాశంలో పూర్ణ చంద్రుడు కన్ను తెరిచాడు. ఎఱ్ఱటి మేఘాలు చంద్రుడిమీదికి పాకి, బంగారు తీగెలతో అలంకరించాయి. అడివిచీకట్లు మా చుట్టూ అలుముకుని, నిర్మల చీరనలుపులో కేంద్రీకరిస్తున్నాయి. ఆ చీకటిని భేదించగల నిర్మల నేత్రాల మెరుపు తళుక్కుమనడం మిగిలింది.

ఉత్తరం ఆమె కిచ్చాను.

'నానానే వారి కివ్వండి.'

'తల పంకించింది— అడివి నిట్టూర్చిన తీక్షంల'—

'మీరూ చూడొచ్చు'

అని నేనూ రెడ్డీ వెనక్కి మళ్ళి నడవడం సాగించాం. పదిగజాలు వెళ్ళాక వెనక్కి తిరిగాను; రెడ్డి నా మెడని ముందుకి తిప్పాడు. కాంప్ దగ్గరికి వొచ్చేశాం.

భోజనాలుచేసి వెన్నెట్లో కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నాం ప్రేమానందం గుర్రంమీద చక్కా వొచ్చాడు. గురవయ్య, మరో నాలుగు గుర్రాలు సిద్ధంచేశాడు. రెండు పెట్రొమాక్స్‌లైట్లు తీసుకొని, అరడజను మంది కూలీలు, తుపాకులు, బల్లాలు, వల తీసుకొని, రెండు మేకపోతుల్ని తోలుకుంటూ నడిచారు.

ఫ్లాస్కుల్లో టీ పోసుకుని, బిస్కట్లు, డబ్బారస్కులు, పిస్టళ్ళు తీసుకొని మేం గుర్రాలమీద కెక్కేటప్పటికి పదకొండైంది. గురవయ్య, ప్రేమానందం, శ్రీహరి బాగా ఆరితేరిన రౌతులు- అందుచేత ఆ ముగ్గురూ ముందుగా వెడుతున్నారు. నేను, రాఘవులు, రెడ్డి కబుర్లు చెప్పుకుంటూ వెనక మెల్లిగా 'ట్రాట్'లో వెడుతున్నాం. అరగంటకో అడివి ప్రవేశించాం. గియ్యమని భయంకరంగా కీటకాల రొద; వెన్నెలని చొరనివ్వని దట్టంగా అల్లుకున్న అడివి— ఆకుల మధ్యనుంచి పరీక్షగా చూస్తే, చంద్రుడి క్రీగంటిచూపులు అగుపడ్తాయి. క్షణక్షణం ఏదో మృగాన్ని ఎదుర్కొన్నట్లు భ్రమ— తీరా ఏమీ ఉండదు. ఆ అనుభవం భయంగా చిత్రంగా ఉంటుంది. ఎప్పుడూ రాని తెగింపు కూడా వొచ్చింది నాకు. ప్రేమానందం చెట్లమధ్య నిలిచిపొయ్యాడు. అందరం గుర్రాలు దిగి, ముందుగా వొచ్చిన అరడజను బంట్రోతుల్ని దీపాలతో అక్కడ వొదిలేశాం. మిగతావాళ్ళం మేకపోతుల్ని తోలుకుంటూ ఫర్లాంగు నడిచాం ఒక చెట్టుకి గురవయ్య మేకపోతుని కట్టేశాడు అరఫర్లాంగుదూరంలో ప్రేమానందం రెండోపోతుని మరో చెట్టుకి కట్టేసి తను ఇరవై గజాలదూరంలో పెద్ద చెట్టు మొగలోకి ఎక్కి కూర్చున్నాడు.

నాకు చెట్లపై కూర్చోవడం చేతకాదు. నాకోసం రెడ్డి వలతో చెట్టు కొమ్మలమధ్య వుయ్యాల అమర్చాడు. అందులో నేను, రెడ్డి కూర్చున్నాం. గురవయ్య, రాఘవులు, శ్రీహరి మొదటిపోతుదగ్గిర చెట్టుమీది కెక్కారు. గుసగుసలు తప్ప బిగ్గరగా మాట్లాడం వల్లకాదన్నారు. నాకూ పిస్టల్ ఇచ్చారు. సమయం వొస్తే దాన్ని ఉపయోగించగలనన్న ధైర్యం నాకు లేదు దాని ఉనికి నాతోటివారికేనా ఉపయోగపడుతుందన్న ధీమావల్ల నేను

నిర్భయంగావున్నా, లోపల బెదురుగానే వుంది. కాని, పులి— అంటులో, అది ముసలిపులిట— యింత ఎత్తు చెట్టుమీదికి ఏం ఎగురుతుంది? పులి భయం వొక్కటే కాదు నన్ను పట్టుకున్నది. కొమ్మలమీద పాములుంటే! చప్పుడైనప్పుడల్లా వూపిరిబిగపెడుతూ అల్లాగే గంటకూర్చున్నాం. ఏమీ జరగలేదు.

అడివి కాసిన వెన్నెలకేసి చూచాను. వెన్నెల అందం ఆనాడు చూసినట్లుగా నేనెప్పుడూ చూళ్ళేదు. ఎన్నడూ రాని ప్రియుడికోసం వేచి వుండిన కన్యకలోని మనోనిశ్చలత్వం, ఆ వెన్నెట్లో వుంది. కాలంగడవదు. ఆవలింతలోస్తున్నాయి కాని నిద్రరాదు. గుండెలు కొట్టుకుంటున్నాయి. కాని జీవం లేదు. గడియారంకేసి చూశాను అదివికి హఠిలిపోయి తిరగడం మానేసిందేమోనని! మానలేదు వొంటిగంటైంది.

ప్రేమానందాన్ని గురించి ఆలోచించాను. అతను చాలా ధైర్యవంతుడిలా తోచాడు. ఏం ధైర్యంవుండి ఏం ప్రయోజనం! భార్యముందు పిరికిపంద— కావల్సినదాన్ని సాధించేశక్తి అతనికి లేదు. అతనికి ఏ ముహూర్తాన నామకరణంచేశారో పెద్దలు, అతని జీవితంలో ప్రేమా లేదు, ఆనందం లేదు. అతని స్థానంలోనే ఉన్నట్లు వూహించుకుని బాధ పడ్డాను. ఆ పరిస్థితుల్లో, ఎవరుమాత్రం ఏం చేయగలరు? భార్యని శంకించగలడు. కాని ఋజువు చెయ్యలేడు; భార్యని ద్వేషిస్తాడు కాని ప్రేమని వొదులుకోలేడు; ఆమెని కలవలేడు. కాని, ఆమెని విడిచిపెట్టనూలేడు.

పులిగర్జన వినపడింది. ఉలిక్కిపడి కాళ్లురెండూ పైకి లాక్కుని ముడుచుకున్నాను. రెడ్డి చెప్పాడు— అది పులిగర్జనకాదుట— గురవయ్య పులిమాదిరి అరవడం నేర్చుకున్నాడట. ఆ అరుపు విని నిజంపులి అక్కడికి రావడం జరగొచ్చుట.

పులి వొచ్చినా, ఏ దిక్కునుంచి వొస్తుందో ఎవరికి తెలుసు? నేను చూడకుండానే, అది రావడం, వెళ్ళడం జరుగుతుందేమో ననిపించింది. అన్ని దిక్కులా పరకాయించి చూశాను. నాకేమీ కనిపించలేదు.

బిస్కట్లు తిన్నాం: రెడ్డి టీ పోశాడు: తాగాం. మరో సిగరెట్టు ముట్టించాను. ఓ అరగంట గడిచింది. మరో సిగరెట్టు ముట్టించాను. గురవయ్య మళ్ళా గర్జించాడు. రెండు మూడు నిమిషాల్లో తుపాకీ మ్రోగింది. నేను కొమ్మని గట్టిగా పట్టుకుని కళ్ళు మూసుకున్నాను. మరో పోటు దగ్గరలో, తుపాకీ మ్రోగింది— కళ్ళు తెరిచాను. దూరంగా వెళ్ళిపోతోంది పులి మేక పోతుని వీపుమీదలాక్కుని. వెనకభాగం మాత్రం నాకు కనబడింది. మరో సారి తుపాకీ మ్రోగించి, చెట్టుమీదనుంచి ప్రేమానందం దుమికి, పొదవైపు పరుగెత్తాడు. రెడ్డి కూడా దూకాడు. అంత పొడుగాడు; నన్నూ దించాడు. పదినిమిషాల్లో ప్రేమానందం తిరిగివొచ్చాడు.

'పోతుని చంపి, వదిలేసిపోయింది- మన దెబ్బ సరైనచోట్ల తగల్లేదు. కుంటుతో పోయింది' అన్నాడు.

'దెబ్బతిన్న పులి చాలా ప్రమాదం, ఈ రాత్రికి వెనక్కిపోదాం—' అన్నాడు రెడ్డి. ఆ అనుభవించాలన్నా, నే రాడా. అపూర్వమైన అనుభవాన్ని కలగజేసినందుకు ప్రేమానందాన్ని 'థ్యాంక్' చేశాను. అంతటితో వేటముగించి, వెనక్కి మళ్ళాం, క్యాంప్‌లోకి చేరుకునేటప్పటికి తెల్లారి నాలుగైంది.

తేయాకు లేకపోయింది. కాసిని వేడిపాలు తాగి పడుకున్నాం. తీవ్రంగా నిద్రపట్టేసింది. తొమ్మిదైందో పదైందో గుర్తులేదు: ఎవరో లేపినట్లనిపించింది. మిగతా అందరూ లేచి పనులు చేసుకుంటున్నారు. వెడుతున్నానని చెప్పడాని కొచ్చాడు మధుసూదనం. లేచి కళ్ళు తుడుచుకున్నాను.

'అప్పుడే ?' అన్నాను.

'ఈసారి వెకేషన్‌కి మావూరు రండి. పర్లాకిమిడిలో ప్రసిద్ధమైన అడివి మృగాలు వున్నాయి.'

'అల్లాగే.'

'మీరింకా రెండు రోజు లుండండి— మా వాళ్ళందరితోనూ- నేకూడా వుండనా- వాళ్ళందరికీ చిన్నబోయినట్లుంటుంది' అన్నాడతను.

'నాకు వీలుపడదు. చూడవల్సిన వింత కూడా చూశాను. నేనూ సాయంత్రం వెడదామనుకుంటున్నా.'

మధుసూదనం వెళ్ళిపోయ్యాడు.

'ఎప్పుడైనా ఉత్తరం వ్రాస్తూండు— మీ అనుభవాలు చదువుకునైనా తృప్తిపడతాను' అన్నాను. అతను నవ్వుతూ వెళ్ళాడు.

నేనింకా ఒకటి రెండురోజులుందామనుకున్నా, నన్ను గట్టిగా చంద్రారెడ్డి వుండనువలేదు. సర్వేకి బైలుదేరమని వాళ్ళ ఆఫీసర్ రామనాథయ్యర్ ఆ రోజే ప్రయాణం కట్టాడట. వాళ్ళు టూర్ చేస్తుంటే నాకేం కాలక్షేపం గాదని, అందరి దగ్గరా సెలవు తీసుకుని, ఆ మధ్యాహ్నం మూడింటికే నేనూ ప్రయాణమయ్యాను. రెడ్డి పెట్టెబండి తెప్పించాడు. బెడ్డింగ్ అందులో పడేసి కూర్చున్నాం. బండి కదిలింది. ప్రేమానందంతో మరోసారి చెప్పి, గుడ్‌బై కొట్టడం మంచిదేమో, అన్నాను రెడ్డితో.

'నీకింకా చిన్నతనం పోలేదురా- నిర్మలని చూడాలని— అవునా '? అన్నాడు రెడ్డి, నవ్వుతూ. నేనూ నవ్వేశాను.

'రైలుకింకా అరగంటే టైముంది. ఆలస్యం చేశావంటే తెల్లారే దాకా ప్లాట్‌ఫారంమీద గడపాలి, నీ యిష్టం' అన్నాడు.

'తిన్నగా, స్టేషన్‌కే' అన్నాను.

రైలొచ్చింది, ఎక్కాను.

'పట్నంనుంచి, చుట్టలపెట్టెలు పంపు' అన్నాడు.

'నేను తిన్నగా పట్నం వెళ్ళడంలేదు. మధ్యలో దిగి మేనమామను చూసి, రెండురోజులుండి వెడతాను అన్నాను.

రైలు కదలడానికి సన్నాహం చేస్తోంది.

'ఇంతకీ అసలు విషయం అడగడం మరిచేపొయ్యాను 'ఎక్స్' ఎవడు ?' అనడిగాడు రెడ్డి.

'నీకు తెలీదా ?'

'నాకు నిజంగా తెలీదు.'

'డిటెక్టివ్ నవల్సులో అయితే, కథ చెప్పినవాడే హంతకుడు. దాని ప్రకారం నేనన్నమాట' అని బిగ్గరగా నవ్వాను.

రైలు కదిలింది.

'నీ మొహం' అన్నాడు రెడ్డి.

నా మొహానికొచ్చిన తిరకాసేమిటా అనుకుని మొహం తడిమి చూసుకున్నాను.

దూరమైపొయ్యాడు— అతను. అడివి, నిర్మల, వెన్నెల, పులి, పెట్రొమాక్స్, గురవమ్మ, మేకపోతు, చల్లటికొలను, నల్లటిచీర, ఎర్రటి సంధ్య— అన్నీ మనగలోకి జారిపొయ్యాయి. రైలు మెలిక తిరిగింది. అదుగో దూరంగా, ప్రేమానందం బంగళా కాబోలు. దానిపక్క కొండ; కింద చెరువు.

ఆ నీళ్ళలో నిర్మల ప్రతిబింబం పడిందికదా— ఇంకా, దూరమై పోయింది. అడివిలో కలిసింది ఆకాశం.

* * * *

మేనమామగారి వూళ్ళో రెండురోజులుండి, శనివారం మధ్యాహ్నం, మూడింటికి పట్నం చేరుకున్నాను. వెళ్ళగానే గుమ్మంలో పోస్టుమన్ నిలబడ్డాడు. రిజిస్టర్డ్ కవరొచ్చిందట. నిన్న చూసి తిరిగెళ్ళిపోయాడుట. సంతకంపెట్టి, అతను వెళ్ళగానే, చించి చూశాను.

'ఇంత జరిగాక నే నింక ఎవ్వరికీ దక్కను నా పిచ్చి మధు! నీ కోసం యిన్నాళ్ళూ నా ప్రాణాలు నిలబెట్టుకున్నాను. నన్ను భగవంతుడు పుట్టించగూడదు. నన్నొకక్కదాన్ని పుట్టించి వూరుకోగూడదూ? నిన్నూ పుట్టించాడు. నువ్వు నా జీవితంలో కెందుకొచ్చావు- నన్ను ప్రేమించడానికి కాదు. నన్ను చంపడానికి. నిన్ను చూడగానే అనుకున్నాను- నాపాలిట యమధర్మరాజువని. నీ కౌగిలింతల్లో, హస్తాల్లో బిగించి, నలిపి చంపుతా వనుకున్నాను. అప్పటికప్పుడే పెండ్లి స్థిరపడిపోయింది.

నన్ను రోజాపుష్పం అనేవాడివి. ఆయన ముల్లు, నువ్వు మధు త్రాగే తేనెటీగవు. ఎంతకాలం బ్రతకనిస్తారు. నాన్నతో చెప్పి, నిన్ను అత్తారింటిదగ్గరగా తెచ్చుకున్నాను. ఆయన వొచ్చినప్పుడల్లా, వేధించుకు తినేవాడు. ఏడాది గడువు కోరాను- పాపం ఎంత మంచివారు! సరేనని నన్ను తాకకుండా వదిలేశారు. దూరంగా నక్షత్రంలా నిన్ను ప్రేమిస్తాను. నాకింకేమీ వొద్దు అనేవాడవు కాని, నిజంగా అల్లా వుండేవాడివి కావు. నాకు దగా చేసుకోడంచేతగాదు. నాకు నువ్వే కావాలి- వొక్కక్షణం- తరవాత తృప్తితో వూపిరి పూర్తిగా వొదలేస్తాను. సీలా, దూరంగా ఆరాధన, స్నేహం, చూపులు, కవిత్వాలు నాచేతకావు.

ఆయనకి యీ వుద్యోగం అయింది. నాన్నతో చెప్పి, నిన్నూ యిందులో వేయించుకున్నాను.

ఆయనపాలిటి చిరుతపులిని నేను- నన్ను బోనులో వుంచి వినోదిస్తారు. నువ్వు స్వేచ్ఛగా అడవిలో విహరించే మొగపులివి. మనిద్దర్నీ విడదియ్యడమే ఆయన వుద్యోగం. నీలగిరిలో నువ్వుండగా నన్ను కాపరానికి తీసికెళ్ళలేదు. తీసికెళ్ళమని బ్రతిమలాడాను. సరేనన్నారు. నిన్ను ముందు బదిలీచేసి మరీ కాపరం పెట్టారు.

మళ్ళా యిద్దరం నీ సన్నిధానంలో పడ్డాం. నా వ్రతం ఫలించింది. నిన్ను చూస్తూ, నువ్వు వొదిలిన శ్వాస పీలుస్తూ, నే జీవిస్తున్నాను.

మీ పట్నం మిత్రుడి ధర్మమాఅంటూ వొక్క రాత్రి నీతో గడిపే అవకాశం చిక్కింది. ఆయన బోను తెరిచి, పేటకి వెళ్ళాడు. నేనా అవకాశం వొదులుకుంటానా ?- నా మధుని తెచ్చుకున్నాను. నా జన్మ తరించింది- ఆ వెన్నెల, ఆ అందం నీ కళ్ళల్లో కసి, నీ అధరాల్లో మధు- నిన్ను ధ్వంసం చేసేటందుకు పురిగొల్పాయి. మందుని, మధునీ పీల్చుకుని వికసించిన మొగ్గలాగైంది నా మనస్సు. దాన్ని హరించి, నాశనంచేసి, శరీరంమట్టుకు ఆయనకోసం విడిచిపెడతావా దొంగా !

మర్నాడు మధ్యాహ్నం, ఎన్నడూ లేంది, ఆయన ముందు చలించాను. రాత్రి నీతో అనుభవం జ్ఞాపకానికొచ్చి నన్ను రెచ్చగొట్టింది. ఆయనతో చలగాటం ఆడాను- మభ్యపెట్టాను. లాలించి, కొంటెగాచూసి ఆయన్ని పురిగొల్పాను. పులిగర్జనతో మహారణ్యం కేగినట్లు, ఆయన ఆశ్చర్యపడి ఇదేమిటా అనుకుని, ఎన్నాళ్ళనుంచో అణచిపెట్టిన కామంతో, భూకంపంలాగ, అగ్నిపర్వతంలాగ, నా మీద కొచ్చేశాడు. నేను గ్రహించు కున్నాను- పొరబాటు చేశానని. నా గర్వానికీ, పొగరుకీ తగిన శాస్తి భగవంతుడు చేశాడనుకున్నాను.

ఆయన రాక్షసత్వం నేను సహించలేకపొయ్యాను. విదిలించుకుని, తోసిపారేసి పరుగెత్తాను. ఆయన మరింత పేట్రేగి నన్ను తరిమారు.

'రాత్రి పులిమాదిరి తప్పించుకు పారిపోదామనుకున్నావేం ?' అన్నారు.

నేను దొరికితే ఆయన చంపేద్దురు- నీ కోసం ఏమీ మిగల్చకుండా. కాని, మధూ, నా వెర్రిమధూ ! నిన్ను తాకిన యీ శరీరాన్ని మరొకరి కివ్వడం నాచేతకాదు. నేను జారిణిగా వుండలేను. రహస్యం బ్రదుకు నావల్లగాదు. స్వేచ్ఛగా అడివిలో సింహంలా విహరించాలి. నీ ప్రేమ నన్ను పతివ్రతని చేసిందంటే నమ్ముతావా ? పెండ్లి నన్ను జారిణిగా చెయ్యబోయింది. పెండ్లిని ధిక్కరించడమంటే మరణించడం, మధూ, మాటలు కాదు.

'ఇప్పుడు కాదు, రాత్రి'- అని వీధిలో కొచ్చేశాను. ఆయనల్లా ఎక్కడికో పిచ్చివాడులా నడిచి వెళ్ళిపొయ్యారు- పాపం, ఎంతటి పరాభవం, ఎంతటి అసంతృప్తి. ఆలోచిస్తే ఆయనే బోనులో సింహంలా కనుపించారు. నే కాదు.

వ్యవధి దొరికింది- ఈ ఉత్తరం వ్రాసి నముసిలిదాన్ని పోస్టుడబ్బాలో పడెయ్యమని, నేను జీవితం చాలించుకుంటున్నా. ఇంక జీవితంతో

పెనుగులాడలేను. నీకోసం యింతకాలం బ్రతికాను. నిన్ను అనుభవించాను. మళ్ళా సంసారంలోపడి దగాచేసి, మోసంచేస్తూ రహస్యంగా, దుర్నీతి పాలై, తలవొంపులు భరిస్తూ, నా రోజులు వెళ్ళబుచ్చుకోడంలో ఏముంది మధూ! ఒక్క క్షణం నిశ్శబ్దంలో వున్న ఆనందాన్ని భరించి, మధురంగా జీవించి, పవిత్రంగా మరణించడం మంచిది కదూ!

'నిర్మల నూతిలో ఎందుకు పడిందో తెలుసుకున్నావా?' అన్న ఆకాశరామన్న వుత్తరం నేనే వ్రాశాను. నాకీ సంకెళ్ళు తప్పుతాయని నే నెప్పుడూ అనుకోలేదు. నా జీవిత యధార్థం నీకుతప్ప ఎవ్వరికీ తెలీక పోయినా, నాకు దిగులులేదు. తెలిస్తే ఆయనెంత బాధపడతారు? నేను జీవించివుండగా పెట్టినబాధ చాలక, చనిపోయిన తర్వాతకూడా ఆయన్ని బాధపెట్టేటంతటి స్వార్థపరురాలను కాదు మధూ. ఇంక నేను నీకు కనబడను. నీ రహస్యాన్ని నాతో, నాలో హతంచేసుకుంటున్నాను మధూ.'

ఆ కవర్లో మరో వుత్తరం వుంది.

"మీరు నాపేరు బైటపెట్టకుండా చమత్కారంగా కథ అల్లినందుకు కృతజ్ఞుణ్ణి- దానికి ప్రతిఫలంగా, నిర్మల నాకు వ్రాసిన కడసారి లేఖలో కొన్ని భాగాలు కాపీచేసి పంపుతున్నాను- మీకు పూర్తినిజం తెలీడం మంచిదని. ఉత్తరం వ్రాసిన మరుక్షణాన, నిర్మల ఇంటివెనుక కాలువలో పడి ఆత్మహత్య గావించుకుంది. ఆ వార్త చెప్పడానికి విచారిస్తున్నాను. స్నానం చేస్తుంటే, లోతులోకి దిగి, ప్రమాదవశంగా మరణించినట్లు పత్రికలు ప్రకటించాయి.

ఇట్లు
మధుసూదనం.'

ఒకటి రెండు విషయాల్లో నేను పొరబడ్డానని వొప్పేసుకోడం మంచిది. నిర్మల ఇంకెప్పుడూ ఆత్మహత్య తలపెట్టదు, మరణించదు అనేవాను అది తప్పని నిర్మల జీవితం ఋజువు చేసింది.

ఆత్మహత్య పాపమూ, మంచా అని నిర్వచనం చేసి, ఆమె జీవితానికి విలువకట్టే అధికారం నాకేమీ కనబడలేదు. భర్తని ప్రేరేపించి, ఆ చుట్టించి తిప్పించుకున్న దృశ్యం స్మరిస్తే భయమేస్తుంది. నా గర్వానికి, బొగరుకి శాస్తి జరిగిందని తనే అన్నది.

పతివ్రతగా మరణించడమా ? జారిణిగా బ్రతకడమా ? అదీ ఆమె విషమ సమస్య. సమాధానం ఆమె చెప్పేసింది.

పతివ్రత ప్రేమించటం అనేది మన సాంప్రదాయానికే విరుద్ధం. ప్రేమించడం అంటే నాబోటి నాగరీకులకేం తెలుసు ? ప్రేమలో అడివి తత్వం, ప్రాచీనత్వం వుంటాయి. ప్రేమ తత్వానికి, నాగరికతకీ సమన్వయం కుదరదు. మనం ప్రేమకి విలువకడతాం, దాని లోతులు వితర్కిస్తాం. అర్థం చేసుకుంటాం. ప్రేమించడం గురించి ఆలోచిస్తాం. కాని ప్రేమించడం నాగరీకుల చేతకాదు. నిర్మలని ఏ బోనులో బంధించ గలం ? ప్రేమని ఏ నీతి నియమంతో అరికట్టగలం ? వొచ్చేసేటప్పుడు వేళాకోళంగా, నేనే హంతకుణ్ణి అన్నాను రెడ్డితో. ఎంత నిజం ? నేనా అవకాశం కల్పించకపోతే, నిర్మలింకా జీవించే వుండును.

నాకేమీ విచారంలేదు. నా అల్పత్వం, అనావశ్యకత నాకు తెల్లమయ్యాయి. నే కల్పించిన అవకాశంవల్ల మరొకజీవి విముక్తిపొందాడు- ఆమె భర్త. ఈ విషయాలన్నీ మధుసూదనాన్ని సంబోధిస్తూ, వుత్తరం వ్రాశాను.

కాని వుత్తరంలో నాకు విశ్వాసం కుదరలేదు. యధార్థాన్ని యెదుర్కొన్న తర్వాత భాష, భావాలు, సానుభూతులు, నైతిక, ఆధ్యాత్మిక విలువలు హాస్యాస్పదంగా గోచరించాయి. మధ్య నే నెవర్ని అని, మన వేదాలు బోధించిన ప్రకారం ప్రశ్నించుకుని ఉత్తరం చించివేశాను.

ప్రచురణ : ఆంధ్ర సచిత్ర వారపత్రిక 11-1-1950

# 'ఇక్కడ దీపం ఆరితే లోకం అంతా చీకటే'

"ఇంక గంటలో రైలు. చప్పున చెప్పు."

"ఏం చెప్పను ?"

"ఇష్టం వుందా లేదా ?"

మాళవి మాట్లాడదు. స్వచ్ఛంగా మెరిసే కళ్ళు— క్రమమైన తెల్లటి పళ్ళవరస, ఆ నల్లటి మొహానికి అమాయకత్వాన్ని ఆపాదించాయి. కుట్ర, కపటం, దాపరికం ఎరగని పవిత్రమైన రూపం.

"మాట్లాడవేం."

"నీకుందా ?" నవ్వుతోంది మాళవి— బాదంచెట్టు చివరికొమ్మ కేసి చూస్తూ. ఏదో పొడుగాటి పురుగు ఆకుని పొడుస్తోంది. బాదంఆకు పూడి ఆమెమీద పడింది. దాన్ని తొలిగించాడు రంగయ్య.

"నువ్వంటే....మరి....ఎలా చెప్పాలో తెలియదు" సిగ్గుపడు తున్నాడు రంగయ్య.

"నీకంత సిగ్గయితే— నా కెట్లాగుంటుంది ?"

"ఊఁ" అనరాదూ ? రైలు టైమవుతోంది; నే వెళ్ళాలి "ఆ రైలు తప్పిందంటే కొంప మునుగుతుంది."

"ఎట్లా మునుగుతుందేం ?"

"అదంతా చెప్పేటందుకు టైములేదు. ఇప్పుడు నువ్వు 'ఊఁ' అంటివా చాలా హుషారుగా పోతా పై దేశానికి. నీ ప్రేముంటే నా కింకేమీ అక్కర్లేదు. బాగా కష్టపడి పనిచేసి మంచిపేరు సంపాదించుకొస్తా. మలయాలో మలేరియా వ్యాధికి జనం పురుగుల్లా చస్తావుండారట. వాళ్ళంద రికీ మందులిచ్చి, నయం చేసానంటే— మంచి పేరొస్తుంది. ఉద్యోగం వస్తుంది. నీకు మంచి ఇల్లు, మంచి బట్టలు, వొకటేమిటి."

"అంతా దొంగమాటలు."

"చేతులో చెయ్యి వెయ్యనా ?"

"తాకితేనా" కళ్ళు పెద్దవిచేసింది.

"పోనీ ప్రమాణం చేసేదా ?" ఆమె చేతిని తీసుకున్నాడు.

"ఇదేమిటి చెయ్యి చల్లగావుంది ?" అన్నాడు రంగయ్య, ఆమె చేతినాడిని పరీక్షచేస్తూ.

"మలేరియాలే" అంది మాళని; ఇద్దరూ నవ్వుతున్నారు. పైన కాకులు బావంకాయలను కలవర పెడుతున్నాయి. ఒక కాయ వారిద్దరిమధ్యా పడింది.

"ఇదుగో కొరికిచ్చేదా ?" అన్నాడు.

"ఛీ ఛీ కాకెంగిలి."

"మరి నే పోతా— ఇంక టైములేదు ఇదుగో అక్రైను వ్రాసివచ్చిన కవరు. ఉత్తరం వ్రాయేం ?"

"ఏం వ్రాయను ?"

"ఒంట్లో ఎట్లావుంది. మీ అత్త ఎట్లా వున్నది— మీ తమ్ము డెట్లా వున్నదీ."

"అప్పుడే వెళ్ళనూక." అని అతని భుజంమీద చెయ్యివేసి నిలిపింది. అతను నిలిచిపొయ్యాడు.

"అమ్మయ్య— ఇప్పుడు నీ చేయి వేడిగా వుంది. దొంగపిల్ల— ఇష్టంవుంది కూడా లేనట్లు నాటకం."

"నాటకమా.... అట్లాగైతే పో.... నీకు నేనంటే ఇష్టంలేదు. ఇష్టంవుంటే అప్పుడే వెళ్ళిపోతానంటావా ఏమిటి ?"

"ఖలేదానివే— ఇది అర్జంటుపని— అక్కడ జనం ఈగల్లా చస్తా వుండారు."

"వాళ్ళెవళ్ళో ఎక్కడో చస్తే మనకేం.... నీకు వాళ్ళే ముఖ్యం" కోపంగా మొహం కిందికి దించింది మాళని. రంగయ్య చేతితో పైకెత్తి, ఆమె కళ్ళల్లోకి తీక్షణంగా చూశాడు.

"ఇటు చూడు.... కోపమా ? వాళ్ళంతా చచ్చిపొయ్యారనుకో— అప్పుడు వాళ్ళ పెళ్ళాలు, పిల్లలు ఏడవరూ ?"

"నీకు నేను ముఖ్యమా, వాళ్ళా."

"దానికీ దీనికీ సంబంధం ఏమిటి.... వాళ్ళు బాగుంటే కదా. మనం సుఖంగా వుండేది !"

"అసలు మలయా నువ్వు పోడం దేనికి ? నువ్వు పోనేకూడదు. నా దగ్గరే వుండాలి" నవ్వుతుంది మాళవి. తేటగా, మొగ్గ విప్పారుకున్నట్లు, శిఖరం వెనకనించి చందమామ బైటపడినట్లు, కెరటం నురుగు వల్ల రాతిపై చిత్రం గీచినట్లు, ఆమెకేసి చూడగానే మనస్సులో ఆనందంతో కూడుకున్న ఉద్రేకం ఆకృతి తెచ్చుకున్నట్లు నైతికబలం నుండి జనించే అనుభూతితో రంగయ్య ముఖం వెలిగింది.

"నేను దూరంగా వెళ్ళినకొద్దీ, నీకు దగ్గరగా వొచ్చినట్లనిపిస్తుంది. ఇదుగో చేతులో చెయ్యి." అని ఆమె చేతిని గట్టిగా అదుముతున్నాడు.

"నా మలేరియా నీకు పట్టుకుంటుంది" చేతిని విదిలించి వేసింది.

"నా కదిష్టమే."

"నా జబ్బు కుదర్చకండా— నువ్వు వెళ్ళిపోతానంటే...."

"నీ జబ్బుకి మందు నే మలయా వెళ్ళడమే.... ప్రేమ జబ్బు."

"పో...." అని జడ ముందుకు తీసుకుని కోపంగా అతనికేసి చూసింది. కాని రంగయ్య ఆమె కళ్ళలో చూసింది దయ-కోపం కాదు.

"అదే చేస్తున్నా...." రంగయ్య వెళ్ళాడు.

"వెడుతున్నావా ? మరో నిమిషం వుండకూడదా ?"

దూరంగా వెళ్ళినవాడు వెనక్కి తిరిగి అంటున్నాడు.

"ఇంట్లోకెళ్ళి కప్పుకొని పడుకో" వెళ్ళాడు.

గబగబ స్టేషనికి వెళ్ళాడు. రైలు వెళ్ళి ఐదు నిమిషాలైంది. దిగాలు పడి కూర్చుండిపొయ్యాడు. మళ్ళా రాత్రి పదింటికిగాని రైలులేదు. ప్లాట్‌ఫారంమీద మందులుగల కర్రపెట్టె అల్లాగే వుంది. దాన్ని తూచడం, లేబిల్స్ అంటించడం అన్నీ జరిగాయి: ప్రయాణానికి సిద్ధంగావుంది. ఆ పెట్టెనిండా, ఇన్‌జక్షన్ సామాన్లు, బెరిబెరి, మలేరియా, కలరా "పచ్చ జ్వరం" మొదలైన వ్యాధుల చికిత్స కవసరమైన పరికరాలు, మందులూ వున్నాయి. ఇండియానుంచి ఎనమండుగురు డాక్టర్లు, ఆరుగురు

కాంపౌండర్లు, యీ మందులతో మలయావెళ్ళి అక్కడ యుద్ధరంగంలో వ్యాధిగ్రస్థులకు చికిత్సలు జరపాలి. డాక్టర్లు క్రితంరోజునే మద్రాసు వెళ్ళారు. అక్కడనుండి విమానంలో క్వాలాలంపూర్ వెళ్ళాలి. రంగయ్యని మందులపెట్టి తీసుకుని రమ్మన్నాడు డాక్టర్ జాకబ్. రైలు తప్పింది. ఏమిటి చెయ్యడం ?

రంగయ్యకి మతిపోయింది. ఆలోచన తట్టడంలేదు. కనబడినవారి నల్లా సలహా అడుగుతున్నాడు. బెజవాడ వెళ్లే ఒక లారీలో బడి, మధ్యలో అది చెడిపోతే నానా యిబ్బందిపడి చివరకు బెజవాడ వొచ్చేటప్పటికి మెయిలువెళ్ళి అరగంటయింది. మళ్ళా ఉదయం ఎక్స్‌ప్రెస్ తప్ప బండి లేదు. భోజనంలేదు. ఆ మందులపెట్టిని కౌగలించుకొని అల్లాగే ప్లాట్‌ఫారం మీద రాత్రంతా గడిపాడు. దాన్ని కౌగలించుకుంటే తన సర్వరోగాలు పోయినట్లు— ఏమిటో అదోలా జరిగిపోయింది రాత్రి.

ఎక్కడో రైలుబాట చెడి, ఎక్స్‌ప్రెస్ రెండుగంటలు లేటైంది. మద్రాసు చేరుకునేటప్పటికి సాయంత్రం ఆరయింది. విమానం నాలుగింటికే వెళ్ళిపోయింది. అందులో డాక్టర్లు వెళ్ళిపోయ్యారు. డాక్టర్ జాకబ్ విమానాశ్రయంలో రంగయ్యకి వొక చీటి వ్రాసివుంచాడు— మర్నాడు విమానంలో బైలుదేరి రావల్సిందని— ఫలానాచోట దిగాల్సిందని.

అమ్మయ్య అనుకున్నాడు రంగయ్య. అయినా తన కెందుకంత భయం. ఎనమండుగురు డాక్టర్లు వెళ్ళారు. వాళ్ళు చాలా సుందులపెట్టెలు తీసుకువెడతారు. పైగా క్వాలాలంపూర్‌లో గొప్ప మందుల కర్మాగారం వుంది. అక్కడ ఎన్నో మందులుంటాయి. తను మర్నాడు వెళ్ళనంత మాత్రాన జరిగే ప్రమాదంలేదు. రాత్రి భోజనంచేసి నిశ్చింతగా పడుకున్నాడు మాళవిని స్మరిస్తూ. మాళవి స్వప్నంలో కరిగిపోయింది— నిద్రలో. ఆతని కళ్ళంట కన్నీటిబొట్లు గడ్డకట్టినట్లు కొనలని అంటి వున్నాయి ఉదయాన లేచి చూసుకునేప్పటికి.

మర్నాడు, విమానం వెళ్ళదట. ఏం చెయ్యడం ? మలయాలో యుద్ధపరిస్థితి ఏర్పడటంవల్ల, ఎప్పుడు వెడుతుందో, అసలు వెడుతుందో వెళ్ళదో ఎవరికీ తెలియదు; అక్కడివారి సలహా

అడిగాడు. తన అవసరం గురించి ఉద్రేకంతో ఏడుస్తూ చెప్పాడు. విమానాశ్రయంలో చాలా సానుభూతి కనబరిచారు. ఒక్కటే మార్గం— ఓడలో సింగపూర్ వెళ్ళమన్నారు. ఓడలో సింగపూర్ బైలుదేరాడు రంగయ్య. ఆ ఓడలో వెయ్యిమందికిపైగా భారతీయ యుద్ధ సైనికులున్నారు. వారితో కబుర్లు చెబుతూ రంగయ్య ధైర్యంగా వున్నాడు.

అవి 1941-1942 యుద్ధం రోజులు. ఇండోచైనా, సయామ్‌లను స్వాధీనం చేసుకున్నాయి జపానీయ సేనలు. 1941 డిసెంబరు 8వ తేదీని బ్రిటిషు మలయాపై దాడి ప్రారంభించినై. సింగపూర్‌ని స్వాధీనం చేసుకోడం వారి ప్రధాన ఆశయం. వారి సేనలు పురోగమిస్తున్నాయి. ఆస్ట్రేలియా, భారతీయ, ఆంగ్లేయ, మలయా సేనలు నిరోధిస్తున్నాయి. కాని అదంతా నిష్ఫలమయింది. జపానీయులు సింగపూర్‌ని ఆక్రమించు కున్నారు. నీటి సదుపాయాలు నిలిపివేశారు. లొంగిపోవల్సిందిగా విమానం నుంచి చీటీలు పడవేశారు ఫిబ్రవరి 15వ తేదీని వేలాది బ్రిటిష్, భారతీయ, ఆస్ట్రేలియన్ సైనికులు శత్రువులకు లొంగిపొయ్యారు. యుద్ధఖైదీలుగా చిక్కినవారిలో రంగయ్య వొకడు.

జోహోర్ ప్రాంతంలో భారతీయ డాక్టర్లు గాయపడిన వారికి, వ్యాధిగ్రస్థులకు చికిత్సచేసి ఎంతో సాయపడ్డారు. డాక్టర్ జాకబ్ దిగిన చోట మందులు దొరకలేదు. తను తెచ్చిన మందులయిపొయ్యాయి. తన మందులపెట్టె, కాంపౌండర్ తీసుకురాలేదు. మరో రెండురోజులవరకూ, తోటి డాక్టర్ల సహాయం, మందులు అతనికి లభించలేదు. లభించి వుంటే, మరో వందమందికి చికిత్స జరిగివుండును. వారు మరణించకపోదురు. డాక్టర్లందరూ తమ పని ముగించుకుని సురక్షితంగా భారతదేశం తిరిగి వొచ్చారు.

* * * *

యుద్ధం సమాప్తమై, 1945 సెప్టెంబర్ 3వ తేదీని జపానీయులు లొంగిపోయిన పిదప, రంగయ్య విడుదలై, భారతదేశం తిరిగి వొచ్చాడు.

మలయా పునర్నిర్మాణానికి తోడ్పడిన ప్రపంచ సైనిక బృందానికి తిరిగి రాగానే, మద్రాసు హార్బరులో ఘనస్వాగతమిచ్చారు. మద్రాసులో రెండు రోజులున్న తర్వాత రంగయ్య స్వగ్రామం చేరుకున్నాడు. రైలు

దిగగానే గ్రామపెద్దలు అతనికి సుస్వాగతం చెప్పి, పూలహారాలువేసి, డాక్టర్ జాకప్‌గారి జీపులో కూర్చోపెట్టి ఫొటోలుతీసి, ఇంటికి తీసుకు వెళ్ళారు.

రంగయ్యకి ఇదంతా స్వప్నంలాగుంది. మద్రాసులో సోకిన మలేరియావ్యాధి తమ గ్రామంలో దిగగానే తీవ్రరూపం దాల్చింది. గజగజ వొణికిపోతున్నాడు. పళ్ళు బిగించి దగ్గు కప్పుకుని జీపులో వాలిపొయ్యాడు. కళ్ళు మూతలుపడుతున్నాయి. ఎవరెవరైందీ అతనికి తెలీడంలేదు. ఎవరో జనం మధ్యలోంచి తోసుకొచ్చి, అతని నుదిటిమీద చెయ్యివేశారు— ఎవరో నర్సు — ఆమె చెయ్యి చల్లగా తగిలింది— అతని కాలిపొయ్యే నుదుటిమీద, అతని తలని ఆమె నిమురుతోంది— దగ్గరగా ఆమె వక్షం వైపు లాగుతోంది— స్వచ్ఛమైన కళ్ళు— మహారణ్యంలో చెట్లు తగలబడి ఆకాశాన్ని వెలిగించినట్లు— తెల్లగా మెరిసే పళ్ళవరస—ఎవరో— ఏవో జ్ఞాపకాలు. అస్పష్టంగా— ఘనీభవించే వ్యవధిలేక కరిగిపోతున్నట్లు, జపానీయుల పెద్ద పళ్ళవెనక పిడుగులాంటి నవ్వు; తమిళుల గళ్ళలుంగీల పైభాగంలో నల్లని వెన్నుపై చెమటబిందువులు, మలయాస్త్రీల మెత్తని కంఠాలు, ఆడుకునే పిల్లల గుండెలకింద చర్మం వెనుక ఎముకలు, ఇంగ్లీషు నాయకుడి టోపి, తుపాకి మొదళ్ళు, సిగరెట్టు పీకలు, త్రాగుడు సీసాలు, కార్క్‌లు, సిరంజీలు, సూదులు, మందుగుళ్ళ పాకెజీలు, రబ్బరుచెట్ల బెరడులు, లిప్‌స్టిక్కు సీసామూతలు, భారతదేశ పతాకంపైన గీతలు— పైకి, పైన— ఇంకా పైన నిర్మలమైన ఆకాశంలో పల్చని మేఘం— దాని వెనుక నక్షత్రం— టెలిస్కోప్‌లో చూస్తే రెండు నక్షత్రాలుగా విడిపోతై— వొకదాని వెనక వొకటి తిరుగుతూ తనూ— మాళవికి మళ్లే.

"నేనే, గుర్తు పట్టలేదా."

కళ్ళు బలవంతంగా పెద్దవిచేసి చూచాడు రంగయ్య. క్షురకర్మ చేసుకోలేదు— మలీష్ ప్రాంతం అడవిలో ముళ్ళపొదలాగుంది అతని గడ్డం— చేతులో దాచుకున్నాడు. ఆమె చేతిని తొలగించింది.

"ఎవరు ?" నీరసంగా పైకి చూశాడు.

"మాళవి" అన్నదామె. అతనికేమీ అర్థంకాలేదు. జీప్ వెడుతోంది. జైజై నాదాలు, నిస్సు ముట్టుతున్నాయి.

"ఇంటికొద్దు— హాస్పిటల్‌కి తీసుకువెడదాం" అంటున్నదామె. జీప్ డాక్టర్ జాకబ్ హాస్పిటల్ దగ్గర నిలిచింది.

రంగయ్యని నలుగురు మోసి, వార్డులో వొక మంచంమీద పడుకోబెట్టి, తప్పి, చికిత్సకు వుపక్రమించారు.

రాత్రంతా తీవ్రమైన జ్వరం— పలవరింతలు— అందులో కల— కలలో ప్రేలాపన.

"హెందసుందరిని చంపేశాను.... నేను హంతకుణ్ణి.... నన్ను వురితియ్యండి...." అంటున్నాడు రంగయ్య.

* * * *

ప్రక్కన డాక్టర్ జాకబ్. తలదగ్గర నర్సు మాళవి. జాకబ్ ఇండియా తిరిగిరాగానే, రంగయ్య ఉదంతం విని, ఆమెపట్ల సానుభూతితో, చదువు లేకపోయినా మాళవికి నర్సుగా తర్ఫీదిచ్చి, నెలకేదో ముట్టచెప్పి తన హాస్పిటల్‌లో వుంచి పోదాయస్తున్నాడు. రంగయ్యని గురించి భోగట్టా తెలుసుకొని ఆమెకు చెబుతూ వుండేవాడు. అతను సురక్షితంగా కొన్ని వేల భారతీయ సైనికులతో కలసి శత్రువులచే బంధితుడైనట్లు, తిరిగి విడుదలయ్యే సూచనలున్నట్లు చెప్పేవాడు. జపానీయులు లొంగిపోగానే, వారందరూ విడుదలై క్షేమంగా ఇంటికి వొస్తున్న సంగతి కూడా అతనే చెప్పాడు.

"ఏమిటి ప్రేలాపన— నాకు భయంగా వుంది" అన్నది మాళవి.

"అది పరాయిమాట కాదు. కొంత నిజం చెప్పివెయ్యటం— పశ్చాత్తాపపడటంలాంటిది" అన్నాడు డాక్టర్.

"ఎందుకు ? ఏం తప్పుచేశాడని ?"

"అతను సమయానికి రైల్వేస్టేషన్‌కి చేరివుంటే, మా అందరితో సహా మలయా అరణ్యాలలో పగి, అక్కడి వారికి సమయానికి చికిత్స జరిగి వుండును. ఆ మందులు లేకపోవడంవల్ల వొక్కరోజులోనూ,

వందకిపైగా జనం మలేరియాకు గురై మరణించారు. అదీ రంగయ్యబాధ" అన్నాడు డాక్టర్ జాకబ్.

"ఇంక నిద్ర పట్టేసింది. ఏం భయంలేదు. రేపటికి నార్మల్‌కి వొచ్చేస్తుంది." అని జాకట్ సగతా వార్డులేసి బైలుదేరాడు. మాళవి కూడా అతని వెంటనే వెడుతోంది. జాకబ్ నవ్వుతున్నాడు.

"పాపం నువ్వు దగ్గర వుండరాదూ?"

"మిగత పేషంట్లని చూడద్దా?"

"నే చూసుకుంటాలే— పైగా మల్లన్న వున్నాడుగా" అన్నాడు డాక్టర్.

"మీకో వొకటి చెప్పనా డాక్టర్‌గారు.... నాకు ధైర్యం చాలడం లేదు...." అన్నది మాళవి.

"చెప్పు. తొందరగా చెప్పు."

"నేను తొందరగా చెప్పకపోవడంవల్లనే మలయాలో జనం సమయానికి మందులందక మరణించారు. వారి చావుకి కారణం రంగయ్య కాదు— నేను. హైమైపోయింది— మనం పెండ్లి చేసుకోడం స్థిరమైనట్లు భావించనా, చెప్పు— అన్నారాయన! వెంటనే చెప్పక, ఆ కబుర్లూ, యీ కబుర్లూ చెప్పి, నా దగ్గరే వుంచేసుకుని జాప్యం చేసింది నేను. ఆ ఐదు నిమిషాల వృథా ప్రసంగంవల్ల ఇంత ప్రమాదం అవుతుందనుకోలేదు— ఈ మలేరియా నాకు సంక్రమించి, నేనే మరణిస్తే— నాకది తగిన శిక్ష...." మాళవి కళ్ళమ్మట నీటిబిందువులు జారలేక కనురెప్పలమధ్య ఇరుక్కున్నాయి. జాకబ్ నవ్వుతున్నాడు.

"చిత్రమే. ఇక్కడ యీ మారుమూల గ్రామంలో మనం వొకపని చేస్తే, దాని పర్యవసానం ప్రపంచం అంతటా అల్లుకొని ఎవ్వరూ ఆశించని ఫలితాన్నివ్వడం చిత్రమే" అంటూ వెళ్ళిపొయ్యాడు డాక్టర్ జాకబ్.

మాళవి కళ్ళు తుడుచుకుంది. తిన్నగా రంగయ్య పడుకున్న గదిలోకి వెళ్ళి అతని పక్కనే కుర్చీలో కూర్చుంది. పత్రిక తీసింది. కోటప్పకొండ తిరణాలు సాగుతున్నాయి. అక్కడ కలరా చెలరేగింది. డాక్టర్లు, నర్సులు, కాంపౌండర్లు వెళ్ళి చికిత్స జరిపే అవసరం వున్నట్లు ప్రభుత్వం ఉత్తరువులు పంపుతోన్న వార్త చూసింది. పరుగెత్తుకుంటూ వెళ్ళింది

మాళవి. డాక్టర్ గదిలో ఉన్నాడు. ఈ వార్త చూపి, తను వెళ్ళడానికి సిద్ధంగా ఉన్నానంది. మరికొందరు కూడా ఆ సాయంత్రం బైలుదేరుతున్నారనీ, వారితో కలిసి ఆమె వెళ్ళడానికి అభ్యంతరం లేదని చెప్పాడు జాకబ్.

మళ్ళా మాళవి రంగయ్య గదిలో కెళ్ళింది. రంగయ్య మెల్లగా కళ్ళు తెరిచాడు.

నీరసంగా నవ్వుతున్నాడు. నుదుటిమీద చెమట తుడిచింది.

"తగ్గిందా ?"

ఆమె చేతుల్ని తీసుకొని తన చెక్కిళ్ళపై అదుముకున్నాడు.

"నన్ను మర్చిపోలేదు. నువ్వెంత మంచిదానివి" అన్నాడు.

"నేను మంచిదాన్ని కాను. నేను చెడ్డదాన్ని. మిమ్మల్ని కబుర్లలో పెట్టి అనుకున్న ప్రయాణం సాగనీక, ఎందరి మరణానికో కారణమయ్యాను. మీరు మంచివారు— నేను తగను...." మాళవి అతని భుజంపై తల ఆనించి ఏడ్చేస్తోంది.

వెచ్చగా కన్నీరు అతని కంఠాన్ని రాసి జారుతోంది. దారి వెదుకుతూ శిఖరంపై నుండి జారే మంచుకణాల పిల్లనదిలా. అందులో నిలిచి నిలిచి వినబడే పిల్లగానం వినబడుతోంది. దానికి మాటల్లేవు— శ్రుతిలేదు.

తన రెండు చేతులతో ఆమె మొహాన్ని పైకి లేవదీసి కళ్ళల్లోకి చూశాడు. కన్నీరు తొలిగింది. మేఘాలులేని ఆకాశంలా నిర్మలంగా వుంది ఆమె మొహం.

"నువ్వు ఏ తప్పు చెయ్యలేదు. ప్రేమించడం తప్పు కాదు. ఆ ప్రేమకి వొకరికొకరు లొంగిపోవాలనుకున్నాను నేను. ఆలస్యం చేసింది నేను- నువ్వు కాదు. రైలుకి వెళ్ళవల్సింది నేను— నువ్వు కాదు. నీ కోసం—మరోక్షణం నువ్వు నావానివయ్యావన్న భావంలోని గర్వం అనుభవించడం కోసం జాప్యం చేశాను— స్వార్థపరత్వం నాది— నీదికాదు."

"మీకు నూట్లాదరంపే- నీరసంగా వున్నారు." పత్రికలో విషయం చెప్పింది. మరో గంటలో డాక్టర్ల బృందంతో తనూ వెడుతున్న విషయం చెప్పింది.

"టైమవుతోంది. చప్పున చెప్పండి...." అన్నది మాళవి

"ఏం చెప్పను. ఆలస్యం చెయ్యక వెంటనే వెళ్ళు. అమ్మ వొచ్చిం తర్వాత మాట్లాడుకుందాం."

"నే వెడితే మిమ్మల్ని ఎవరు చూస్తారు ?"

"డాక్టరున్నాడు. పైగా నాకు నయమైపోయిందిగా. నే చేసిన తప్పుకు నేను శిక్ష అనుభవించాను. రెండేళ్ళు జైల్లో గడిపాను. ఆ తప్పును ప్రేరేపించింది, ప్రేమ.... అది మంచిదే. దాని ఫలితంగానా దక్కింది. నువ్వింక ఎక్కడున్నా నాదానివే.... మరి వెళ్ళు."

రంగయ్య నవ్వుముఖంకేసి చూస్తూనే వెళ్ళింది మాళవి. ఆ నవ్వు వెనక వొక గొప్ప ఆనందంతో కలిసి సీరైన కన్నీటిచుక్క కూడా వుంది. ఆ బరువైన కన్నీరు విడి, ధారగా అతని పెదవులమీదికి జారింది. నిలిచి నిలిచి దూరాన్నుంచి వినబడే మధురగానం. దానికి భాషలేదు. మాటల్లేవు. ఆద్యంతాలులేవు.

* * * *

అంతే కథ. ఒక యోగిని వెనక ఎవరో ప్రశ్నించారట: "మీరెక్కడో ఏకాంతంగా, ఏ లోయలోనో కూర్చుని దీక్షపూని, తపస్సు చేస్తే, లోకానికి జరిగే ప్రయోజనం ఏమిటి ?" అని. ఆయన అన్నాడుట.

"నిజంగా దీక్షతో తపస్సు చేస్తే నాలోనుంచి వొక శక్తి కెరటం బైలుదేరి, మనుషుల హృదయాలు వెదుక్కుంటూ వెళ్ళి లోకం అంతా చుట్టబెడుతుంది" అని.

ప్రపంచంలో మనుషులంతా వొక కుటుంబంవారే నన్నది అంత వరకూ వొక గ్రంథంలో వాక్యంలా, వేదికపై ఉపన్యాసంలో వొక భాగంలా భావించేవాడిని. ఈ వృత్తాంతం విన్న తర్వాత అలా భావించ లేను. ఏకాంతంగా యీ మూల కూర్చుని నే సాగించే ఆలోచనకి అనే మాటకి, చేసే చేష్టకి ప్రపంచాన్ని కలవరపరిచే ప్రభావం వుందంటే, నాకు నా వ్యక్తిపట్ల, నా ప్రవర్తన పట్ల ఎంతటి బాధ్యతవుందో భయం వేస్తోంది.

ప్రచురణ : సైనిక సమాచార్ 26-1-1960

# కథ కాని కథ

మనీ, మనీ, మనీ.

వెనక భర్తృహరి ఏమన్నాడంటే చాలా అన్నాడులెండి. అవన్నీ జ్ఞాపకం ఉంటే ఈ వ్యాసమే వ్రాయకపోదును. కాని క్రితం సంవత్సరాదీ నాడు మా యింటిపక్క డాక్టరుగారి కూతురు కుముదం ధరించిన చీర తాలూకు రంగు పూర్తిగా జ్ఞాపకం ఉంది. ఇంద్రియాల ద్వారా సంపాదించిన అనుభవాలు జ్ఞాపకాని కొచ్చినట్లు, పుస్తకాల ద్వారా గ్రహించిన జ్ఞానం రాదు కాబోలు. మన పూర్వులు మాత్రం శరీరం 'మాయ' అని, దాని ద్వారా పొందిన వికాసం 'భ్రమ' అని, సత్యాన్ని, సజీవమైన జ్ఞానాన్ని తెలుసుకునే శక్తి, 'బుద్ధి'కి వుందనీ, నమ్ముతూ వచ్చారు. అనాదనుంచీ వొస్తున్న ఈ నమ్మకం నా ఎముకలకి సైతం పట్టి నట్లుంది. చిన్నతనంలో నాకో శరీరం వుందని చాలాకాలం గ్రహించనే లేదు. సైకిల్ మీదనుంచి పడ్డప్పుడు కూడా, ఆ తగిలిన దెబ్బ సైకిల్‌కే ననుకుని, దాన్ని చూసి జాలిపడి, వారం రోజులవరకూ దాన్ని పైకి తియ్యనేలేదు. ఏ మాటకామాటే చెప్పాలి. నాకు 'బుద్ధి' 'మనస్సు' వున్నా యని కూడా చాలాకాలం వరకూ తెలిసిందీ కాదు. ఇప్పుడూ, ఇవి కొంత వరకూ సంశయాస్పదాలుగానే కనిపిస్తాయి. 'మనస్సు'ని గురించి సర్. రాధాకృష్ణన్‌గారేమన్నారంటే- ఏమంటే ఏం ప్రయోజనం ? నాకు ఒక్కటే ఇప్పుడు ఉపయోగంలోకి రావడంలేదు.

ఇంతకీ నే చెప్పొచ్చేదేమిటంటే నా జీవిత విధానం అంతా 'బుద్ధి' చేత పుస్తకాలద్వారా పొందిన 'విజ్ఞానం' మీద ఆధారపడిందని భౌతిక ప్రపంచం కంటె గ్రంథాలలోనూ, ఊహాలలోనూ, ఉన్న ప్రపంచం యదార్థమైందనీ, సౌందర్యమైందనీ నా నమ్మకం. జీవించిన వ్యక్తులంటే నాకు గౌరవం లేకుండాపోయింది. అమ్మ, నాన్న, అన్నా, చెల్లెలూ,

వీళ్లందరూ 'ఊహ' లేని మట్టిబొమ్మలు. వాళ్ళ భాష 'ధ్వనులు'. నా ఊహ లోని వ్యక్తులతో వీళ్ళని పోల్చిచూస్తే 'నీడల' మాదిరి కనిపిస్తారు. వాళ్ళ మతం పిచ్చివెర్రి: రాజకీయంరాళ్ళతో కొట్లాట: వివాహం బొమ్మలపెళ్ళి: ఇవన్నీ గట్టిగా నమ్ముతాను. మానవలోకానికి అతీతం అవడమే కాకుండా ప్రపంచాన్ని వొదలి నిశీథంలోకి వెళ్ళి, ఒక్క తాపుతంతే, ఈ గోళం ముక్కలు ముక్కలై శూన్యత్వంలో ఐక్యం అవుతుంది. నవ్వుతూ, వెక్కిరిస్తూ నేను మాత్రం మిగుల్తా.

డబ్బు, డబ్బు, డబ్బు.

ఊహలో ఇవన్నీ చేయగల్ను. కాని ఈ మనుషులతో నాకున్న అవసరం తీరదు. అమ్మ అన్నంపెట్టాలి. నాన్న డబ్బివ్వాలి. అన్నయ్యతో ఆడుకోవాలి. చెల్లెలితో ఫిడేలు నేర్చుకోవాలి. దాని మొగుడికి కాళ్లు కడుక్కొనేందుకు నీళ్లు ఇవ్వకపోతే మా నాన్న తంతాడు. రెండూ, రెండూ ఎంతో చెప్పకపోతే మేష్టరు బుగ్గని సున్నాలా తిప్పి, పేపర్లో అంత సైజుసున్నా, వెల్లిపెన్సులుతో చుడతాడు.

అందుకనే ఈ ప్రపంచం అంటే అంత భయం నాకు. ఇది నిజంకాదు 'మాయ' అని తెలుసు. ఐతే ఏం లాభం ? నేనిందులోనే వుండి, వీళ్ళతో తగాదాలుపడి నా బ్రతుకు నే బ్రతకాలి. మనుషులు రెండు రకాలనుకుంటా: నాయకులు, అనుచరులు. నేనీ రెండో రకానికి చెందుతా. నాయకుల పని ఎవళ్ళు ఎల్లా ఉండాలో, ఏం చెయ్యాలో, ఏం ఆలోచించాలో మొదలైన విషయాలు చెప్పడం, కిక్కురుమనకుండా అన్నీ అమల్లో పెట్టడం అనుచరుల పని. కుటుంబంలో పెండ్లికానంతవరకూ నాయకుడు నాన్న: వివాహం జరిగింతర్వాత నాయకురాలు భార్య అనుకుంటా; ఉద్యోగంలో పై అధికారి: జబ్బు చేసినప్పుడు వైద్యుడు: చచ్చింతర్వాత నాయకుడు శాస్త్రుల్లుగారు.

నే అనుసరించే నాయకులు జీవించి ఉన్న మనుషులుకారు. వాళ్ళంతా గొప్ప గ్రంథాలు వ్రాసి చచ్చిపోయినవాళ్లే. నా భావాలు, వాంఛలు, ఆలోచనలు అన్నీ వాళ్ళ బోధనలని అనుసరించినవే. అంతే రెండు ఉదా

హారణలు మాత్రం ఇస్తా. "క్రొమ్మొక్కినవరమీని వేల్పుని గ్రక్కున విడువంగ వలయు"నన్నారు. రోజూ ఉదయం ఎనిమిదిగంటలకి నాకు సంస్కృతం చెప్పే ఆచార్లుగారొచ్చేవారు. ఆయన్ని రాకుండా చేయమని రోజూ కృష్ణుడి విగ్రహానికి మొక్కేవాణ్ణి. ఒకరోజున ఆయనొచ్చే సమయానికి గదిలో దూరి గడియ పెట్టుకున్నా. మేష్టారికి తేలు కుట్టిందని అరుపు వినిపించి బైటకొచ్చాను. ఏమీ కుట్టలేదు. ఆ చుట్టుపక్కల కండచీమేనాలేదు. నన్ను బైటికి రప్పించేటందుకు వేసిన ఎత్తు. వెంటనే కృష్ణుడి బొమ్మని నూతిలోకి గిరవాటెట్టాను. రెండోది కొంచం జ్ఞానం వొచ్చింతర్వాత జరిగింది.

"ముద్దులన్నింటిలోకి దొంగిలించిన ముద్దు మధురమైంది" అని ఎక్కడో చదివాను. ఎన్నిరకాల ముద్దులున్నాయో నాకింతవరకూ తెలీదు. ఒక్కటేనా దొంగిలించి తీరాలని నిశ్చయించుకున్నాను. మా ఇంటిపక్కని నారాయణరావుగారి కూతురు. మిట్టమధ్యాహ్నం గదిలో నిద్రపోతుంటే మెల్లగా వెళ్ళి వెనకనించి చెవులని తాకిచూశాను. కనురెప్పలు కదిపి 'ఫెడీ' మని లెంపకాయ కొట్టింది. టెన్నిసన్ కవి "ప్రేమించకుండా ఉండడం కంటె, ప్రేమించి ఓడిపోయి పోగొట్టుకోడం మంచిది" అని వ్రాశాడు. ప్రేమించి, ఓడిపోయి లెంపకాయ తినడం మరీ మంచిదనుకుని, సమాధాన పడుతూ ఉంటాను, అది జ్ఞాపకం వొచ్చినప్పుడల్లా.

రూపాయలు, రూపాయలు, రూపాయలు.

ఆధునిక ప్రపంచంలో ఎట్లా బ్రతకాలో ఆలోచించే అవసరం లేకుండా ఉంది. ఇలా కాకపోతే నాలాంటివాళ్ళు ఎన్నడో ఆత్మహత్య చేసుకుని వుందురు అందుకనే ఆధునిక మానసిక శాస్త్రజ్ఞులు (ముఖ్యంగా బిహేవియరిస్టులు) 'బుర్ర', 'మనస్సు' లేవు, పోన్పొమ్మన్నారు. తిండీ, బట్టా, అమ్మానాన్నా చూస్తారు. నా పరీక్షలు 'గురువులు' ప్యాసవుతారు. నా మతం, దైవచింతా అన్నీ నా పూర్వులే నిర్ణయించారు. అప్పుడప్పుడు బద్ధకించి మరిచిపోతానెమోనని వాళ్ళు దేవాలయాలు కూడా కట్టించారు నా రాజకీయాలని గురించి ఆలోచించే అవసరం అసలేలేదు. నా అభిప్రా

యాలని, పత్రికా సంపాదకులు, నా ప్రమేయం లేకుండానే ప్రపంచానికి చాటుతారు. పత్రికా రచనంటే ఏమిటి? కుప్పుస్వామి బ్రతికి ఉన్న సంగతే తెలియని భారతదేశానికి, ఫలానా కుప్పుస్వామి గతించాడని చెప్పడం— అంటే ఆ ఫలానా కుప్పుస్వామి కారుకింద పడినప్పుడు, కారుకిందపడే భాగ్యం అందరికీ కలుగుతుందనుకోవడం చాలా పొరపాటు. నాగరికత కోసం తమ జీవితాలని త్యాగం చెయ్యడానికి సిద్ధపడేవాళ్లే అలా చెయ్య గలరు. నేనెప్పుడు పుట్టిందీ, చచ్చిందీ, ఆఖరికి మా వూళ్ళో 'జననమరణాల' రిజిస్ట్రార్‌కి కూడా తెలీదు. పత్రికలను గురించి 'కజిన్స్' దొరగారేమన్నా రంటే....

నోట్లు, నోట్లు, నోట్లు.

నా ఆస్తి వ్యవహారాలన్నీ మా లాయర్‌గారే చూస్తారు. చచ్చి పొయ్యేముందు, నా జబ్బుపేరేనా నాకు చెప్పకుండా, నన్ను పరలోకానికి రవాణాచేసే డాక్టర్లు చాలా కొద్దిమంది ఉన్నారు. మరి నా పెళ్ళి విషయం? ఇంతవరకూ ఆ ఆలోచన నాకు రాలేదు. అంతమాత్రంచేత 'స్త్రీ'ని గురించి నేనెప్పుడూ ఆలోచించననీ మహాయోగినని చెప్పుకోడంకాదు. అసలెప్పుడూ అదే ఆలోచన. కాని 'పెండ్లి' అనే బెడదలేకుండా 'స్త్రీ' దొరికే మార్గం ఉంటే ఎవళ్ళేనా చెబితే బాగుండును.

ఇటీవల శాస్త్రజ్ఞులు, మానవుడి శరీరం ఖరీదు ఒక రూపాయి, రెండణాలని నిర్ణయించారు. అంటే ఆ డబ్బుతో శరీరం ఏ సామాన్లతో చెయ్యబడిందో అవన్నీ బజార్లో కొనొచ్చు. సెంట్రల్ స్టేషన్‌లో ఒక యంత్రంలో అణాకాసు పెడితే, ప్లాటుఫారం టికెట్ చక్కా వొచ్చినట్లు, రూపాయిబేడాపెడితే ఒక అందమైన స్త్రీ బైటపడే యంత్రం ఏ శాస్త్రజ్ఞుడేనా కనిపెడితే బాగుండును. కొద్దికాలంలో ఈ యంత్రం వచ్చేసూచనలున్నాయి. రాకపోయినా, నా పెద్దలు నాకు వివాహంచేసి తీరతారు. నాకా బెంగ ఎప్పుడూలేదు. వివాహం జరిగి, పిల్లలతో కాపరం చేస్తున్న కుటుంబీకుడికే. తమ పిల్లలనిచ్చి వివాహం చేస్తామని అడుగుతున్న మహాదాతలు ఈ ఆంధ్ర

దేశంలో ఎందరో ఉండగా, మీరూ నేనూ ఈ విషయాన్ని గురించి ఇంతగా యిదవడం, చాలా ఖుది అంటాను. వివాహాన్ని గురించి, వెష్టర్ మార్క్ ఏమన్నా....

పైకం, పైకం, పైకం.

నా నీతి విషయం రెండు ముక్కలు చెప్పి, ఈ ప్రసంగం ముగిస్తా. ఇదొక మహారణ్యం. ఎవళ్ళకీ ఏమీ తెలీనట్లు కనిపిస్తోంది. అందరికీ తలో 'నీతి' వుండడం మూలాన ఏ ఇద్దరూ అంగీకరించడంలేదు. మొగాడికి, 'నీతి' అవసరంలేదని మా నాన్నా; అట్లాగైతే ఆడదానికీ అక్కర్లేదని మా అమ్మా ఎట్లా చావను చెప్పండి ?

మా అక్కయ్య అంటుందీ— (అది కాలేజీలో చదువుకుంటోంది లెండి) పెళ్ళి కాకపోతే, ఆడదానికి కాని, మొగాడికి కాని, నీతి అక్కర్లేదు తమ్ముడూ అంటుంది. అంతవరకూ వుంటే వుండాలేమోకాని వివాహం జరిగింతర్వాత 'నీతి' అక్కర్లేదనీ, లారెన్సు, జామిస్ మొదలైన నవలా కారులంటున్నారు. వెధవలకోసం 'నీతి' నెలకొల్పబడిందని గిరీశంగారు అసలు జంతువులకి లేని నీతి మానవుడికి మాత్రం ఎందుకూ అక్కర్లేదని ఉమర్ ఖయ్యామ్ వెనకే అన్నాడు. ఎప్పుడు కావాలో, అక్కర్లేదో మాట అట్లా ఉంచి అసలు నీతంటే ఏమిటి ? ఈ దిగువ కొందరి అభి ప్రాయాలను పొందుపరుస్తా. "అందరూ ఎట్లా చేస్తే అట్లా చెయ్యడం (బ్రాడ్లే) "అల్లా చెయ్యకపోవడం" (జినోన్సు) "తప్పుడు పనులుచేసి పట్టు పడకపోవడం" (పాస్కల్) "నీతిపరుడుగా నటించడం" (బారోషిఫ్ కాల్ట్) చెవిటి భర్తా, గ్రుడ్డి భార్యా కలిస్తే నీతి" (లాబ్రూయరీ) "శరీరం వాంఛలని, 'వాక్కు' ద్వారా తీర్చుకోవడం" (ఫ్రాయిడ్) "శరీరం వాంఛలని శరీరం ద్వారా తీర్చుకోడం" (ఆల్డస్ హాక్స్లీ) ఇట్లాటి పరి స్థితులలో ఏం చెయ్యాలో నిర్ణయించే శక్తి నాకు లేదు. ఆలోచించే వోపికా, తీరుబడి బొత్తిగా లేవు, కాని ఈ 'నీతి' లేందే ప్రపంచంలో నెగ్గలేం, అని మొదట్లోనే చెప్పా. పైగా అది మీ అందరికీ తెలిసిన

విషయమే. ఈ క్రింద చూపించిన ప్రశ్నలకి సమాధానం తెలిస్తే 'నీతి' అంటే ఏమిటో తెలిసినట్లు భావించొచ్చు.

1) మనుష్యులతో 'స్నేహం' సంపాదించడం ఎట్లా? (జంతువులతో స్నేహం చేసుకోడం మానవుడికి తెలుసు అని దాని తాత్పర్యం. శత్రువులు కూడా మన ప్రాణస్నేహితులుగా మారాలి.)

2) పై అధికారి మన్నన, ఆదరణ పొందడం ఎట్లా ?

3) నువ్వు ప్రేమించిన 'స్త్రీ' నీ పాదాలమీద కాకపోయినా, అధమం భుజాల మీదేనా వాలే మార్గం నీకు తెలుసా ?

4) నీ రహస్యాలు, భార్యకి తెలిసినప్పుడు చెంబుతోగాని, గరిటెతోగాని, చీరమడతతో గాని, (విద్యావతి ఐన ఎడల సిరాబుడ్డితో గాని) నీ మీదికి యుద్ధానికి రాకుండా చేసుకోడం ఎట్లా ?

5) నువ్వు దైవానివని తెలుసుకున్నావా ? తెలుసుకున్న తరువాత, నీ భక్తులని ఎట్లా ప్రేమించగలవో క్లుప్తంగా చెప్పు ?

ఇట్లాంటివి మరో ఐదు ప్రశ్నలూ, వాటి సమాధానాలు ఒక గ్రంధరూపంగా వ్రాసి, నాబోటి దౌర్భాగ్యులకూ, ప్రపంచంలో ఎట్లా బ్రతకాలో తెలీని గుంటలకూ శాశ్వతమైన ఉపకారంచేసి, మా కృతజ్ఞను గణించుకున్నారు— ఇటీవల 'డేల్ కార్నిజీ' అనే అమెరికన్ దొరగారు. ఈ గ్రంథరాజం పేరు "స్నేహితులని ఎట్లా చేసుకోడం- వ్యక్తులపై వొత్తిడి కలిగించడం- దాని విధానం." ఇది అన్ని రైల్వే బుక్ స్టాల్స్ లోనూ దొరుకుతుంది. అట్టమీద 'కార్నిజీ' గారి 'ఫోటో' కూడా ఉంటుంది. ఇది కొన్ని కోట్ల కాపీలు అమ్ముడు పోయింది. ఈ 'విధానం' అనుసరించి జీవితంలో పారమార్థం పొందిన ఒక లక్ష వ్యక్తులు, దీన్ని ప్రశంసిస్తూ వ్రాసిన వాక్యాలు కూడా పుస్తకం చివర ఉంటాయి. దీని వెల రెండు రూపాయలనుకుంటా. మీ పబ్లిషర్ని కలుసుకుని, దీని నేటిస్టివెల తెలుసు కోండి.

దస్కాం, దస్కాం, దస్కాం.

పై ప్రశ్నలకి ఆయనిచ్చిన సమాధానం వ్రాస్తే నేనో గ్రంథకర్తను కాగలను. అంచేత, 1, 3 ప్రశ్నలకు ఆయన చెప్పిన సమాధానం మాత్రం వ్రాసి అవి నేనెల్లా అనుభవంలోకి తెచ్చుకున్నదీ చెప్పి ముగిస్తా.

1) 'స్నేహం' చేసుకోవడం ఎట్లా ?

నాకు స్నేహితులూ లేరు. విరోధులూ లేరు. నాలో ఏముందో తెలీదు కాని, నేనంటే ఎవళ్ళకీ సరిపడదు. కొంతకాలం క్రిందట వాల్తేరు స్టేషన్లో, చిత్రంగా అగుపించిన మనిషిని చూచి, కుతూహలపడి 'తమ దేవూర'ని అడిగాను.

"నేను అబిసీనియా చక్రవర్తిని" అన్నాడు. రెండడుగులు వెనక్కి తగ్గాను. అంత భాగ్యమే నాకు! "వెనక పోలండ్ ప్రధానమంత్రిగా వుండేవాణ్ణి" అన్నాడాయన. ఈయనకి తెలుగు భాషలో ఇంత ప్రవేశం యెట్లా కలిగిందా అని ఆశ్చర్యపడ్డాను. "ఆగాఖాన్‌కి రికమెండేషన్ ఇస్తా తీసుకెళ్ళండ" న్నాడు. అంతే ఆ మనిషిని తీసుకుపొయ్యారు, ఇద్దరు ఎర్రటోపీ వ్యక్తులు నేను కాదు పిచ్చివాణ్ణి అతను.

మొదటి ప్రశ్నకి కార్నీజీగారిచ్చిన సమాధానం ఈ దిగువ పొందు పరుస్తున్నా.

అ : అవతల వ్యక్తిని గురించి మాట్లాడు.

ఆ : నిన్ను గురించి మాట్లాడొద్దు.

ఇ : సాధ్యమైనంతవరకూ, అతన్నీ అతని కుటుంబాన్నీ మెచ్చుకో. అతని సంసారం సంగతులన్నీ తెలుసుకో. అతని అభిరుచులు, అభిప్రాయాలు తెలుసుకొని తదనుగుణ్యంగా మాట్లాడు.

ఈ : స్తుతించు. ఆపేక్షంతా దొర్లిపోతున్నట్లు, అతని పేరు, వయస్సు, ఉద్యోగం, చిరునామా, నోటుబుక్కులో అతనిముందే ఎక్కించు. అతన్నే వ్రాసియిమ్మను.

షరా॥ ఇవన్నీ ఎప్పుడు అనుచరణలో పెడతావు ? నేడే ఇప్పుడే, లే. వెళ్ళు.

చట్టుక్కున పుస్తకం మూసేసి, బండి కట్టించుకుని స్టేషన్‌కి ఎగడ్డాను.

బండివాణ్ణి చూసి పేరు చెప్పమని దీనంగా కోరాను.

"ఏం, రాసుకుంటావా? రాసుకుంటే రాసుకో నాకేం భయం?" అని "రాసుకుంటే రాసుకో నా చిట్టిపిల్లా" అనేది పాటద్వారా మొదలు పెట్టాడు.

"నీ ఇల్లు ఎక్కడ నాయనా?"

"పెద్దపెద్ద మేడలకాడవుండే చిన్నచిన్న పూరిల్లు" అని మళ్లా 'చిన్నచిన్న పూరిల్లు చూడవే నా చిన్నదానా' పదంపాడడం మొదలెట్టాడు. వాడి సంతోషాన్ని, తన్మయతనీ, పాడుచెయ్యడం పాపంగా తోచింది.

రైలు కదిలింది. ఎదురుగుండా ఆకర్షణీయమైన ఆసామి కూర్చున్నాడు. కోటు, పాగా, తోలుపెట్టి, కర్ర, నోట్లో చుట్ట మొదలైన పరికరాలతో ప్రపంచాన్ని తిలకించే నిమిత్తం కళ్ళుమూసి ధ్యానం మొదలెట్టాడు. మీసాలు కొట్టొచ్చేటట్లున్నా, నేత్రాలు మర్యాద చేసే ప్రకృతిని సూచిస్తున్నాయి. సినిమాలో మాదిరి 'లే. వెళ్ళు, ఇప్పుడే' అని ధ్వనులు నా చెవులో మొరెట్టుకుంటున్నాయి.

"తమ నామధేయం?" అని నవ్వుతూ అడిగా.

"తమదీ?"

చెవుడేమోననుకొని "తమ నామధేయం చెప్పారుకాదు". అన్నా రెట్టించి.

"తమరీ శెలవిచ్చారు కాదు." అన్నాడాయన.

"తమ మొహం బాగా పరిచయంగా ఉంది. ఎక్కడో చాలామార్లు చూసినట్టున్నాను" అన్నాను.

అస్తమానూ, 'ఆయన' 'నేను' అంటే విసుగెడుతుంది గనక, మాకు జరిగిన సంగతులు సంభాషణపూర్వంగా మనవి చేస్తాను.

ఆ : మిమ్మల్ని చాలామార్లు చూశాను.

నే : నాలో విశేషం ఏముందిలెండి, తమరు పెద్దలు.

అ : పెద్దచిన్నలో ఏముందీ బాబు. తమరు విద్యాధికులు, విద్యని గౌరవించాలి. మీ పేరు చెప్పాదుకాదు.

నే : అనామకుణ్ణి, అల్పుణ్ణి. నా పేర్లో విశేషంలేదు. ముందు తమదీ సెలవిస్తే....

అ : హఁ, హఁ ఎంతమాట. నా కాలం జరిగిపోయింది. మీరు యువకులు. మీ కాలం.

నే : తమ వయస్సు ?

అ : అదీ నేనే అడగాలనుకుంటున్నా. సరే, ఇప్పుడడుగుతున్నాను. ఇరవై నాలుగు ?

నే : పోనీ తమ వూరు ?

అ : మీది గోదావరి మొహంలా ఉంది. లేకపోతే కృష్ణాజిల్లానా ?

నే : మిమ్మల్ని బందరులో చూశానేమో ?

అ : మిమ్మల్ని బందరులో చూశానేమో అనిపిస్తోంది నాకూను.

నే : తమకెందరు పిల్లలు ?

అ : మీకు వివాహం అయిందా ? ఐతే ఏమన్నా పిల్లలా ?

నే : మీలో చాలా హాస్యరసం ఉందండీ. గోదావరిజిల్లా వాళ్ళు హాస్యానికి పెట్టిన పేరు.

అ : మీలో భలే పసందు వుందండీ.

నే : మీ నేత్రాలలో నిశ్చలత్వం వుట్టిపడుతోంది.

అ : మీ మొహం అంతా ఆనందం వెదజల్లుతోంది.

నే : ఇవన్నీ కట్టిపెట్టి నీ విషయం చెప్పవయ్యా.

అ : ఈ స్తోత్రాలు మన దగ్గర సాగవ్. ముందు నీ సంగతి చెప్పుదూ.

నే : నే చెప్పను. ఏం జేస్తావేటి ?

అ : నేను చెప్పను. ఏం బెదరిస్తావా ? భలే పెద్దమనిషివే.

నే : ఏం ఇదిగా వుంది నీ కథ!

అ : ఛప్

నే : ఛప్ అంటే "ఛుప్" తెలిసిందా ?

ఆ : కపడ్దార్! క్షమాయించి నోరు కట్టిపెట్టండి.

నే : ఏమయ్యో ఎవరనుకుంటున్నావు. నేను చాలా పుస్తకాలు చదివాను.

ఆ : మా బాబయ్య బోలెడు పుస్తకాలు రాశాడు. కాపీలు ఖావాలంటే నాకు వ్రాయాల్సిందే తెలిసిందా ?

నే : నీ దగ్గర పుస్తకాన్ని లంచం ఇచ్చినా చదవను.

ఆ : మా బాబయ్య పుస్తకం దూషణ, నా దూషణ నోరు మయ్యండి.

నే : క్షమించి నాలిక కట్టండి.

ఆ : మళ్లాపేలు, దవడ వాయించగలను

నే : నేను సిద్ధం— ఏం, మీది మీది కొస్తున్నావు.

ఆ సమయంలో రైలు ఆగడం, ఆయన దిగడం జరిగింది కాని, లేకపోతే ఏం జరుగునో ఆఖరికి కార్నీజీ దొరగారు కూడా చెప్పలేరు. ఆయన కోటు జేబులో కార్నీజీగారి గ్రంథరాజం కనిపించింది.

వెయ్యిమాటపదహార్లు, వెయ్యిమాటపదహార్లు.

మాలో కొందరు నల్లమందు ఖాయీలు, కార్నీజీగారి మూడో ప్రశ్న మరిచి ఏమి వుండొచ్చు. అందుకని మళ్ళా రాస్తున్నా.

3. మీరు ప్రేమించిన స్త్రీ, మీ పాదాల మీద వ్రాలడం ఎట్లా ?

ఈ ప్రశ్న ప్రపంచంలో సగంమందిని, ప్రతినిత్యమూ బాధిస్తూనే ఉంటుంది. ఐదువందల ఖరపైనాలుగు దినాలక్రితం నన్ను బాధించడం మూలానే కార్నీజీగారి గ్రంథం కొనడం జరిగింది. "మీరు ప్రేమించిన స్త్రీ" అంటే ఏమిటి ? మా అన్నయ్య సుప్రసిద్ధ హాలీవుడ్ ఫిలింతార 'విలియన్‌లే'ని ప్రేమించానంటాడు. మా మామయ్య "మిర్నాలాయ్"ని స్మరిస్తుంటే మా అత్త విని కసురుకుంటుందని మూడు రోజులు మంచ మెక్కాడు. మా కాలేజీ హిస్టరీ ప్రొఫెసర్‌గారు సాధనాబోస్ కోసం తల క్రిందులుగా తపస్సాచరిస్తున్నాడు. "శోభనా సమర్థ్ గుండె పరీక్ష చెయ్యడంకోసం, నేనేం చెయ్యను ?" అని మొన్న ఆస్పత్రిలో డాక్టర్ సదాశివన్‌గారు గట్టిగా అన్నాడుట. దాన్నిబట్టి కార్నీజీగారి సిద్ధాంతాలు

అనుచరణలో పెడితే, ఈ హైస్కూళ్లు అంతా చక్కా వొచ్చి సదరు పురుషుల పాదాలమీద పడకొట్టుకోడం పొరపాటు అన్నా జనం అపోహ పడకుండా 'మీరు ప్రేమించిన స్త్రీని 'డిజైన్' చేశాడు.

ఎ. మీరు ప్రేమించింది అసలు 'స్త్రీ' ఐ వుండాలి.

బి. ఆమె జీవించే ఉండాలి. (నా జోటిగాళ్ళు ఈ సంగతి మరిచి పోతారు. కాళిదాసు శకుంతల, గురజాడ వారి బుచ్చమ్మ, మునిమాణిక్యంవారి కాంతం, లేక చరిత్రలో 'చాంద్‌బీబీ' 'ముంతాజ్‌మహాల్' వగైరా స్త్రీలని కోరకూడదన్నమాట.)

సి. సాధ్యమైనంతవరకూ 'కన్య' ఐ వుండాలి. అంటే పెండ్లి కాకూడదు. (ఇది ఇంకొకసారి అందరూ జ్ఞాపకం పెట్టుకోవలసిన విషయం)

డి. తన శరీరం లావణ్యం మీదనే తన జీవనోపాధి జరిగిపొయ్యేది-అవకూడదు. (సినిమా తారలు కాకూడదన్న మాట.)

ఇ. మీరు ప్రేమించే సమయంలో, ప్రేమించేటప్పుడు, ప్రేమించిన సంవత్సరం వరకు- ఆమె మీరు వుండే గ్రామంలో కాని, అధమం ఒకే తాలూకాలో కాని ఉండాలి.

ఎఫ్ ఆ ప్రేమించిన స్త్రీని వివాహం ఆడేటందుకు, సాంఘికంగాగాని, ఆరోగ్యరీత్యాకాని అంతరాయాలు ఉండకూడదు.

జి. మీ కంటె కొంచెం చిన్నదై వుండాలి.

హెచ్. పొట్టిది కాకూడదు. మీ కంటే పొడుగ్గా ఉంటే మరీ మంచిది.

ఈ ఎనిమిది నియమాలకి సరిపొయ్యేది ఒక్క "జ్ఞానవేణి" కార్సీజీ కేవలం ఈ కన్యని చూసి తన నియమాలని వ్రాశాడా అనిపిస్తుంది. ఆ కన్యని వర్ణించే సమయం ఆసన్నమైంది.

అసలు పేరొకటి వుండేది, నాకదేమిటో తెలీదు. చిన్నతనంలో చాలా చలాకీగా, చురుకుగా వుండడంవల్ల వాళ్ళ వాళ్లు, ఆ పేరెట్టారని తెలుసు. ఇకనుంచి 'జ్ఞానం' అనే వాడతాను. వాళ్ల నాన్న ఏం పని చేస్తున్నాడో ఎవళ్ళకీ తెలీదు. ప్రొద్దున్నే వెళ్ళి, సాయంత్రం ఇంటికొస్తాడు.

తమ్ముళ్లూ, అన్నలూ లేరు కాని 'జ్ఞానానికి' ముగ్గురు చెల్లెళ్లు, ముగ్గురు అక్కలూ ఉన్నారు. పెద్దక్క ఆడపిల్లల స్కూల్లో సంగీతం చెప్తారు; రెండోది మెడికల్ కాలేజీలో చదువుతోంది. మూడోది 'జ్ఞానం' ఇంటరు మొదటి సంవత్సరం చదువుతోంది. మిగతా ముగ్గురు చిన్నపిల్లలు. ఈ ఏడుగుర్నీ ఒక్కసారిగా నేనెప్పుడూ చూశ్శేదు- అందుచేత వీళ్ళందర్లోకీ ఎవళ్లు చక్కటివాళ్ళో నేను నిర్ణయించలేను. కాని అందరికీ కొన్ని సమాన లక్షణాలున్నాయి. అంతా నల్లగా వుంటారు; చాలా పీలగా పొడుగ్గా ఉంటారు. ఎవళ్ళకీ వివాహం కాలేదు. ఒక్కళ్ళకీ వొంటిమీద ఏ ఆభరణం ఉండదు ఆఖరికి 'కాంపిల్' గాజులు కూడా వుండవు. అందరూ ఎప్పుడు నవ్వుతూనే ఉంటారు. అంతా తెల్లఖద్దరు చీరలు కడతారు- ఐదోదీ పరికిణీ, ఆరోది లాగు ధరిస్తారు. జ్ఞానవేణితో నా పరిచయం, సరిగ్గా మూడు దినాలు. ఆ సంవత్సరం నేను బి. ఏ. ఫేలయి, పూరికే వుంటున్నా మా మామయ్యగారింట్లో ఆ రాత్రి మామయ్య జలుబూ, రొంపాతో బాధపడుతూ భోజనం మానేసి, కాఫీ త్రాగుతానన్నారు. రాత్రి ఎనిమిదైంది. కాఫీపొడుం లేకపోయింది. అత్తయ్య వాళ్ళింటి కెళ్ళి కొంచెం పొడుం బదులు తీసుకు రమ్మని నన్ను పంపింది. అంతకు పూర్వం వాళ్ళ సంగతి నాకు తెలీదు. ఆకాశాన చిన్ని చంద్రుడున్నాడుకాని, నేను ఆకాశంకేసి చూశ్శేదు. వెళ్ళి తలుపు తట్టాను. 'జ్ఞానం' వొచ్చి తలుపు తీసింది. మొట్టమొదట నన్నాకర్షించింది తెల్లటి పళ్ళవరస.

"ఎవరి కోసం ?"

"ఎవరి కోసం ?"

"కాఫీపొడుం" అన్నా పరాగ్గా, బహు పల్చటి మనిషి. టార్చిలైట్ వేస్తే 'శరీరం' అంతా ఇట్నించటు చూడొచ్చు. సమానంగా సాఫీగా మెరిసే చామనచాయ. 'ఆర్చి'లా అమర్చబడ్డ కనుబొమ్మలు; ఇంక ఆ 'కళ్లు' న్నాయి మహాప్రభో వర్ణించేటందుకు 'షెల్లీ' యో, వెంకటచలమో రావాలి. మొగాడి తాలూకు గట్టితనంతో రూపొందుకున్న నాజూకు శిల్పంలోని నిశ్చలత్వం, కవిత్వంలోని 'రొమాన్సు' సృష్టిలోని చాంచల్యం- వొక

దేమిటి ద్వంద్వాల కలయిక. మొహంలో గుంభ్రన, శరీరంలో 'చదరత్వం' చెక్కిళ్ళనునుపు; భుజాలకరుకు; పెదవిలో మెత్తదనం; వక్షంలో గట్టితనం; జడలో బిరుసు; నడుంలో తేలిక; పళ్ళలో సంతోషం, కళ్ళలో విచారం.

"మా ఇంట్లో కాఫీ తాగం"

నేను వెళ్ళిపొయ్యాను. అదే నా మొదటి పరిచయం. అరగంటలో నా రెండో పరిచయం జరిగింది.

మా ఇంటికి చక్కా వొచ్చి తలుపు తట్టింది. బైటకొచ్చాను. తలుపు దగ్గరగా మూసి మర్రిచెట్టు కిందికి నడిచా.

"మా ఇంట్లో కాఫీపొడుం లేదు" అంది.

ఆమెకేసి పరకాయించి చూశాను. తెల్లటిచీర శరీరం వొంపులని పట్టుకుని; 'సమన్వయత్వాన్ని' దాటిస్తోంది. చెక్కిళ్ల తప్ప శరీరంలో అన్ని పల్లాలే- అరిచెయ్యి ఎక్కడ మోపినా దానికోసం అన్నట్లు ఇమిడి పోతుంది.

"సారీ"

"కాని 'టీ' వుంది.

"మా మామయ్యకి నిద్రపట్టదేమో?" అన్నా.

"మా 'టీ' నిద్ర పట్టిస్తుంది. పరుంటే మరి లేవడు."

"సరే"

వాళ్ళింట్లోకి పరుగున వెళ్ళి పొట్లంతో చక్కా వచ్చింది. చాలా పెద్ద జెడ, అంత జెడ నేనెప్పుడు చూడలేదు. ఆత్మహత్య చేసుకోదలచిన వాళ్ళు. ఆ జెడని కంఠానికి చుట్టుకుంటే సునాయాసంగా చస్తారు. అల్లాంటి చావు మంచిదని ఆ క్షణాన నిశ్చయించుకున్నాను. నవ్వింది, ఆవులించి అన్ని అవయవాలని కదిల్చింది; ఎందుకో భయపడి పమిటకొంగుని శాలువాలా భుజాలమీద కప్పుకుని తన వొంటికేసి చూసుకుని నాకేసి చూసి నవ్వింది. ఆ నవ్వే, నా మనస్సులో మెరుపులా చీల్చి మెరిసింది. నవ్వుకి నా శరీరంమీద అంత వొత్తిడి వుంటుందని ఎప్పుడూ అనుకోలేదు. ఇప్పటికీ అది తల్చుకుంటే నాకు ఏడుపొస్తుంది. ఏ క్షణంలో మొగాడు దేన్ని చూసి భ్రమిస్తాడో తెలీదు కాబోలు, స్త్రీలు తమ లావణ్యంతో, ముస్తాబుతో అంత శ్రమపడతారు!

కార్నీజీగారి పుస్తకం ఆ మొర్నాడు కొన్నాను. అదంతా అర్థం చేసుకుని స్త్రీని ఆకర్షించే విధానాన్ని సిద్ధం చేసుకున్నాను. ఏనాటికైనా ఎవళ్ళకేనా వుపయోగం కలుగుతుందని ఈ క్రింద రాస్తున్నాను.

1) పొగడు. మెచ్చుకో. వీలైతే కవులు చెప్పిన సంగతులు అప్పగించు.

2) మరో స్త్రీతో పోల్చకు.

3) పెండ్లి ప్రసంగం ఎత్తకు (చదువుకున్నదైతే)

4) నిన్ను నువ్వు తిట్టుకో- దౌర్భాగ్యుడని, గుంటనని, వెర్రివెధవని అని.

5) వయస్సు అడగకు.

6) మాట్లాడటం చేతకాకపోతే ఉత్తరం వ్రాయి. (నాలుగు వాక్యాల కంటే మించకూడదు)

7) సాధ్యమైతే భుజంమీద చెయ్యి వెయ్యి. జడట్టుకో. పాదాలకేసి చూడు. (ఈ ఆఖరిది పుస్తకంలోది కాదు. 'హేవ్‌లాక్ ఎల్లిస్' చెప్పాడు)

జ్ఞానవేణితో మూడో పరిచయం జరిగినప్పుడు ఇవన్నీ ఆచరణలో పెట్టాను. ఏం జరిగిందో వ్రాస్తున్నాను.

'జ్ఞానం' కిరసనాయిలు కోసం సీసా తీసుకొని మా ఇంటికొచ్చింది. మర్రిచెట్టు క్రింద నేను నుంచున్నాను

"కిరసనాయిలా ?" అని అడిగా ఏదో మాట్లాడిద్దామని.

"కనిపిస్తూనే వుందిగా" అంది. నా మనస్సు చివుక్కుమంది.

"ఖద్దరు చీర నీకెంతో బాగుంది" అన్నా. అటూ ఇటూ చూస్తూ.

జ్ఞా : "మీ కెందుకు ?"

నే : "చూసి ఆనందిస్తా, మీ ఇంట్లో అంతా ఖద్దరే కడతారా ?"

జ్ఞా : "మీ కెందుకు ?"

నే : "చూసి ఆనందించడం తప్పా ? నీ నున్నటి వొంటిమీద ఆ ముతగ ఖద్దరు"

జ్ఞా : "ఏం మాటలండి."

నే : "ఎమర్సన్ ఏమన్నాడంటే సౌందర్యానికి ఏ బట్ట ఐతే నేమి...."

జ్ఞా :

నే : కంప్ జ్ఞానం.... నీకో సంగతి చెప్పాలని వుంది. మొదట నిన్ను చూసి క్రిస్టియన్ పిల్లననుకున్నా. మెళ్లో చేతులకీ, కాళ్ళకీ, చెవులకీ వొత్తి ఆభరణమేమీ లేదెందుకు ?

జ్ఞా : మాకు నగలిష్టం లేదు.

నే : అసలు సహజ సౌందర్యం వుండాలిగాని పోనీ జడలో నాలుగు పూలెట్టుకోకూడదా ?

జ్ఞా : అవన్నీ మీకెందుకు ? నే వెళ్ళి చదువుకోవాలి. తెల్లారితే ఇంగ్లీషు పరీక్ష.

నే : అయ్యో, నీ లేత హృదయానికి, ఈ ఆంగ్లభాష విషం వొకటా.... నీ లేత పెదవులమీద ఆ కఠోర పదాలని ఉచ్చరించడం ఎంత కష్టం.

జ్ఞా : షటప్ ప్లీజ్. నేనంటే ఏమిటనుకున్నారు ?

నే : నా ఎడారి జీవితంలో వడగళ్ళ వర్షం నీ నవ్వు. నా కన్నీటి కెరటాలపై వెన్నెల నురుగు నీ నవ్వు.

జ్ఞా : ఫూల్ !

నే : నీ చీర కుచ్చిళ్ళు, నా స్వర్గ సోపాన పంక్తులు. నీ జడ నా బ్రతుకు నిలయం.

జ్ఞా : ఛీ. మొగాడు జంతువు, ఫూల్. తొందరగా వెళ్ళింది. వెనకాల వెళ్ళి జడ పట్టుకున్నా. 'స్టుపిడ్' అని కొట్టి వెళ్ళి తలుపు గట్టిగా నా మొహాన్ని మూసింది. ఆ రాత్రి కార్నెగీగారి గ్రంథాన్ని నా గుండెమీద పెట్టుకుని, ఎంతసేపు ఏడిచానో ఆ బాధ టెన్నిసన్‌కి కూడా తెలీదు.

రెండువేలు, రెండువేలు, రెండువేలు.

సరిగ్గా మూడు మాసాలు నేను జ్ఞానవేణి కోసం తపించాను. నాకు రాత్రుళ్ళు నిద్ర పట్టలేదు. పగలు కాలేజీకి వెళ్ళే సమయం వొచ్చేటప్పుడు, వొక్కసారి చూడాలని కాచుకుని నా కాళ్ళు నడిపొయ్యేవి. ఆఖరికి ఉత్తరం వాళ్ళ గుమ్మంముందు పారేశాను. తీసుకుంది కాని జవాబు వ్రాయలేదు తరవాత ఆ పిల్లని గురించి కొన్ని సంగతులు తెలుసుకున్నా.

వాళ్ళది చాలా పెద్ద కుటుంబం. వెనక బోలెడు ఆస్తి వుండేదట. అదంతా వాళ్ళ నాన్న త్రాగుడికి ఖర్చయిపోయిందట.

ధనికులకి గర్వం అంటారు కాని, నిజానికి పేదవాళ్ళకున్న గర్వం ఎవ్వరికీ వుండదు. జ్ఞానాన్ని తన చేతి గాజులెందుకు లేవంటే, 'డబ్బులేక' అని సమాధానం ఎన్నడూ చెప్పదు. అల్లా ఉండడం తన ఆదర్శంట. "నీకు వివాహం అయిందనుకో- అప్పుడూ ఇల్లాగే వుంటావా చెవులకి ముక్కుకీ ఏమీ లేకుండా ?" అంటే ఎంతో కోపం వచ్చింది. వివాహం అనే మాట తలపెట్టడానికి వీల్లేదుట. తనని ప్రేమించేటందుకు అర్హత ఉన్న ఆంధ్ర యువకులు లేనేలేరట!

నాకు నా మీద కోపం వచ్చింది. నేను చదువుకున్నవాడిని- నా చదువు విషయం తెలిసిందంటే సరస్వతి కూడా అసూయ పడాల్సిందే. మన్లో మనమాట. నాకు బోలెడంత ఆస్తి ఉంది. యవ్వనం నాదీను.

నా చక్కదనం మాటంటారా, నామీద తమ ఆశ లెట్టుకుని అనేక మంది ఫిలిం డైరెక్టర్లుగా మారుతున్నారు. ఇదేమిటి నా నెత్తిలా వుంది. కార్ష్ణిజీగారు చెప్పిందేమిటి ? నే చేస్తున్నదేమిటి ?

నన్ను గురించి నాకు నిజం తెలిసింది. నేను 'స్టుపిడ్'ని 'ఫూల్'ని అని. జ్ఞానంపై పగ తీర్చుకోడానికి కాచుకుని ఉన్నా. ఒక రాత్రి సమయం చిక్కింది. ఆనాడు పెద్ద వర్షం. వాళ్ళ ఆఖరి చెల్లెలికి తేలు కుట్టింది. మందుకోసం వొచ్చింది. మా అత్త నడిగింది.

పదివేలు, పదివేలు, పదివేలు.

నేను మందుకడిక, దీపం తీసుకుని వాళ్ళ ఇంటికేసి నడవడం మొదలెట్టాను. దీపం వొదిలేశాను. చీకటి. నా చేతులకి ఆమె భుజాలు తగిలాయి. గట్టిగా పట్టుకున్నాను- నా బొటనవ్రేలుకి ఆమె మెత్తని గడ్డం తగిలింది. నిశ్శబ్దం. "నీ సౌందర్యం...." అని ఆరంభించాను. మూతి మీద 'ఛెళ్ళ'మని తగిలింది. నిజంగా చేతులకి గాజులు లేకపోవడం చాలా మంచిదనిపించింది. తొందరగా వెళ్ళిపోయింది.

ఆనాడు శనివారం. ఇంట్లో ఉంటుందనుకుని ఏదో వొంకన వాళ్ళ ఇంటికెళ్ళాను. వాళ్ళమ్మ ఆహ్వానించింది. కుర్చీలో కూర్చున్నాను. కాఫీ ఇచ్చింది. "జ్ఞానం కాలేజీకెళ్ళింది" అన్నది. శనివారం ప్రైవేటు క్లాసులు.

"నేను జ్ఞానంకోసం రాలేదు. మా మామ జబ్బుని గురించి మీ పెద్దమ్మాయితో మాట్లాడడానికొచ్చాను" అన్నాను.

"ఆస్పత్రి కెళ్లింది."

అప్రయత్నంగా బల్లమీద ఉన్న కాగితాల దొంతర కెలికాను. చెత్తకింద, ఒక అంగ్ల గ్రంథరాజం కనిపించింది. అట్టమీద 'జ్ఞానం' పేరు వ్రాసింది. అది పుట్టినరోజుకి వాళ్ళ లెక్కల ప్రొఫెసర్‌గారు బహుమానంగా ఇచ్చినట్లు ఆయన సంతకం ఉంది. అది 'హిల్' దొరగారిచే స్త్రీలకోసం వ్రాయబడిన గ్రంథం.

"నువ్వు వాంఛించిన పురుషుణ్ణి పొంది, నీ పాదాలముందు బొమ్మలా ఆడించడం ఎల్లా?" ఈ ప్రశ్నకి సమాధానాలున్నాయి. అందుచే క్రింద అందులోని నాలుగు విషయాలు వ్రాస్తాను.

1. పురుషుడికేసి చూడు. అతను చూడకుండా ఇట్లా చేస్తున్నావని అతను తెలుసుకునేటట్లు చెయ్యి.

2 అసంభవం, అలభ్యం, అసాధ్యం అనుకునేటట్లు ప్రవర్తించు.

3. పొగిడినకొద్దీ తిట్టు, ఏం భయంలేదు.

4. మీదికొచ్చినప్పుడు లెంపకాయ తగిలించు. ఇది చేస్తివా, నీ ముందు కుక్కలా తిరుగుతాడు.

పుస్తకం మూసేసి మా ఇంటికి పారిపోయాను. మానవుడుగా ఉండడం నిశ్చయించుకుని నాగరిక ప్రపంచంలో, స్త్రీలు, పురుషులు ఎట్లా ప్రేమించుకోవాలో, పుస్తకాల ద్వారా తెలుసుకునే గతి పట్టినందుకు విషాద గీతికలు ఏకవేనా రాస్తే బాగుండును.

అకలి, శరీరవాంఛ, ఇవి సృష్టికి సంబంధించినవి. అన్ని ప్రాణులకి నేర్పకుండా సహజంగానే తెలుస్తాయి ఈ రెండూను. నిజానికి అన్ని జంతువులు బాగా చెయ్యగల్గిన పన్లు ఈ రెండూను, తిండి తినడం, ప్రేమించడం ఒక మానవుడికి మాత్రం, ఈ నాగరిక ప్రపంచంలో చేత కావు. పుస్తకాలు చదివి పిల్లల్ని కనే గతి భారత స్త్రీకి పట్టినప్పుడు చాలా తొందర్లో ఈ జాతి నశించే సూచనలు కనిపిస్తున్నాయి.

పాతికవేలు, పాతికవేలు, పాతికవేలు.

